# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028619

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంస్కృతి - సంప్రదాయం
# (ధర్మపీఠం)

ప్రశ్నలు - సమాధానాలు

రచయిత్రి

ద్రొవ్విడి (తురగా) సూర్య నాగ శమంతకమణి M. A.

హైదరాబాద్

పురాణాలు, ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు, జ్యోతిశ్శాస్త్రం - వంటివానిలోని వివిధ ఆర్ష భారతీయ విజ్ఞాన విశేషాలు, మనం పాటించే అనేక ఆచారాలు, సంప్రదాయాలు - వంటి ప్రాచీన విజ్ఞానానికి సంబంధించిన అనేక విశేషాంశాలూ, వివరణలూ, ధర్మసూక్ష్మాలూ, పౌరాణిక మూల గాధలూ. వీటిపై పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు.

# కృతి సమర్పణం :



కలౌ కుమార రూపేణ షణ్ముఖో భగవాన్ హరిః
దృశ్యతైక ముఖేనైవ వేంకటాచల నాయకః॥
"సుబ్రహ్మణ్య కుమారాఖ్యా విష్ణ్వాఖ్యా వేంకటాచలే।
శేష శైషి కలాబ్రాహీ సర్వచైతన్య రూపిణీ।
శ్రీ వేంకటేశ్వర రూపేణ కలౌ ప్రత్యక్ష దర్శనం॥

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేతుడు, దేవీ, హరి, హర, సుబ్రహ్మణ్య స్వరూపుడైన శ్రీ వేంకటాచల నాయకుడు, శేష శైలవాసుడు శ్రీనివాసుని పదకమలాలకు ఈ గ్రంథాన్ని అంకితంగా భక్తితో సమర్పిస్తున్నాను.

ద్రావిడి (తురగా) సూర్య నాగ శమంతకమణి M. A,

This book is published with the financial assistance of Sri Tirumala Tirupathi Devasthanams under their scheme

"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

# ఈ గ్రంథ రచనలో నాకు ఉపకరించిన ప్రామాణిక గ్రంథాలు.

శుక్ల యజుస్సంహిత, కృష్ణయజుస్సంహిత, తైత్తిరీయ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణం, గోపథ బ్రాహ్మణం, షడ్వింశ బ్రాహ్మణం, తైత్తిరీయారణ్యకం, ఐతరేయారణ్యకం, అగస్త్య సంహిత, మారీచసంహిత, భృగుసంహిత, వశిష్ఠ సంహిత, పరాశర స్మృతి, ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, తైత్తిరేయోపనిషత్తు, ఐతరేయోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, ఆపస్తంబసూత్రాలు, మత్స్యపురాణం, మార్కండేయ పురాణం, భాగవత పురాణం, భవిష్య పురాణం, బ్రహ్మాండ పురాణం, బ్రహ్మపురాణం, బ్రహ్మవైవర్తపురాణం, వామన పురాణం, వాయుపురాణం, విష్ణుపురాణం, వరాహపురాణం, అగ్నిపురాణం, నారదపురాణం, పద్మపురాణం, లింగపురాణం, కూర్మపురాణం, స్కాందపురాణం, విష్ణుధర్మోత్తరపురాణం, శైవాగమం, పాంచరాత్రాగమం, వైష్ణవాగమం, వైఖానసాగమం, సుప్రభేదాగమం, కామికాగమం, గృహ్యసూత్రాలు, మనుస్మృతి, చరక సంహిత, సుశ్రుత సంహిత, సమరాంగణ సూత్రధారం, మానసారం, అపరాజితపృచ్ఛ, శిల్పకళాదీపిక, విశ్వకర్మవాస్తుశాస్త్రం, మండన సూత్రధారం, రాజసింహవాస్తువు, దీపార్ణవము, వాస్తుశాస్త్రము, శిల్పరత్నము, మయమతము, ఈశాన శివగురుదేవ పద్ధతి, ఇత్యాది వాస్తుశాస్త్ర గ్రంధాలు; జాతక పారిజాతము, బృహత్పరాశరహోరాశాస్త్రము, బృహజ్జాతకము, పూర్వకాలామృతము, ఉత్తర కాలామృతము, బృహద్దైవజ్ఞరంజనము, జ్యోతిర్విదాభరణం వంటి జ్యోతిశ్శాస్త్ర గ్రంధాలు; ఇంకా పురుషార్థ చింతామణి, వీరమిత్రోదయం, విద్యామాధవీయం, అమరకోశం, ధర్మసింధు, నిర్ణయ సింధు, స్మృతికౌస్తుభము, వాల్మీక రామాయణము, వ్యాసకృత భారతము, తదంతర్గత భగవద్గీత, శ్రీమదాంధ్ర మహాభాగవతము, శ్రీమదాంధ్ర మహాభారతము, హరివంశం - ఇత్యాదులు.

బాల్యాదిగా ఈ గ్రంధాలను అధ్యయనం చేసి ఉండడం - ఈ గ్రంధ రచనలో నాకు ఎంతగానో ఉపకరించింది. ఆయా గ్రంధకర్తలకు - శిరసా ప్రణమిల్లుతున్నాను.

ఖండన నిమిత్తం కోట్ చేసిన అప్రామాణిక గ్రంధాలు : 1. విచిత్ర రామాయణం, 2. అద్భుత రామాయణం.

**క్రొవ్విడి (తురగా) సూర్య నాగ శమంతకమణి, యం. ఏ.**
**హైదరాబాద్**

# మనవి

ఆర్షమైన భారతీయ విజ్ఞానం - సకల విశ్వానికి ప్రథమ సూర్యోదయం. భువన భవనాన్ని తమ విజ్ఞాన దీధితులతో దీప్తిమంతంచేసిన - ద్రష్టలైన ఋషి ప్రవరుల పరంపరలోనిది ఈ భారత జాతి. ఈ జాతికిగల సాంస్కృతిక వారసత్వం నాన్యతోదర్శనీయమైనది.

అంతటి మహత్వ పూర్ణమైన ఘనచరిత్రను కలిగి ఉండి కూడా - రాజకీయమైన ఆటుపోటుల ఫలంగా భారత జాతి వైదేశిక బానిసత్వానికి లోను కావలసి వచ్చింది. అట్టి స్థితిలో భారత జాతియొక్క సంస్కృతీ సంప్రదాయాలకు తిరిగి వెలుగు చూపాలంటే_

మన సంప్రదాయాలలో దాగి ఉన్న అంతరార్థాలేమిటి? ప్రతి విషయానికీ ప్రామాణికంగా, శిరోధార్యంగా మనం చెప్పుకొనే వేదాలలోనూ, ధర్మశాస్త్రాలలోనూ, పురాణాలలోనూ ఉన్న విశేషాంశాలేమిటి? - ఇవన్నీ జాతికి వివరించడం అవసరం.

రామాయణ భారత భాగవత గాథలను గురించి ప్రజానీకంలో ఎన్నో అపవాదాలు, అపోహలు - ప్రచారంలో ఉన్నాయి. వాటికి సంబంధించిన వాస్తవాలను జనానీకానికి తెలియపరచ వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

వేద శాస్త్ర పురాణాలలోని విషయాలను గురించి, మనం పాటించే అనేక సంప్రదాయాలను గురించి ఎన్నో సందేహాలు నేటి సామాన్య ప్రజలకూ, ముఖ్యంగా యువతకూ ఉన్నాయి. ఈ సంప్రదాయాలలో, శాస్త్రాలలో ఉన్న అంతరార్థాలేమిటి? ఇవి ఏయే కారణాలుగా ఏర్పరచబడ్డాయి? వాటిని ఏర్పరచిన మహనీయులు ఆశించిన పరమ ప్రయోజనాలు ఎటువంటివి? ఇత్యాది విషయాలన్నిటినీ నేటి యువతకు వివరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది

ఋషిప్రవరుల వారసత్వంలోని మహత్వ పూర్ణతనూ, తేజో గరిమనూ భారత జాతి తిరిగి పొందాలనే ఆశయంతో చేసిన ప్రయత్నమిది.

పరంపరాగతమైన ఆర్షభారతీయ మహావిజ్ఞాన తేజః పుంజంపైన ఆవరించుకొని ఉన్న నివురును తొలగించి - ఆ కాంతిచ్ఛటలను జాతికి పునర్దర్శనం చేయించాలనే సదాశయంతో పరమేశ్వరార్పణంగా చేసిన ఈ ప్రయత్నానికి సహృదయతతో స్వాగతమిచ్చి ఆదరిస్తారనే విశ్వాసంతో ఈ గ్రంథాన్ని మీముందు ఉంచుతున్నాను.

విజ్ఞానానికి మూలం ప్రశ్న. తెలుసుకోవాలనే తృష్ణకు బీజం సందేహం ఈ ప్రశ్నలకూ సమాధానాలకూ ఇది ప్రారంభం మాత్రమే. సహృదయులైన పాఠకులు - ఏ సందేహం కలిగినా - దానిని ఈ గ్రంథంలో ఇచ్చిన నా ఎడ్రస్‌కు వ్రాయవచ్చును. తర్వాతి భాగాలలో ఆ ప్రశ్నలకు సమాధానం ఈయబడుతుంది.

"సంస్కృతి సంప్రదాయం" (ధర్మపీఠం) అనే ఈ గ్రంథం భారతీయ ఆర్ష సంప్రదాయానికి చెందిన అనేక ప్రాచీన విజ్ఞాన విశేషాలనూ, ధర్మ సూక్ష్మాలనూ, మూల గాధలనూ వివరించడానికి ఉద్దేశించబడింది.

వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, స్మృతులు, ఇతిహాసాలు ఇత్యాదుల లోని ధర్మ సూక్ష్మాలను గురించి ఎన్నో విశేషాంశాలు దీనిలో వివరించబడినాయి.

శాస్త్ర విషయాలను గురించి, ఆర్ష సంప్రదాయాన్ని గురించి - సామాన్య పాఠక జనానీకానికి కలిగే అనేక సందేహాలకూ ప్రశ్నలకూ సమాధానరూపమే ఈ గ్రంథం.

ఇది హేతువాదయుగం. ప్రతి విషయాన్నీ - "ఎందుకు? ఏమిటి? ఏ విధంగా?" - అని ప్రశ్నించడం ప్రస్తుతకాల లక్షణం. ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగితేనే ఆర్షమైన భారతీయ సంప్రదాయం మనగలుగుతుంది. ప్రాచీనార్ష విజ్ఞాన విషయంలో ప్రస్తుత సమాజానికి కలిగే సందేహాలకు సమాధానం చెప్పడమూ, ఆర్షమైన విజ్ఞానానికి సంబంధించిన వివిధ విషయాలను శాస్త్రబద్ధంగా వివరించడమూ, ఆర్షభారతీయ విజ్ఞానానికి సంబంధించి ప్రజానీకంలో ప్రచారంలో ఉన్న అనేక అపోహలను తొలగించడమూ, ఆర్షభారతీయ విజ్ఞానానికి ప్రజానీకంలో ప్రాచుర్యాన్ని కలిగించడమూ - ఈ గ్రంథలక్ష్యాలు.

ఈ గ్రంథంలో ఉదాహరించిన, వివరించిన — విషయాలేవీ నిరాధారాలు కావు దీనిలో నేను మనవి చేసిన విషయాలన్నీ సప్రమాణాలని సవినయంగా విన్నవించుకొంటున్నాను. ఆర్షవిజ్ఞాన రాశీభూతాలైన గ్రంథాలనూ, సర్వులూ శిరోధార్యంగా అంగీకరించదగిన గ్రంథాలనే ప్రమాణంగా స్వీకరించాను. ఆయా గ్రంథాంతర్గతమైన విషయాలనూ, ఆయా గ్రంథకర్తలు నిష్కర్షచేసిన విషయా

లనే పరమ ప్రమాణంగా స్వీకరించాను. వివాదాస్పదమైన తావులలో ఆయా గ్రంథకర్తల అభిప్రాయాలే పరమప్రమాణాలు. రామాయణ భారత విషయాలకు వాల్మీకి రామాయణాన్ని, వ్యాసభారతాన్ని మాత్రమే స్వీకరించాను. వానికి భిన్నమైన, వ్యతిరేకమైన జనశ్రుతులనూ, అపార్థాలనూ, ప్రవాదాలనూ నిర్ద్వంద్వంగా ఖండించి, మూలకర్తల హృదయాన్ని ఆవిష్కరించడమే నేను చేసినది.

ఈ గ్రంథంలోని విషయాలన్నీ ఇంకా ఎంతో సవిస్తరంగా చర్చించదగినవి. వీనికి గ్రంథప్రమాణాలు కూడా - ఇవ్వదగినవి ఇంకా ఎన్నో ఉన్నాయి. కానీ పాఠకులకు విసుగు కలగకూడదనే అభిప్రాయంతో - ప్రతి విషయాన్నీ కూడా ప్రయత్నంతో కుదించి వ్రాయవలసి వచ్చింది. చెప్పదగిన విషయం ప్రతి సందర్భంలోనూ ఇంకా ఎంతో ఉన్నప్పటికీ - చెప్పాలనే ఉత్సాహాన్ని సంయమనంతో నియమించుకోవలసి వచ్చింది. కారణం - గ్రంథవిస్తరభీతి, పాఠకుల ప్రతిస్పందనం ఏవిధంగా ఉండగలదోనన్న సందేహమూ మాత్రమే. సహృదయులు ప్రోత్సహించినట్లయితే - మరింతగా విషయాన్ని అందజేయడానికి అభ్యంతరం ఏమీలేదు.

ఈ గ్రంథాన్ని వ్రాసి ప్రచురించడం ద్వారా ఆర్షవిజ్ఞానానికి నా ఓపినకొలది సేవ చేసి - ఋషి ఋణం తీర్చుకొంటున్నానని నా వినమ్ర భావన.

"........తెలిసి పలుకుట కష్టంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేట పరతు."

అని విన్నవించుకొంటున్నాను.

వేదాలు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలు, స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు - మొదలైన ప్రాచీన విజ్ఞానానికి సంబంధించిన వివిధ విషయాలకు చెందిన సందేహాలకు సమాధానాలను ఇప్పించడానికీ, శాస్త్రవివాదాల పరిష్కారానికీ, అంతరార్థాలను చెప్పించడానికీ 1988లో ఆంధ్ర ప్రభ వారపత్రికవారు 'ధర్మపీఠం' శీర్షికను ప్రారంభించారు. ఆనాటినుండి నేటివరకూ ఆ శీర్షికలో పాఠకులు ఇన్ని సంవత్సరాలుగా ప్రతివారమూ అడిగిన ప్రశ్నలకు నేనిచ్చిన సమాధానాలివి. ఆంధ్రప్రభ వారపత్రిక "ధర్మపీఠం" "సంస్కృతి సంప్ర

దాయం" శీర్షికలతో ప్రచురితమై పాఠకాదరణనూ, పండిత జనామోదాన్నీ పొందాయి.

ఆర్ష భారతీయ విజ్ఞానానికి తిరిగి వెలుగు చూపదలచి - ''ధర్మపీఠం'' శీర్షికను ప్రారంభించి శ్లాఘనీయంగా నడిపించిన అభినందనీయులు - ఆంధ్ర ప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావుగారికి, 'సంస్కృతి - సంప్రదాయం' శీర్షికను ప్రారంభించి అభినందనీయంగా నడిపిస్తున్న శ్రీ వాకాటి పాండురంగారావుగారికీ, ఈ శీర్షికలను అత్యుత్తమంగా నిర్వహిస్తున్న శ్రీ తిరుమల రామచంద్రగారికి శిరసా నమస్కరిస్తున్నాను. వారు ఈ శీర్షికలను ప్రారంభించిన దానికి ఫలంగా ఆర్ష విజ్ఞానానికి నేను యథాశక్తిగా సేవచేయడం సాధ్యమయినందుకు వారికి నా కృతజ్ఞతా ప్రణామాలు. నా రచనలను ఆదరించిన ఆంధ్రప్రభ పాఠక లోకానికి నా వందనాలు.

మాన్యులు మా అన్నగారైన శ్రీ 'సిరివెన్నెల' సీతారామశాస్త్రిగారు, మాన్యులు డాక్టర్ శ్రీ మహీధర నళినీమోహన్‌రావుగారు - ఇచ్చిన ప్రోత్సాహం వల్లనే నేనీ గ్రంథాన్ని ప్రచురించగలిగాను. పూజ్యులైన వారిరువురికీ నా కృతజ్ఞతా వందనాలు.

ప్రింటర్ యొక్క లోపంవల్ల వచ్చిన అచ్చు తప్పులను పాఠకులు క్షమించాలని నా విన్నపం.

ఈ గ్రంధ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతా నమస్సులు.

నాకు తమ అమూల్య సహకారాన్ని అందించిన శ్రీ **T. R.** రావుగారు (న్యూఢిల్లీ), వారి కుటుంబ సభ్యులకు నా కృతజ్ఞతలు.

క్రొవ్విడి (తురగా) సూర్య నాగ శమంతకమణి యం. ఏ.

హైదరాబాద్



పితృపాదులు శ్రీ తురగా సుందర సీతారామ వెంకట హనుమంతరావుగారు
హెడ్ డిపార్ట్మెంట్ ఆఫ్ ఎకనామిక్స్, వై. ఎన్. కాలేజీ నరసాపురం

మాతృమూర్తి శ్రీమతి వెంకట రామ సత్యవతి.

పూజ్యులైన నా జన్మ ప్రదాతలకు, నా మాతామహి
పిల్లారి మహాలక్ష్మమ్మగారికి నా భక్తి ప్రపత్తులను
తెలుపుకొంటూ శిరసా నమస్కరిస్తున్నాను.

నా బాల్యంలో క్లాసులో పురాణ కథలు చెప్పిన మా స్కూలు టీచరు
పూజ్యులు బ్రహ్మశ్రీ ముష్టి గురుమూర్తిగారికి
నా కృతజ్ఞతా వందనాలు అర్పిస్తున్నాను.

క్రొవ్విడి (తురగా) సూర్య నాగ శమంతకమణి M. A.

హై ద రా బా ద్

# విషయ సూచిక

| ప్రశ్న సంఖ్య | ప్రశ్న | పేజి నంబరు |
|---|---|---|
| 1. | "శ్రీవాతాపి గణపతి భజేహం..." అనే కీర్తనలో గణపతి', వాతాపికి ఏమి సంబంధం ? | 1 |
| 2. | దేవాలయాలలో ధ్వజస్తంభాలెందుకు? వాటి ప్రాముఖ్యం ఏమిటి? | 2 |
| 3. | హరిశ్చంద్రుని గురించి వేదంలోనూ, పురాణాలలోనూ, కావ్యాలలోనూ రకరకాల గాధలు - పరస్పరం సంబంధం లేనివి- ఉన్నాయంటారు. అవి ఏవి ? | 11 |
| 4. | శుక్రాచార్యునికి తెలిసిన మృత సంజీవని విద్య బృహస్పతికి ఎందుకు తెలియదు? | 15 |
| 5. | దశరథుని కుమార్తె శాంత - కౌసల్య, సుమిత్ర, కైకేయిలలో ఎవరి కుమార్తె? | 16 |
| 6. | ద్రౌపది కాక ఇతరులెవరైనా బహు భర్తలను కలిగి ఉన్న భార్యలు - ప్రాచీన కాలంలో - ఉండి ఉన్నారా ? | 17 |
| 7. | బ్రాహ్మణుడైన పరశురామునికి, క్షత్రియుడైన విశ్వామిత్రునికి బంధుత్వం ఉందా ? | 18 |
| 8 | శివ ధనువును ఎత్తలేని రావణుడు - ఆ ధనువును ఎత్తిన సీతాదేవిని ఎలా ఎత్తుకొని పోగలిగాడు? | 20 |
| 9. | మహాభారతంలో పాండుపుత్రులు పాండవులు, ధృతరాష్ట్రుని పుత్రులూ కౌరవులూ ఎలా ఐనారు? అన్నదమ్ముల సంతానాలకు ఆ తేడా ఎలా వచ్చింది ? | 23 |
| 10. | శ్రీరాముడు, పరశురాముడు — ఈ రెండు అవతారాలెత్తినది శ్రీ మహావిష్ణువే. మరి ఈ రెండు అవతారాలూ ఒకేసారి ఎదురు పడతాయి. అదెలా సాధ్యం ? | 26 |

# ముందుమాట

పొత్తూరి వెంకటేశ్వరరావు

వేదవేదాంగాలకు, పురాణేతిహాసాలకు ఈ భరతఖండంలోనే పుట్టి, ఇక్కడే ప్రవర్థిల్లిన ఇతర ప్రాచీన సారస్వతానికి సరితూగగల సాహిత్యం ప్రపంచంలో మరెక్కడాలేదు కేవలం స్వదేశాభిమానంతోనో, "మనది" అనే సంకుచిత భావనతోనో ఇలా అనడంలేదు. ఇది మనలను మనం పొగడుకోవడం అంతకంటే కాదు. రాగ ద్వేషాలకూ స్వపర ద్వంద్వానికీ అతీతంగా విలువలను మదింపు చేసిచూస్తే ఎవరైనా ఒప్పుకొని తీరవలసిన సార్వకాలికసత్యమిది. ఇంతటి ఘనమైన జ్ఞానసంపద మనకు ఉన్నప్పటికీ మనలోనే కొందరికి దానిని గురించి తగిన అవగాహనలేదు. దురదృష్టవశాత్తు జన జీవితంలో కాలక్రమాన పాతుకుపోయిన కొన్ని దురాచారాలను, మూఢవిశ్వాసాలను, ప్రామాణిక గ్రంథాలలో కుహనా పండితులు ప్రక్షిప్తం గావించిన అశాస్త్రీయ, అప్రమాణిక అంశాలను దృష్టిలో పెట్టుకొని ఇదేకదా మన ఆధ్యాత్మిక ఆదిభౌతికవారసత్వమనుకొనేవారు కొందరు మనలోనే ఉన్నారు. రాయికీ రప్పకూ, పుట్టకూ చెట్టుకూ మొక్కుకోవడమే భారతీయ మతమనే దురభిప్రాయం విదేశీయులలో ఉంటే ఆశ్చర్యంకాదు సంస్కృతభాష తెలియక, మన పాచీన గంధాలను చదవక, దృష్టించిన ఏవో కొన్ని విశేషాలను మాత్రం ఆలంబనం చేసుకొని అలా వారు అభిప్రాయాలను ఏర్పరచుకొని ఉండవచ్చు. ఈ గడ్డమీద ఒక రాయికి పసుపు పూసి, కుంకుమ దిద్ది దేవతగా కొలవడమూ ఉంది. నిరాకార, నిర్గుణ పర బ్రహ్మ స్వరూపాన్ని ధ్యానించడమూ ఉంది. ఇంతటి వైవిధ్యాన్ని తెలియని వారు పొరపాటు పడవచ్చు. ఐతే, ఎందరో పాశ్చాత్యులు సంస్కృతం నేర్చుకొని, అందులో పాండిత్యం కూడా సంపాదించి, మన ప్రాచీన గ్రంథాలను అధ్యయనం చేశారు. సహృదయులై అలా అర్థం చేసుకున్నవారు మన వైదిక గ్రంథాలను ఘనంగా శ్లాఘించారు కాని దురదృష్టం ఏమిటంటే అవకాశాలు ఉండి కూడా మనం సంస్కృతం చదవక, ఇంగ్లీషులో వెలువడిన కొన్ని

గ్రంథాలను ఆధారం చేసుకొని వేదవేదాంగాలను గురించి చులకన భావన కలి గించుకోవడం.

బ్రిటిష్‌వారు తమ పరిపాలనలో మనచేత సేవ చేయించుకోవడంకోసం మాత్రమే ఇంగ్లీషువిద్య నేర్పారు. అది మనలో కొద్దిమందికి జీవికకోసం ఉప యోగపడినమాట వాస్తవం పాశ్చాత్య విజ్ఞానానికి అది మనకు తలుపులు తెరచినమాట కూడా నిజం. ఐతే పాశ్చాత్య విద్య మనలను మన ప్రాచీన శాస్త్రాలనుంచి దూరం చేసింది దానికి మన స్వయంకృతాపరాధం తోడైంది. మన పూర్వీకులు అపారమైన మన జ్ఞానసంపదను గుప్తంగా ఉంచడానికి ప్రయ త్నించారు. దుర్వినియోగం కాకుండా జాగ్రత్తపడటంకోసం కావచ్చు. అనేకానేక శాస్త్ర రహస్యాలను మార్మిక పద్ధతిలో గ్రంథస్థం చేశారు. మన విద్యాసంపద కొందరికే పరిమితం కావడంవల్ల దేశానికి ఎనలేని హాని కలిగింది అప్పుడు అలా ఎందుకు జరిగిందని ఊహించడానికి ప్రయత్నించి ప్రయోజనంలేదు. నాటి జన బాహుళ్యానికి అప్పట్లో అదే మంచిదని అనిపించి ఉండవచ్చు లేక పోతే తిరగబడి ఉండేవారేకదా! ఏమైతేనేమి ఆధునిక భారతీయులు చాలా మందికి ప్రాచీన విజ్ఞానంపట్ల, సంప్రదాయాలపట్ల సరైన అవగాహనలేక చులకన భావన కలిగింది ఈ పరిస్థితి మారక తప్పదు. ప్రాచీన భారతీయ విజ్ఞానం జన సామాన్యానికి అందుబాటులోకి రావలసి ఉంది. కాలప్రవాహంలో కాలుష్యం చేరడంవల్ల ఏర్పడిన అనారోగ్య పరిస్థితి చక్కబడవలసి ఉంది. అందుకే చీకటిలో ఒక చిరుదీపమైనా వెలిగించి తనవంతు కర్తవ్యాన్ని నెరవేర్చాలని తలచి "ఆంధ్రప్రభ" సచిత్రవారపత్రిక "ధర్మపీఠం" శీర్షికను నిర్వహించింది పాఠకుల ప్రశ్నలకు సందేహాలకూ విద్వాంసులచేత సమాధానాలు ఇప్పించడం ఈ శీర్షిక ముఖ్య కార్యక్రమం అదృష్టవశాత్తు శాస్త్రవిషయాలకు సరైన అర్థాలు చెప్పగల వివరణ ఇవ్వగల పండితులు అనేకమంది మనకు ఉన్నారు. స్వయంగా అధ్యయనంచేసినవారేగాక, అలా అధ్యయనంచేసిన వారినుంచి విషయ సేకరణ చేసి ఈ శీర్షికకు రచనలు పంపినవారూ ఉన్నారు. పాఠకులనుంచి మంచి స్పందన లభించిన శీర్షికలలో "ధర్మపీఠం" ఒకటి

"ధర్మపీఠం" ఆంధ్రప్రభ పాఠకులకు పరిచయంచేసిన ఒక రచయిత్రి శ్రీమతి ద్రావిడి నాగశమంతకమణి. ఆమె రాజకీయశాస్త్రంలో పోస్టు గ్రాడ్యు

యేట్. డిగ్రీలకోసం చదివిన చదువు ఏదైనా ఆమెకు అభిమాన విషయం మాత్రం మన వైదిక విజ్ఞానం. ఆగమ, వాస్తు, జ్యోతిషాది శాస్త్రాలతో సహా మన ప్రాచీన గ్రంధాలనేకం ఆమె అధ్యయనం చేశారు. "ధర్మపీఠం" శీర్షికకు వచ్చిన అనేకానేక సంక్లిష్ట ప్రశ్నలకు ఆమె సమాధానాలు రాసి పంపుతూండేవారు. ఏ ఒక్కరి రచనలను అతిగా ప్రచురించరాదనే నియమం ఉన్నప్పటికీ, తార్కికంగా, శాస్త్రబద్ధంగా, పరమ ప్రామాణికంగా ఉండటంవల్ల ఆమె పంపిన సమాధానాలను ప్రక్కన పెట్టడం సంపాదకవర్గానికి ఒకంతటసాధ్యమయ్యేదికాదు. అలా ఈ శీర్షిక కింద తరచుగా కనిపించిన పేర్లలో ఆమె పేరు కూడా ఒకటైంది. ఇలాంటి రచనలో కేవలం విషయ పరిజ్ఞానం చాలదు ప్రాచీన గ్రంధాలలో మార్మికంగానో, కవితాత్మకంగానో నిక్షిప్తమైఉన్న సమాచారాన్ని గ్రహించే సామర్థ్యంతోపాటు, దానిని సామాన్య పాఠకులకు అర్థమయ్యేరీతిలో చెప్పే నేర్పూ, ఓర్పూ కావాలి. శ్రీమతి సూర్యనారాయణ సంతకమణిగారికి ఈ యోగ్యతలన్నీ నిండుగా ఉన్నాయి. అందుకే "ఇంద్రప్రభ" పరంగా సందేహాలకు సమాధానాలు ఇవ్వడమేగాక ప్రశ్నోత్తరాల రూపంగా ఇప్పుడామె గ్రంధ ప్రచురణకు పూనుకొన్నారు. ఇది లోకోపయోగకరం.

విజ్ఞాన ప్రదాయకంగా తార్కికంగా, యుక్తాయుక్తంగా రచయిత్రి పాఠకుల ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలలో మచ్చుకు కొన్ని

"పాండురంగమహాత్మ్యంలో" నిగమశర్మ "సప్తాక్షరీ మంత్రం" చేసినట్టు ఒక చతురోక్తి ఉంది. సప్తాక్షరీ అంటే అందరికీ తెలిసిన పంచాక్షరీ, అష్టాక్షరిలాంటి మంత్రంలాంటిదని ఎవరైనా పొరబడే ప్రమాదం లేకపోలేదు. ఇది బీజాక్షరాలతో సంపుటీకరించిన మహామంత్రం కాదనీ భవతి భిక్షాందేహి" అనే యాచన వాక్యమనీ రచయిత్రి వివరణ. చమత్కారాలూ, చతురోక్తులూ అర్థం చేసుకొనలేని వారికి ఇలాంటి వివరణలు అవసరమే. నైష్ఠికులు తమ ఆహారంలో నీరుల్లిని, వెల్లుల్లిని పరిహరించడం కొందరి దృష్టిలో పరిహాసాస్పదం. ఆహార పదార్థాలకు శరీరాన్నేగాక మనసును కూడా ప్రభావితంచేసే లక్షణాలు ఉంటాయనీ, రాజస, తామస గుణాలు కలిగిన ఆహారం అసలే చంచలమైన మనస్సును మరింత చంచలం చేస్తుందనీ మన పూర్వీకులకు తెలుసు. అందుకే కామ ప్రకోపగుణం కలిగిన ఉల్లిని నైష్ఠికులూ, సాధకులూ దూరంగా

ఉంచారు. అనాదిగా వస్తున్న ఆచార వ్యవహారాలనూ, ఆహార విహారాది అల వాట్లనూ సహృదయంతో అర్థం చేసుకొంటే అందులోని ధర్మసూక్ష్మాలూ, ఆరోగ్య సూత్రాలూ సుబోధకమవుతాయి రచయిత్రి ఇలాంటి వివరణలు ఎన్నో ఇచ్చారు.

ధ్వజ స్తంభ నిర్మాణం ఆలయానికి పిడుగుపాటు ప్రమాదాన్ని నివారి స్తుందని శరీర శాస్త్రరీత్యా ఆయా శరీర భాగాల్లో ఆయా అలంకరణలు ఉంచడంవల్ల కొన్ని వ్యాధులు రావనీ, పూర్వాచారాలకూ, శాస్త్రాలకూ సంప్ర దాయాలకూ రచయిత్రి వ్యాఖ్యానాలు అందించారు. "వధూవరులు మూడు పురుషార్థాలలోనూ ఏకీభవించడమే మూడు ముడుల భావం" అని ఆమె చేసిన మరొక వ్యాఖ్య. పోతనగారు భాగవతంలో శివకేశవుల అభేదాన్ని ఎలా ధ్వని ప్రధానంగా చెప్పారో ఒకనొక ప్రశ్నకు సమాధానంలో ఆమె విశ్లేషించారు. తాతాచార్యముద్ర, ''బ్రహ్మవ్రాత, ''బ్రహ్మరథం అంటే ఏమిటో, "చంద్రు నికో నూలుపోగు'' అనే నుడి ఎలా వచ్చిందో ఆమె తెలియచేసిన తీరులో పాండిత్యమూ ఉంది ప్రపంచ జ్ఞానమూ ఉంది.

భారతీయ ధర్మసంబంధమైన అనేకానేక సందేహాలకు చక్కని సమా ధానాలతో ప్రజోపయోగకరమైన గ్రంథాన్ని వెలువరిస్తున్నందుకు శ్రీమతి క్రొవ్విడి సూర్యనాగశమంతకమణిగారికి శుభాభినందనలు.

# అభినందన

‘జిజ్ఞాస’ అంటే తెలుసుకోవాలనే కోరిక. ప్రాదమికదశనుంచి పరిణత దశవరకు ప్రతి మానవునికి ప్రశ్నలుదయించడం సహజం. ఎప్పుడు సందేహం కలుగుతుందో అప్పుడు ప్రశ్న పుడుతుంది. అయితే అందరూ తమలో ఉదయించిన ప్రశ్నలను ప్రకటించరు. పోనీలే అని మౌనంగా, ఉదాసీనంగా ఉండిపోతారు. నిజానికి ప్రశ్నించే గుణం ఉత్తమమైంది. ప్రపంచంలో యధార్థ విజ్ఞానానికి, ఆధ్యాత్మిక పరిజ్ఞానానికి ప్రశ్నలే మూలధాతువులు.

శ్రీమతి శమంతకమణిగారు వేదపురాణేతిహాసాదులలోని అనేక సూక్ష్మాంశాలను గురించి ప్రశ్నోత్తరరూపకంగా ఈ గ్రంధాన్ని సమర్థంగా సంతరించారు. మన ప్రాచీన గ్రంధాలను తూష్ణీంభావనతో చూడడం సమంజసంకాదు. ఎంత పచ్చని మొక్కలైనా వాటితోపాటు కలుపు మొక్కలు ఉంటాయి.

కలుపు మొక్కలున్నాయని అసలు మొక్కలను కూడా పనికిరావని ఈసడించడం భావ్యం కాదు. ఈ గ్రంధంలోని ప్రశ్నల్లో కొన్ని హేతువు కందనివి ఉన్నాయి, ఎందుకలా ఉన్నాయి అని తెలుసుకోవాలిగదా మనం. ఆ ధర్మసూక్ష్మాలను తెలుసుకున్న తరువాత, అవి నచ్చకపోతే విసర్జించవచ్చు. ఉదాహరణకు - రాముడు శివుని ధనుసు ఎందుకు విరిచాడు అని ప్రశ్న. విరవాలని కాదు. అనుకోకుండా అలా జరిగింది అని సమాధానం. శాంత దశరధుని కూతురా? అది ప్రశ్న. కాదు అని చక్కని వివరణ. వీటిలో కొన్ని ‘క్విజ్’లో వేసే ప్రశ్నల్లాంటివి ఉన్నాయి. కొన్ని కీలకమైన అంశాలను స్పృశించేవి ఉన్నాయి. వేద పురాణాదుల్లో ఉన్న వివిధ విషయాలను ఎంతో ఓపికగా క్రోడీకరించి చక్కని శైలిలో శమంతకమణిగారు ఈ గ్రంధాన్ని రచించారు. “ముందు కుడికాలు మోపాలి” లాంటి నమ్మకాలను గురించి కూడా ఎంతో ఆసక్తికరంగా వివరించారు వీరు. అలాగే ‘‘చుక్కెదురు, గొంతెమ్మ కోరికలు, ‘కొత్తబిచ్చగాడు పొద్దెరగడు’, ‘నల్లేరుపై బండినడక’ లాంటి నిత్య జీవితంలో తారసిల్లే అనేక విషయాలను గురించి యుక్తియుక్తంగా సమాధానాలు రాశారు. వీరు వివరించిన అంశాలన్నిటితో ఏకీభావం అందరికీ కలగకున్నా రచనా సామర్థ్యాన్ని మాత్రం జిజ్ఞాసువులందరూ మెచ్చుకుంటారనే నా విశ్వాసం.

ప్రశ్నోత్తరాల రూపంలో ‘సంస్కృతి - సంప్రదాయం’ అనే పఠనీయ గ్రంధాన్ని రచించిన శ్రీమతి క్రొవ్విడి (తురగా) సూర్యనాగశమంతకమణిగారికి నా హార్దికాభినందన.

సినారె

# నమస్కారం

ఈ శతాబ్దపు తొలిరోజులలో ఆ వేదాంత భాస్కరుడు స్వామి వివేకానంద అమెరికా (కాలిఫోర్నియా)లో మాట్లాడుతూ ఒక ఉదంతాన్ని ఉటంకించారు.

"నేను ఇంగ్లండులో ఉపన్యసిస్తున్న రోజులవి మేధావి అయిన ఒక ఇంగ్లీషుమిత్రుడు తర్కంలో ప్రశ్నలతో నన్ను ఎదుర్కొంటుండేవాడు. ఒకరోజు మాటలు వాదప్రతివాదాలూ అయ్యాక చివరకింక విసుగొచ్చి - ''మా ఋషులు మా ఋషులు అంటుంటారుకదా. మరి అన్నివేల ఏళ్ళక్రింద ఆ ఋషులు ఇంగ్లండుకు వచ్చి మాకివన్నీ బోధించలేదేమి?' అని అడిగాడు అప్పుడు నేను అప్పుడు ఇంగ్లండు అంటూ వుంటే కదా రావడానికి? మా ఋషులు వచ్చి అడవులకు చెట్లకు చెప్పివుండాలి అంటావా?' అని జవాబు ఇచ్చారు" అంటారు స్వామిజీ.

అదీ అసలు విషయం ఆరేడువేల సంవత్సరాలక్రింద, సర్వప్రపంచము ఏవిధమైన చీకటిలో వుండిందో నేటి చరిత్రకు తెలియనివేళ. ఈ పుణ్యభారత భూమి మీద ఉదయించిన జ్ఞానులు-నేటికీ ఆధునిక విజ్ఞానం ఇంకా అకచుటైనా తాకని సత్యాలపై, సంబంధాలపై తమ దృష్టిని సాధించారు.

ప్రాణం అంటే ఏమిటి?, మనస్సు అనేదాని భిన్న స్థితులేమిటి? తన్ను తనంతటతానే చూస్తుందా లేక కంటివెనక ఇంకేమయినా వున్నదా? ఆనందం ఎందులో వుంది? వంటి అగాధమైన విషయాలమీద దేశ కాలాపరిచ్ఛిన్నమైన సమాధానాలను 'అనుభవించారు,' ఆ తర్వాత వాటిని మాటలతో పొదిగి మనకు అందించారు. సుప్రసిద్ధ భౌతిక శాస్త్ర వేత్త, ఒకప్పుడు ఢిల్లీలోని జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులు అయిన డా॥ డి ఎస్. కొఠారి- ''ఆధునిక విజ్ఞానశాస్త్రపు పేరేపణలపై భారతీయ వేదాంత ప్రభావం ఎంతైనా వుంది ఈ విషయం మీద ఇంకా పరిశోధన జరగాల్సి వుంది-" అన్నారు.

ఆవిధంగా నేటి సైన్సుతో సమానస్థాయిలో కరచాలనం చేయగల మూల సత్యాలను ఆవిష్కరించిన భారతీయ సంస్కృతి తన్ను తాను ఎప్పటికప్పుడు సరిదిద్దుకుంటూ సరిక్రొత్త సత్యాలను పలకరిస్తూ, ఆయా శతాబ్దాల అవసరాల కనుగుణమైన రీతిలో సమాధానాలను వర్షిస్తూ వచ్చింది. ఆశ్చర్యం గొలిపే ఈ నిత్య చైతన్యపు వెలుగు కిరణాలను ఈశతాబ్దపు మహర్షి భారతరత్న పి.వి. కాణే తన ''ధర్మశాస్త్రాలచరిత్ర'', అన్న పుస్తకంలో శతాబ్దాలవారీగా పేర్కొంటూ ఒక జాబితా ఇచ్చాడు అందులోని కొన్ని అతిముఖ్య ఘట్టాలు.

| | | | | |
|---|---|---|---|---|
| క్రీ. పూ. | 4000 | - | 1000 | వేద సంహితలు, బ్రాహ్మణములు, ఉపనషత్‌లు |
| | | | | 800 500 నిరుక్తం |
| ,, | 800 | - | 400 | శ్రౌతసూత్రాలు, వేదాంగజ్యోతిషం |
| ,, | 600 | - | 3 0 | దర్మసూత్రాలు, పాణిని |
| ,, | 500 | - | 00 | జైమిని పూర్వ మీమాంస, భగవద్గీత |
| ,, | 1 0 | క్రీ త | 100 | మనుస్మృతి పతంజలి మహాభాష్యం |
| క్రీ.త | 100 | - | 300 | యాజ్ఞవల్క్యస్మృతి, విష్ణుధర్మ సూత్రాలు |
| ,, | 300 | - | 0 | బృహస్పతి స్మృతి (అలభ్యం) |
| ,, | 300 | - | 60 | పురాణాలు |

ఇట్లా ఇస్తూ చివర ఆయన 1730-1820 మధ్య 'మితాక్షర' మీద బాలంభట్టు వెలయించిన వ్యాఖ్యానాన్ని పేర్కొన్నారు. అంటే ఆంగ్లేయులు ఈ దేశంలోకి వ్యాపారంకోసం వచ్చి, కుటిల నీతి ద్వారా అన్నంపెట్టిన చేతినే కరిచి, కంపెనీ దశనుండి చక్రవర్తిత్వానికి ఎగబాకుతూ, ఈ దేశపు సంస్కృతికి ప్రాణమైన సంస్కృతాన్ని సర్వనాశనం చేయ నడుంకట్టిన గ్రహణకాలం దాక ఈ సముజ్వల సంస్కృతీధార ఈజాతి మెదడుకు మేత అయింది శరీరానికి రక్తమయింది. ఆ తర్వాత ఆంగ్లవిద్యా ప్రభావం కారణంగా మన మూలాలకు మనం క్రమంగా దూరం అవుతూవచ్చాము

పాశ్చాత్యాల వేదాంతం, తత్వశాస్త్ర పుస్తకాలకు, పండితులకు, తర్కానికి మాత్రమే పరిమితంకాగా ఈ జీవ సంస్కృతి వటవృక్షచ్ఛాయల్లో ఆచరణగా రూపొందని ఆలోచించలేరు. విజ్ఞానంకాని ప్రజ్ఞానం లేదు. దైనందినంకాని దైవాంశ లేదు. ఆ వెలుగుగంగ షడ్దర్శనాలలో, పురాణాలలో, గాథలలో, ఊహాలలో, అలవాట్లలో- ప్రతి వ్యక్తి వంటింట, పడకటింట పూజగదిలో, రచ్చబండమీద, గుడిలో, బడిలో, అమ్మ ఒడిలో పంటకాలువలై పారింది

అందుకనే సనాతనధర్మాన్ని సాధికారంగా పునరావిష్కరించిన స్వామి వివేకానంద—

"మీరు హిందువులుగా వుండడం మానివేయండి అపుడుగాని మీకు మేము సాయపడలేము, అనే విదేశీయులకు జాతులచరిత్ర తెలియదు. ఈ దేశస్థులు మతం మార్చుకుని, తమ సంప్రదాయాలను వదలివేస్తే భారతదేశం అంటూ ఏమీ వుండబోదు....సంస్కారాలు, ఆచారాలు, వ్యవహారాలు-ఇవే దేశాన్ని పటిష్టంగా ఐక్యంగా వుంచేవి." అన్నారు.

అందు వలననే గాంధీమహాత్ముడు సనాతనధర్మతూణీరంనుండే తన శాంతి, అహింస, సత్యాగ్రహాలవంటి శస్త్రాలను సంధించాడు జాతియేకమై ఆయన వెంటనడిచింది.

ఆయన తర్వాత వచ్చిన జవహర్‌లాల్ నెహ్రూ తొక్కినదారి పూర్తిగా విజాతీయమైనది. తత్ఫలితంగా మన జాతి ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో పైపై మెరుగులవంటి విజయాలను సాధించినా లోలోపల బలహీన మవుతూ వచ్చింది దానికి కారణం మనం మనప్రాణశక్తికి క్రమంగా దూర మవుతూ రావడమే!

నేడు హిందూధర్మానుయాయులుగా మనం ఎన్నో ఆచారాల వ్యవహారాలను నామమాత్రంగా పాటిస్తున్నాము. కుటుంబవ్యవస్థ, క్షతగాత్రమయినా ఇంకావుంది కనుక ఒక తరం నుండి ఇంకొక తరానికి ఎన్నో నమ్మకాలు, అలవాట్లు తరలివచ్చాయి. కాని వీటికి కారణం ఏమిటో, వాటి గమ్యం ఏమిటో, అర్థమేమిటో పరమార్థమేమిటో మనం మరచిపోయాము. ఇందులో కొన్ని అందమైనవి, కొన్ని అర్థవంతమైనవి. మరికొన్ని తెలుసుకొని ఆనందించదగినవి.

ఈ 'అమ్నీసియా' (తాత్కాలికస్మృతి రాహిత్యం) ను ఛేదించడానికి పూనుకున్న సర్జన్ సౌభాగ్యవతి సూర్యనాగశమంతకమణి, నాటి శమంతకమణి రోజుకు ఏడుపుట్ల బంగారాన్నిస్తే ఈ విద్వన్మణి పేజీకి కనీసం ఏడు సంప్రదాయసంజీవనీ మూలికలవంటి వివరణ నుఇచ్చారు. వారివైదుష్యం అసామాన్యం వారిచిత్తశుద్ధి నేటి సమాజానికి అత్యావసరం. వారి వివరణలు దీపావళి ప్రమిదలు.

'శూర్పణఖ భర్త ఎవరు?' వంటి ఆసక్తిదాయకమైన వివరాలనుండి, 'ఆషాఢమాసంలో గోరింటాకు పెట్టుకోవడం, వెనుక గల ఆరోగ్య సూత్రందాక- అగస్త్యభ్రాత అంటే ఎవరు'? అన్న భాషా ప్రయోగంనుండి- ప్రత్తిబూరుగు పెరట్లో వేయరాదనడానికి గల వైజ్ఞానిక కారణందాక— 'శ్రీ రాముడు మానవుడా, దేవుడా' అన్న పదసత్యంశము నుండి సంక్రమణ పుణ్యకాలం అంటే ఏమిటి? అన్న ఖగోళశాస్త్ర తాత్పర్యం దాక— శ్రీమతి శమంతకమణి సాధికారంగా ఇచ్చిన వివరణలు పెద్దలు మళ్ళీ మళ్ళీ చదివి పిన్నలకు తప్పని

# సంస్కృతీ సంప్రదాయం

ఆర్షవిజ్ఞానం అనగానే కళ్ళకు అద్దుకునేవారు కొందరు అయితే చాదస్తపు పుట్ట అని పక్కనిపెట్టేసేవారు కనిపిస్తున్నారు. మరికొందరు తెలిసీ తెలియని పండితమ్మన్యులు చెప్పే సత్యములైన కథలు మాత్రమే విని, భారతీయ విజ్ఞానం అనేది వేళాకోళంగా చూసేవారు మరికొందరు కనిపిస్తున్నారు. పోనీ సరియైనది ఏదో తెలుసుకుందామా అంటే ఆ గ్రంథాలు సంస్కృతంలో తప్ప దొరకవాయె; అవి వ్యాఖ్యానం ఉంటేకాని హరాయించుకోలేని స్థితిలో ఉండడమూ, అక్కడితో ఆ ఉత్సాహం చప్పబడిపోవడమూ జరుగుతోంది. ప్రాచీన భారతీయ ఔన్నత్యంమీద అపరిమితభక్తి కలిగిన కొందరు మన ఋషి పుంగవులు సర్వజ్ఞులని నిరూపించాలనే వ్యామోహంతో తమకు సగం సగం జీర్ణమైనా ఆధునిక వైజ్ఞానిక విషయములను మనవాళ్ళు ఏనాడో కనిపెట్టేశారని నిరూపించడానికి చేసే వ్యర్థ ప్రయత్నాలు నవ్వులాటగా మారటం చూస్తూ ఉంటాం. ఈ అతివృష్టి - అనావృష్టులు విడిచిపెట్టి, సత్యాన్వేషణకు పూనుకున్నవారు ఎవరైనా ఉన్నారా అని ఎదురుచూస్తున్న సమయంలో - ఆంధ్రప్రభ వీక్లీలో సంస్కృతీ - సంప్రదాయం ధర్మపీఠం అనే శీర్షిక క్రింద శమంతకమణి వ్రాస్తున్న వ్యాసాలు కొన్ని చూడటం తటస్థించింది. పటువైన భాష చక్కని శైలి, చక్కని పాండిత్యం నన్ను ఆకర్షించాయి. పురాణాలలోనుండి అరణ్యకాలలోనుంచి, బ్రాహ్మణాలలోనుంచి ఆగమ శాస్త్రాలలోనుంచి శ్లోకాలను పుంఖానుపుంఖంగా ఉదహరించడం చూచి ముచ్చటపడ్డాను. తరువాత ఇదంతా వారి స్వయంకృషి అని తెలిసి మరింత సంతోషించాను.

8వ ప్రశ్న : "శివధనుస్సు నెత్తలేని రావణుడు - ఆ ధనుస్సు నెత్తిన సీతాదేవిని ఎలా ఎత్తుకోగలిగాడు?"

ఇదే సందేహం చాలా మందికి కలిగి ఉంటుంది
"హేల రావణుండు కైలాసగిరినెత్తె
శైవధనువు నెత్తజాలడాయె
ఇందులోన మోసమేదో కద్దని తోచు

హృదయవర్తియందు మహిధరోక్తి" అని నేను మహిధరోక్తులలో (1969) ఒక పద్యం వ్రాశాను. "బాగుంది మంచి జిజ్ఞాస, కైలాసం ఎత్తగలిగినవాడు, శివధనుస్సు నెత్తలేకపోవడం ఏమిటి?" అని ఈ పద్యంమీద దాశరథిగారు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు కూడానూ. సీతా స్వయంవరానికి

రావణుడు వచ్చినట్లు వాల్మీకంలో లేదనీ కనుక శివధనుస్సు నెత్తబోయి వెల్లకిలా పడ్డాడు అన్నది అవాల్మీకం అని శకుంతకమణిగారు 8వ ప్రశ్నకిచ్చిన సమాధానంలో వివరించారు.

ఇంతేకాదు 4వ ప్రశ్నలో రావణాసురుడు సీతాదేవిని చేతితో ముట్టుకోకుండా, ఆమె నిల్చున్న మట్టి పెళ్ళతోసహా పెకలించి తీసుకుపోయాడన్న కథ సత్యం కాదనీ, ఇది కూడా అవాల్మీకమేననీ రచయిత్రి తెలియచెప్పేరు.

9వ ప్రశ్న : "మహాభారతంలో పాండుపుత్రులు పాండవులు, ధృతరాష్ట్ర పుత్రులు కౌరవులు ఎలా అయారు? పాండవులు మాత్రం కౌరవులు (కురువంశీకులు) కారా?" అనే మంచి ప్రశ్నకి చక్కని సమాధానం ఇచ్చారు.

10వ ప్రశ్న : "శ్రీరామ, పరశురామావతారాలు రెండూ ఎత్తినది శ్రీ మహావిష్ణువే కదా? మరి ఈ రెండు అవతారాలూ ఒకేసారి ఎలా ఎదురుపడతాయి?" అనే చక్కని ప్రశ్నకి మంచి సమాధానం ఇచ్చారు.

75వ ప్రశ్న : శ్రీరాముడు పోతన్నని రామాయణాన్ని అనువదించమనక, భాగవతాన్ని అనువదించమన్నాడేమిటి?" చక్కని జిజ్ఞాస, చక్కని సమాధానం.

101వ ప్రశ్న "మహాభారతం అంటారు, మహాభాగవతం అంటారు కాని, మహారామాయణం అనరేమి? కేవలం శ్లోకాల సంఖ్యనిబట్టే మహత్ వస్తుందా ఆలోచించాలి.

126వ ప్రశ్న : ఒక దేవుడికి ఇన్ని రూపాలెందుకు? చెడును నిర్మూలించడానికి, ఎవరి కడుపునో పుట్టడం, పెరిగి పెద్దవాడై అప్పుడు దుర్మార్గుణ్ణి సంహరించడం ఏమిటి? ఇంత కాలయాపన అవసరమా? ఈ సందేహమే నాకూ వచ్చింది.

"ప్రజలనేడిపించు రక్కసులను జంప
క్రొత్తజన్మ దేవుడెత్తునంట
కొండకాలుచుండ - కూపి ఖననమట్లు!
హృదయవర్తియందు మహిధరోక్తి"

ఈ ప్రశ్నకి గడుసుగా సమాధానం ఇచ్చి రచయిత్రి తప్పించుకున్నారు.

ఇటువంటి విషయాలమీద ఇంత చక్కని గ్రంథం తెలుగులో నా ఎరుకలో లేదు. రచయిత్రిని మనసారా అభినందిస్తున్నాను.

మహీధర నళినీమోహన్

# సంస్కృతి - సంప్రదాయం
# (ధర్మపీఠం)

కొవ్విడి (తురగా) సూర్య నాగ శమంతకమణి, యం. ఏ.

**1. ప్రశ్న :-** "శ్రీవాతాపి గణపతిం భజేహం" అన్న కీర్తనలో గణపతికి, వాతాపికి ఏమి సంబంధం ?

సమాధానం :-

శ్రీ వాతాపి గణపతి అనగా వాతాపి అనే నగరంలో వెలసియున్న గణపతి అని అర్థం. ఇక్కడ 'వాతాపి' అనే పదం స్థలనిర్దేశకం. భద్రాద్రిరామా శ్రీశైల మల్లేశ్వరా అని సంబోధించినట్టుగానే "వాతాపి గణపతిం" భజేహం" అని హంసధ్వని రాగంలో ముత్తుస్వామి దీక్షితులు కీర్తించారు.

అగస్త్యుడు-వాతాపిరాక్షసుని సంహరించిన ప్రదేశం ఇదేనని ఐతిహ్యం. వాతాపి రాక్షసుడు పరిపాలించిన ప్రాంతం కావడం వల్లనే ఈ పట్టణానికి "వాతాపి" అన్న పేరు స్థిరపడింది. మహిషాసురుని పేరిట అతని పట్టణానికి మైసూరు (మహిషపురం) అనే పేరుకలిగింది. అదేవిధంగా వాతాపి ఏలిన ప్రదేశానికి వాని పేరు ఏర్పడిందని పురాణ కథనం.

వాతాపి ఇల్వలులగాథ విష్ణుపురాణంలోను, వ్యాస భారతంలోను, వాల్మీక రామాయణంలోను చెప్పబడింది. హిరణ్యకశిపుని కుమారుడూ, ప్రహ్లాదుని సోదరుడూ ఐన హ్లాదునికి-'దమని' అనే భార్యయందు జన్మించిన కుమారులే వాతాపి, ఇల్వలుడు, ఈ విషయాన్ని భాగవత పురాణం స్పష్టం చేస్తున్నది.

ఐతే, విష్ణుపురాణంలోను, స్కాందపురాణంలోను, వ్యాసభారతంలోను, ఈ వాతాపి, ఇల్వలులు-'విప్రచిత్తి, సింహిక-అనే రాక్షస దంపతుల సంతానమనీ; దుర్వాసమహర్షికి అజముఖి-అనే రాక్షసి యందు కలిగిన సంతానమనీ! దుర్వాస మహర్షికి సురసయందు కలిగిన సంతానమనీ-వాతాపి ఇల్వలుల జన్మ క్రమాన్ని గురించి పాఠభేదాలున్నాయి. ఈ వాతాపి ఇల్వలుల తల్లియైన సింహిక-హిరణ్యకశిపుని సోదరి.

ఈ వాతాపి ఇల్వలులు మణిమతీ పురానికి పాలకులని విష్ణుపురాణం, వ్యాసభారతం - తెలుపుతున్నాయి. వీరు రాక్షస ప్రవృత్తితో వర్తించేవారు. సర్వార్థ సిద్ధికరమైన ఒక మంత్రాన్ని ఉపదేశించమని ఇల్వలు డొకనాడు ఒక విప్రుని కోరాడు. కానీ రాక్షసస్వభావులైన వీరికి-ప్రభావ సంపన్నమైన మంత్రాలను ఉపదేశించడానికి ఆ విప్రుడు అంగీకరించలేదు. అంతేగాక ఇంద్రునికి సాటికాగల ఒక కుమారుడు కలిగేటట్లు వరాన్నియమని కూడా ఇల్వలుడు-తపస్సంపన్నుడైన ఆవిప్రుని ప్రార్థించాడు. ఈ క్రూరాత్ముల కిచ్చిన వరాలు లోక పీడకే కారణం కాగలవని ఆలోచించి-ఆ విప్రుడు,ఇల్వలుడు కోరిన వాటి నన్నింటినీ తిరస్కరించాడు. ఆనాటి నుండి వాతాపీ ఇల్వలులు విప్రులపైన పగపట్టి ఉన్నారు. ఇల్వలుడు విప్ర వేషాన్ని ధరించి, నిర్జన ప్రదేశాలలోనూ, అరణ్య మార్గాలలోనూ దారి కాచి ఉండేవాడు. తమ ఇంట పితృకార్యమనీ, భోజనానికి రావలసిందనీ చెప్పి-ఆ దారినవెళ్ళే విప్రులను తెచ్చేవాడు ఇల్వలుడు. వాతాపికి కామరూపమూ, ఎన్ని ముక్కలుగా కోసినా అతుక్కునే వరమూ ఉన్నాయి. అందువల్ల—వాతాపి మేకరూపం ధరించగా ఇల్వలుడు వానిని కోసి పితృకార్యం నిమిత్తం అన్నట్లుగా విప్రులకు వండి పెట్టేవాడు వారు భుజించాక ఇల్వలుడు వాతాపిని పిలిచేవాడు. వాతాపి వారి పొట్ట చీల్చుకొని బయటకు వచ్చేవాడు.

ఈ సందర్భంగా ఒక వివరణ :

పూర్వయుగాలలో పితృకార్యాలలో విప్రులకు పితరుల ప్రీత్యర్థంగా మాంస భోజనం పెట్టడం ధర్మశాస్త్ర విధి. దీనితోపాటు మరికొన్ని విషయాలు ఈ కలియుగంలో నిషేధించబడినాయి. అట్టి కలివర్జ్యాలలో ఇది ఒకటి.

"అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకం।

దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్॥"-అని స్మృతివాక్యం. అనగా అశ్వమేధమూ, గోమేధమూ - ఇత్యాది హింసతోకూడిన యజ్ఞాలూ, పితృకార్యాలలో మాంస భోజనమూ, దేవరన్యాయంవల్ల పుత్రోత్పత్తి - ఈ విషయాలన్నీ కలియుగంలో పనికిరావని ధర్మశాస్త్రం నిషేధించింది. యజ్ఞ యాగాదులలో పశువధనుమాని పిష్ట పశువుతో యజ్ఞం చేయాలని చెప్పబడింది. అంతకుపూర్వం యజ్ఞయాగాలలోనూ, పితృకార్యాలలోనూ -ఇత్యాది ప్రత్యేక సందర్భాలలో విధించబడిన మాంస భోజనం నిషేధించబడింది. విప్రులకు మాంసభోజనం పూర్తిగా నిషేధించబడింది. దేవరన్యాయంవల్ల పుత్రోత్పత్తి కూడా నిషేధించబడింది. పై కలివర్జ్యాలన్నీ - అంతకు పూర్వ యుగాలలో ఉన్నవైనా-కలిలో అవి దుర్వినియోగం చేయబడతాయనే అభిప్రాయంతో ధర్మశాస్త్ర కర్తలు వానిని కలిలో నిషేధించారు.

ఒకప్పుడు అగస్త్య మహర్షి - తన భార్యయైన లోపాముద్రయొక్క అభీష్టాన్ని చెల్లించే నిమిత్తం - ఆమె కోరిన వస్త్రాభరణాల నిమిత్తం ధనాన్నికోరి-శ్రుతపర్వుడనే రాజును అర్థించాడు "ఓ రాజా: నీ రాజ్యవ్యయానికి సరిపోగా ధనం మిగిలితే దానిని మాత్రమే ఇ"మ్మని అగస్త్యుడు శ్రుతపర్వుని కోరాడు. శ్రుతపర్వుడు తన వద్ద ధనం మిగలడంలేదని చెప్పగా-అగస్త్య, శ్రుతపర్వు లిద్దరూ బ్రధ్నశ్వుడనే రాజువద్దకు వెళ్లారు. అతడినికూడా అగస్త్యుడు ఆ విధంగానే అడుగగా అతడు కూడా తన వద్ద ధనం మిగలడం లేదని చెప్పాడు. అగస్త్య, శ్రుతపర్వ, బ్రధ్నశ్వులు ముగ్గురూ త్రసదస్యుడనే రాజువద్దకు వెళ్లారు. అతడు కూడా అదే సమాధానం చెప్పగా నలుగురూ కలసి - ఇల్వలుని దగ్గర అపారమైన ధనరాశులున్నాయని, అతడిని అర్థించే నిమిత్తం ఇల్వలుని వద్దకు వెళ్ళారు. ఇల్వలుడు మేక రూపంలోని వాతాపిని ఖండించి వండి, అగస్త్యాదు

లకు భోజనం పెట్టాడు. ఇల్వలుడు ఈ ప్రకారంగా విప్రులను హతమారుస్తున్న విషయాన్ని అగస్త్యుడు విని ఉన్నాడు. అందువల్ల మహాతపస్వియైన అగస్త్యుడు - ఈ రాక్షసపీడను తొలగించదలచి - తన ప్రభావంతో వాతాపి జీర్ణమైపోయేటట్లు చేశాడు.

ఇల్వలుడు తన అలవాటు ప్రకారం - "వాతాపీ వెలుపలికి రా:" అని పిలిచాడు. కానీ అప్పటికేవాతాపి జీర్ణమైపోయాడు. ఇది అగస్త్యుని ప్రభావం అని గ్రహించుకొన్న ఇల్వలుడు-తనకు కూడా అగస్త్యునివల్ల చావుమూడుతుందనే భయంతో-ఏమీ మాట్లాడలేకపోయాడు. తానేమీ తెలియనట్లుగానే ఉండి, అగస్త్యాదులు తన వద్దకువచ్చిన కారణాన్ని ప్రశ్నించి తెలుసుకొని, వారు కోరిన ధనాన్ని ఇచ్చి పంపించాడు ఇల్వలుడు. ఇది వ్యాస భారతంలో ఉన్న గాధ కాగా, రామాయణంలో మరొక విధంగా ఉన్నది:

అదేమంటే-వాతాపిని జీర్ణం చేసుకొన్న అగస్త్యునిపైకి ఇల్వలుడు ఆగ్రహంతో దుమికాడు. అప్పుడు అగస్త్యుడు ఒక్కసారి హుంకరించి, తనతీక్ష్ణ దృక్కులతో ఇల్వలుని కూడా సంహరించాడు, రాక్షస పీడను తొలగించినందుకు తపస్వులంతా అగస్త్యుని కీర్తించారు.

ఆ విధంగా అగస్త్యుడు వాతాపిని సంహరించిన ప్రదేశం, వాతాపి ఏలిన ప్రదేశం-వాతాపి పట్టణంగా ప్రసిద్ధమైంది. ఇదీ వాతాపి పట్టణ చరిత్ర.

ఈ వాతాపి పట్టణంలో ప్రతిష్ఠితుడైన గణపతియే వాతాపిగణపతి. తిరుపతి శ్రీ వేంకటేశ్వరుడు, కాశీ విశ్వేశ్వరుడు, బదరీ నారాయణుడు, పురీ జగన్నాధుడు-ఈ విధంగా ఆయా దైవాల నామాలను క్షేత్రం పేరుతో కలిపి చెప్పడం మనకు క్రొత్తకాదు. వాతాపి గణపతి కూడా అదే పద్ధతిలో స్థలనామంతో కలిపి పేర్కొనబడ్డాడు.

ఒకనాటి దక్షిణ భారతదేశంలో, వాతాపి పట్టణం ఎన్నో ఏండ్ల తరబడి చాలా వైభవాన్ని పొందిన నగరం. చోళుల, చాళుక్యుల, పల్లవుల పరిపాలనా కాలంలో ఈ పట్టణం ఎంతో ప్రాచుర్యాన్ని కలిగి ఉండేది. ఇదే నగరం - అనంతరకాలంలో బాదామిగా వ్యవహరించబడింది. చాళుక్య ప్రభువులలో ఒక శాఖవారు ఈనగరాన్ని తమ ముఖ్యపట్టణంగా చేసుకొని పరిపాలించి-ఈ పట్టణం పేరిటనే (వాతాపి) బాదామి చాళుక్యులుగా ప్రసిద్ధులైనారు. (వేంగీ, చాళుక్యులు, కల్యాణి చాళుక్యులు, వాతాపి చాళుక్యులుగా వారు 3 శాఖలవారు )

చారిత్రక వైభవం కలిగిన వాతాపి నగరంలో నిర్మితమైన గణపతి దేవాలయంలోని ప్రధాన దైవతమే వాతాపి గణపతి. శిల్పకళాపోషకులైన దక్షిణ భారత ప్రభువులు నిర్మించిన వివిధ సుప్రసిద్ధ దేవాలయాలలో ఇది కూడా ఒకటి. పల్లవులు, చోళులు, చాళుక్యులు-ఇత్యాది ప్రభువులు ఈ వాతాపి గణపతిని పూజించినట్లుగా చారిత్రక నిదర్శనాలున్నాయి.

## 2. ప్రశ్న :- దేవాలయాలలో ధ్వజ స్తంభాలెందుకు ? వాని ప్రాముఖ్యం ఏమిటి?

**సమాధానం :-**

ఆగమశాస్త్రాన్ని అనుసరించి-ధ్వజస్తంభం దేవాలయానికి ప్రాణంగా చెప్పబడింది. ధ్వజస్తంభ ప్రతిష్ఠాపనం జరగనిదే దేవాలయ నిర్మాణం పూర్తి కాదు, ధ్వజస్తంభ ప్రతిష్ఠాపనం జరిగితేనే ఆలయనిర్మాణం పూర్తికాగలదు. భగవంతుని దేహరూపమైన దేవాలయానికి ధ్వజస్తంభం ప్రాణం.

"శిఖర శ్శిర ఇత్యాహుః గర్భ గేహం గళం తథా।
మంటపం కుక్షిరిత్యాహుః ప్రాకారం జాను జంఘయోః
గోపురం పాదమిత్యాహుః ధ్వజం జీవన ముచ్యతే॥"...

అని దేవాలయభాగాలన్నీ భగవంతుని శరీర భాగాలుగా చెప్పబడ్డాయి. ఈ శ్లోక భావం ఏమంటే-దేవాలయం యొక్క శిఖరం శిరస్సు. గర్భగృహం కంఠమూ, బహిర్మంటపం లేదా ముఖమంటపం కుక్షి (పొట్ట) భాగమూ, ప్రాకారం కాళ్ళున్నూ, గోపురంపాదాలు, ధ్వజస్తంభం ప్రాణం.

దీనినిబట్టి ధ్వజస్తంభ ప్రాముఖ్యం అవగతం కాగలదు.

ఆయా దేవతలయొక్క చిహ్నాలను ఏర్పరచడం నిమిత్తం ధ్వజస్తంభాన్ని దేవాలయాల యందు నిర్మించాలని ఆగమశాస్త్రం విధించింది.

శ్రీమహావిష్ణువు, శివుడు, దుర్గాదేవి-ఇత్యాది దేవతలకు జరిపించే బ్రహ్మోత్సవాలు, కల్యాణోత్సవాలు మొదలైన ఉత్సవ సమయాలలో-ఆయా దేవతల ధ్వజచిహ్నాన్ని ఒక నూతన వస్త్రంపైన లిఖించుతారు. అనగా ఆ ఉత్సవ ప్రారంభ దినాన-అంకురారోపణకు ముందుగా-ఈ క్రింది విధంగా ఆచరించ వలసి ఉంది.

ఆ దేవత విష్ణువైతే గరుత్మంతుని చిత్రాన్నీ, శివుడైతే వృషభ (నంది) చిత్రాన్నీ-ఈ ప్రకారంగా ఆ దైవం యొక్క వాహనమైనవాని చిత్రాన్ని కొత్త బట్టపైన చిత్రించి, దానిని ధ్వజస్తంభం యొక్క శిఖరాగ్రాన ఎగురవేస్తారు. దీనినే 'ధ్వజారోహణం'గా-పేర్కొంటారు. గరుత్మంతుడు, లేదా నందీశ్వరుడు. తన ప్రభువు యొక్క ఉత్సవాలకు ఊర్ధ్వలోకాలలోని సకల దేవతా గణాన్నీ ఆహ్వానిస్తున్నట్లుగా ఆ సమయంలో మంత్ర పఠనంచేస్తారు. ఏ దేవతా ఉత్సవానికైనా ప్రారంభంలో ఈ కార్యక్రమం జరుగుతుంది. ప్రతి ఉత్సవమూ, ధ్వజారోహణం, అంకురారోపణం-వీనితోనే ప్రారంభించబడడం. శాస్త్రోక్తమూ, సంప్రదాయబద్ధమూ. ఆ విధంగా ఆయా దేవతామూర్తులు తమ ఉత్సవాలకుతమ ప్రధాన అంతరంగికుని ముఖంగా సర్వదేవతా గణాలనూ ఆహ్వానింప జేస్తారన్న మాట. ఈ క్రియతోనే ఉత్సవారంభం జరుగుతుంది.

ఆయా దేవతలకు సంబంధించిన చిహ్నాన్ని ధ్వజస్తంభం పైన

ఉంచడం ధర్మ శాస్త్రాలచేత నిర్దేశించబడింది. కొందరు దేవతలకు వాహనమూ, ధ్వజచిహ్నమూ వేర్వేరుగా ఉండడం ఉన్నది. కానీ అనేక దేవతలకు వాహనమూ, ధ్వజమూ ఒక్కటిగానే ఉండడ అధికంగా ఉంది విష్ణుమూర్తి గరుడ వాహనుడు, గరుడధ్వజుడు, శివుడు వృషభవాహనుడు, వృషభధ్వజుడు. కుమార స్వామి మయూర వాహనుడు, కానీ ఆయన కుక్కుట ధ్వజుడు. అనగా కుమార స్వామి ధ్వజచిహ్నం కోడి. మన్మధుని వాహనం చిలుక. ఆయన ధ్వజచిహ్నాలు చేప, మొసలి-రెండూను. మన్మధుడు మకర ధ్వజుడుగానూ, మీనధ్వజుడుగానూ కూడా పేర్కొనబడ్డాడు. బ్రహ్మదేవునికీ, సరస్వతికీ కూడా వాహనం హంస. లక్ష్మీ దేవి వాహనం గుడ్లగూబ. పార్వతీదేవి వాహనం సింహం.

కేతన చిహ్నమూ, ధ్వజస్తంభాగాన ఉంచబడే చిహ్నమూ-కొన్ని సందర్భాలలో వేర్వేరు కావచ్చును. ఉదాహరణంగా-విష్ణుమూర్తికీ, కృష్ణునికీ-వారి రథపతాకంపై ఉండేది గరుడధ్వజం. కాని విష్ణుసంబంధమైన రామ కృష్ణాది దేవతల ఆలయాలలోనూ, విష్ణ్వాలయాలలోనూ కూడా-ధ్వజస్తంభం పైన విష్ణుమూర్తి ఆయుధమైన సుదర్శన చక్రాన్నే విష్ణుచిహ్నంగా ఉంచడం, ఆగమ శాస్త్రవిధి అంతేకాని-విష్ణువాహనమూ; విష్ణువుకూ కృష్ణునికీ రథకేతన చిహ్నమూ ఐన గరుత్మంతుని-విష్ణు సంబంధమైన దేవాలయాల ధ్వజస్తంభాల పైన ఉంచడం శాస్త్రవిధిగా నిర్ణయించబడలేదు శివాలయాలలో శివుని ఆయుధాలలో ముఖ్యమైన త్రిశూలాన్నే ధ్వజస్తంభంపైన ఉంచడం అధికంగా ఉన్నా, కొన్ని శివాలయాలలో ధ్వజస్తంభంపైన నందీశ్వరుని ఉంచడం కూడా లేకపోలేదు. త్రిశూలాన్నీ, నందినీ-రెండింటినీ ధ్వజస్తంభం పైన ఏర్పరచడం కూడా ఉన్నది.

సారాంశంగా-ఆయా దేవతలకు సంబంధించినదైన ఏదో ఒక చిహ్నాన్ని ధ్వజస్తంభంపైన ఏర్పరచడమనేది ఆగమశాస్త్ర విహితమైన ఆచారం.

మన దేవతలలో త్రిమూర్తులకూ, త్రిదేవులకే గాక, వారి కుమారులకూ; ఇంకా అష్టదిక్పాలకులకూ; నవగ్రహాలకూ; ఇతర దేవతలందరికీ కూడా -

వాహనమూ, ధ్వజచిహ్నమూ-నిర్దేశించబడి ఉన్నాయి. గణేశపురాణాన్ని అనుసరించి -విఘ్నేశ్వరుడు కృతయుగంలో సింహవాహనుడు. త్రేతాయుగంలో మయూర వాహనుడు. ప్రస్తుతం జరుగుతూ ఉన్నది..శ్వేతవరాహ కల్పం. ఈ కల్పంలో గణేశుడు అశ్వవాహనుడని చెప్పబడింది.

రామాయణంలో అయోధ్యాకాండ 96వ సర్గలో-చిత్రకూట పర్వతం పైన మందాకినీ తీరంలో రాముడు సీతాలక్ష్మణ సహితంగా వనవాసానికి వచ్చి ఉన్నాడు ఒకనాడు ఆ అడవిలో దూళి ఆకాశంవరకు రేగడమూ, జంతువులు కోలాహలంగా పరుగులుపెట్టడమూ రాముడు చూచాడు. లక్ష్మణుని పిలిచి "లక్ష్మణా! ఆ కోలహలం ఏమిటి? ఎవరైనా రాజు, లేదా రాజసమానుడు-వేటకు వస్తున్నాడా? రథధ్వజాన్ని పరిశీలించి, ఆ వచ్చే సైన్యం ఏ రాజుదో చూచి చెప్పు." అని చెబుతాడు రాముడు. అప్పుడు లక్ష్మణుడు చెట్టుపైకెక్కి చూచి, కోవిదారధ్వజాన్ని గుర్తించి, అది కోసల దేశపు సైన్యమేనని చెబుతాడు. భరతుడుకానీ, దశరథుడు గానీ వస్తున్నారని ధ్వజ చిహ్నాన్ని బట్టి రామలక్ష్మణులు ఊహిస్తారు. ఐతే తెల్ల గొడుగు లేదు కనుక-ఆ వచ్చేది దశరథుడు కాదనుకొంటారు. ఈ సన్నివేశంలో ధ్వజచిహ్నాన్ని బట్టి ఆ వస్తున్న రాజును గుర్తించడంలో ధ్వజంయొక్క ప్రాముఖ్యం విశదమౌతుంది.

మహాభారతంలో ఉత్తరగోగ్రహణ సమయంలో అర్జునుడు ఉత్తరునికి-కురువీరుల ధ్వజ చిహ్నాలనుచూపి-వారిని గుర్తు తెలిపాడు ఎవరివద్ద ఏ విధంగా తాను ప్రవర్తించవలసి ఉన్నదో, దాని కనుగుణంగా ఉత్తరుని సారథ్యం ఏ విధంగా ఉండాలో చెప్పాడు. కాబట్టి-వారి ధ్వజ చిహ్నాలను ఉత్తరునికి అర్జునుడు వివరించడం నిరర్థకం కాదు.

స్వర్ణవేదికా ధ్వజమూ, ఎర్రని అశ్వాలూ కలిగిన రథంపై ఉన్నవాడు ద్రోణుడని చెప్పాడు అర్జునుడు. ఆయన గొప్పతనాన్ని వర్ణించి, రథాన్ని ఆయనకు ప్రదక్షిణంగా పోనిమ్మని చెప్పాడు. ఆయన తనపై బాణం వేయనిదే తాను

ఆయనతో యుద్ధం చేయరాదని, ఆయనతో యుద్ధం కనుక తటస్థించినట్లయితే రథాన్ని దూకుడుగా నడపవద్దనీ చెప్పాడు. స్వర్ణ వృషభధ్వజుడు కృపాచార్యుడని తెలిపి, ద్రోణునితోవలెనే ఈయనతో కూడా యుద్ధంచేయడం తనకు ధర్మం కాదనీ, ఆయనపట్ల పాటించిన మర్యాదలనే ఈయనపట్లకూడా పాటించాలనీ చెప్పాడు. అశ్వత్థామ ధ్వజచిహ్నం సింహలాంగూలమనీ; కర్ణుని ధ్వజచిహ్నం రెండేనుగుల మధ్యనున్న శంఖమనీ, నాగధ్వజుడు దుర్యోధనుడనీ తెలిపి- వారిలో ఎవరి సమీపాన ఏ విధంగా వర్తించాలో ఉత్తరునికి వివరించాడు. ఐదుతాళ వృక్షాలను ధ్వజంపై కలవాడు భీష్మపితామహుడని చెప్పాడు. వారందరి స్వభావాలనూ, తమకు వారితోగల సంబంధాలనూ వివరించి; ఎవరి పట్ల ఏ విధంగా ప్రవర్తించాలో, ఏ విధంగా సారథ్యం చేయాలో ఉత్తరునికి అర్జునుడు బోధించాడు.

అంతకు కొంత ముందుగా-శమీ వృక్షంపై ఉంచిన తమ ఆయుధాలను తీసుకొన్నప్పుడు-ఆయుధాలపైనున్న చిహ్నాలనుబట్టి ఎవరి ఆయుధాలేవో ఉత్తరునికి వివరించాడు అర్జునుడు. ఆ విశేషాలన్నీ చెప్పాలంటే ఇంకా సుదీర్ఘమౌతుందనే భయంతో విడిచివేశాను.

పురాణ, ఆధునిక కాలాన్నింటిలోనూ-ధ్వజానికీ, లాఞ్ఛనానికీ అభేదం అయినట్లే-దేవతా ధ్వజం ఆ దైవానికి చిహ్నం. ఉదాహరణకు-చాళుక్యులది వరాహ ధ్వజం. ఒక రాజ్య ధ్వజాన్ని అవమానిస్తే ఆ రాజ్య సార్వభౌమాధికారాన్ని అవమానించినట్లే. అదే విధంగా దేవతా ధ్వజం కూడా పూజార్హమైనది.

కార్తీక మాసంలో ఆకాశదీపాన్ని ధ్వజస్తంభాగ్రాన ఏర్పరచడం సంప్రదాయం స్మృతి విహితం.

వివిధ దేవతల ధ్వజాలనూ వాహనాలనూ-ఈ సందర్భంగా-ఆసక్తికలవారి నిమిత్తం ఈ క్రింద ఇవ్వడమైంది.

భైరవుని వాహనమూ ధ్వజచిహ్నమూ-శునకం, శీతలాదేవి గార్దభ (గాడిద) వాహన. గంగాదేవి మకర (మొసలి) వాహన. యమునానది కూర్మ (తాబేలు) వాహన. మూషిక వాహనుడుగా ప్రసిద్ధి చెందిన విఘ్నేశ్వరునికి-వివిధ యుగాలతో ఏవేవి వాహనాలో పైన చెప్పడం జరిగింది. సుబ్రహ్మణ్యుని (కుమారస్వామి)కీ, త్రిమూర్తులకూ, త్రిదేవులకూ - వాహనాలనుగూడా పైన వివరించాను.

ఇంద్రుని వాహనం మేఘం-ఐరావతమనే ఏనుగు-ఇంద్రుని వాహనమూ, ధ్వజమూ కూడా. అగ్నిదేవుని వాహనమూ, ధ్వజమూ-గొర్రె, మేక రెండూను యముని వాహనం మహిషం. నిఋతి వాహనం ప్రేతం. వరుణుని వాహనం మొసలి. ధ్వజమూ అదే వాయు దేవుని వాహనమూ ధ్వజమూ కూడా లేడి. కుబేరుని వాహనాలు-మనిషి, పుష్పక విమానమూ ఈశాన్య దిక్పాలకుడైన ఈశానుడనే శివుని వాహనమూ, ధ్వజమూకూడా వృషభం. (నందీశ్వరుడు) ఇంతవరకూ చెప్పిన వారు దిక్పాలకులు.

సూర్యుని ధ్వజచిహ్నం సింహం. ఎర్రని ధ్వజం. వాహనం-ఏడు గుర్రాలు పూన్చిన ఏక చక్ర రథం. చంద్రునిది శ్వేత (తెల్లని) ధ్వజం. ధ్వజ చిహ్నం కుందేలు, లేడి. వాహనాలు-పది గుర్రాలను పూన్చిన రథమూ, పది లేళ్లను పూన్చిన రథమూ, లేడి. కుజునిది ఎర్రని ధ్వజం. ధ్వజచిహ్నం కోతి. వాహనం మేషం. బుధుని ధ్వజ చిహ్నం కోతి. పసుపురంగు ధ్వజం. వాహనం సింహం. బృహస్పతికి వాహనం కృష్ణసారమనే లేడి. పసుపురంగు ధ్వజం. శుక్రుని వాహనాలు గవయమనే మృగం, పంచకోణ రథమూ. తెల్లని ధ్వజం. శని ధ్వజచిహ్నం కాకి. వాహనం గ్రద్ద. నల్లని ధ్వజం. రాహువు ధ్వజచిహ్నం నెమలి. నీల ధ్వజం. వాహనాలు సింహం, ఒంటె. కేతువు ధ్వజచిహ్నం గ్రద్ద. చిత్రవర్ణ ధ్వజం. వాహనాలు చిత్ర రథం, సింహం. నవగ్రహాల ధ్వజచిహ్నాలకూ' వాహనాలకూ సంబంధించిన సమాచారమిది.

3. ప్రశ్న :- హరిశ్చంద్రుని గురించి వేదంలోనూ, పురాణాలలోనూ, కావ్యాలలోను రకరకాల గాథలు-పరస్పరం సంబంధం లేనివి ఉన్నాయంటారు. అవి ఏవి?

సమాధానం :-

వేదంలో, పురాణాలలో హరిశ్చంద్రుని ప్రస్తావన ఉన్నది. ఆయనను గురించిన గాధలు అనేకంగా ఉన్నాయి. వేదంలోనూ, భాగవత పురాణంలోనూ ఉన్న హరిశ్చంద్రుని గాథ :-

హరిశ్చంద్ర మహారాజు ధర్మతత్పరుడు. ఆయనకు సంతతి లేదు. సంతానం నిమిత్తం వరుణ వ్రతాన్ని ఆచరించవలసిందని నారద మహర్షి ఉపదేశించారు. వరుణుడు అతనికి కుమారుని ప్రసాదించాడు. కానీ, ఆ కుమారుని యజ్ఞ పశువుగాచేసి వరుణుని ఉద్దేశించి ఒక యాగం చేస్తానని హరిశ్చంద్రుడు మొక్కుకొని వరుణవ్రతాన్ని చేసిన కారణంగా-యాగం చేయాలని హరిశ్చంద్రునికి నిబంధన విధించాడు వరుణుడు- హరిశ్చంద్రుడు అందుకు అంగీకరించాడు క్షత్రియులకు గర్భైకాదశ వత్సరమందు ఉపనయనం విధి విహితం కాబట్టి-హరిశ్చంద్రుడు ఆ ప్రకారంగా లోహితునికి ఉపనయనం చేశాడు. వరుణుడు వచ్చి అడుగగా హరిశ్చంద్రుడు-లోహితుని అంగీకారం తెలుసుకొని అతనిని యజ్ఞ పశువుగా చేస్తాననీ, అంగీకారం లేని పశువును చేసినట్లయితే అది యజ్ఞం కాదనీ, యజ్ఞఫలం లభించదనీ చెప్పి-లోహితుని అంగీకారం కొరకు గడువిమ్మని వరుణుని కోరాడు. లేదా తననే యజ్ఞ పశువుగా స్వీకరించమన్నాడు-హరిశ్చంద్రుడు బహు యజ్ఞాలు చేసి బహు దేవతా బుద్ధి కలిగిన హరిశ్చంద్రుడు తనకు యజ్ఞ పశువుగా వద్దనీ, ఏ దేవతల యందూ ఇంతవరకూ మనస్సు ప్రసరించని పసివాడైన లోహితుడే స్వచ్ఛమైన పశువనీ, అతడే కావాలనీ వరుణుడుచెప్పాడు ఒకరోజు లోపుగా కుమారుని ఒప్పించి యజ్ఞం ఆరంభించని పక్షంలో హరిశ్చం

ద్రుడు జలోదర వ్యాధితో బాధపడతాడని శపించి వరుణుడు వెళ్ళిపోయాడు. పుత్రప్రీతివల్ల హరిశ్చంద్రుడు తన కుమారుని యజ్ఞపశువుగావేసి యాగాన్ని చేయడానికి ఇలా ఏదో విధంగా ఆలస్యం చేయసాగాడు.

హరిశ్చంద్రుడు లోహితుని పిలిచి అతని అంగీకారం తెలుసుకొనే లోపుగా ఇంద్రుడు మారు వేషంలో వచ్చి లోహితుని కలిసికొని, వరుణ-హరిశ్చంద్రుల మధ్య నడచిన కథనంతా చెప్పి-లోహితుని పారిపొమ్మని చెప్పాడు. లోహితుడు పారిపోగా హరిశ్చంద్రుడు జలోదర వ్యాధిగ్రస్తుడయ్యాడు. పారిపోయి అరణ్యాలలో సంచరిస్తున్న లోహితునికి ఇంద్రుడు కనిపించి-పుణ్య నదులలో స్నానం చేస్తూ, పుణ్యగాథలను వినమని చెప్పాడు. లోహితుడు ఆప్రకారం చేస్తూ ఉండగా, ఆరు సంవత్సరాలు గడిచాక అజీగర్తుడనే బ్రాహ్మణఋషికుమారుడైన శునశ్శేఫుడు తటస్థపడ్డాడు. అతనిని కలసికొన్న లోహితుడు-శునశ్శేఫుని కుటుంబపు పేదరికమూ, అతడిపట్ల అతడి తల్లిదండ్రుల నిరాదరమూ తెలిసికొన్నాడు. తన వృత్తాంతాన్ని అతడికి తెలియజేశాడు. లోహితుడు— అతడిని, అతడి తండ్రియైన అజీగర్తుని-శునశ్శేఫుడు తన తండ్రి యాగానికి యజ్ఞ పశువు కాగలడా అని అడుగగా, నూరు గోవులిస్తే తనకంగీకారమేనని లోహితునికి అజీగర్తుడు తెలిపాడు.

శునశ్శేఫుని వెంట బెట్టుకొని లోహితుడు తన తండ్రి వద్దకు వచ్చి-జరిగిన వృత్తాంతాన్ని తెలియజేశాడు. లోహితుడు వందగోవులకు తననుయాగ పశువుగా కొన్న విషయాన్నీ, తానందులకు అంగీకరించినట్లున్నూ శునశ్శేఫుడు హరిశ్చంద్రునికి తెలిపాడు. తనకు తానై అంగీకరించిన శునశ్శేఫుని యజ్ఞ పశువుగా వరుణుడున్నూ అంగీకరించాడు.

శునశ్శేఫుడు తనగాధ తెలుపుకొని యజ్ఞ ప్రారంభానికి, ముందే-విశ్వామిత్రమహర్షిని ఆశ్రయించాడు. ఆయన యజ్ఞ నిర్వహణార్థం మహర్షులందరితో

పాటుగావచ్చి ఉన్నాడు. విశ్వామిత్రుడు శునశ్శేపునికి వరుణ దేవతాకములైన బీజాక్షరములను ఉపదేశించాడు. వానితో శునశ్శేపుడు వరుణదేవతాకములైన ఋక్కులను ఎన్నిటినో రచించి గానం చేయసాగాడు.

హరిశ్చంద్రుడు యజ్ఞ పశువును బంధించమని కోరగా-అక్కడి సర్వ ఋషులున్నూ-అంతటి విద్వత్ సంపన్నుడూ, మంత్రద్రష్ట, తేజస్వంతుడూ అయిన బాలకుని బంధించడానికీ వధించడానికీ అంగీకరించ లేదు. శునశ్శేపుని బంధించుటకొకవంద గోవులూ, వధించుటకొక వంద గోవులూ పుచ్చుకొని- శునశ్శేపుని తండ్రి యైన అజీగర్తుడే శునశ్శేపుని వధకు సిద్ధపడ్డాడు. సర్వ ఋషిమండలమూ అజీగర్తుని ఛీత్కరించింది.

శునశ్శేపుడు రచించిన వరుణ దేవతాక ఋక్కులను విన్న వరుణుడు-శునశ్శేపుని యందు ప్రసన్నుడై-శునశ్శేపుని వధించ నవసరం లేదని చెప్పి హరిశ్చంద్రునికి యాగఫలాన్ని ప్రసాదించాడు. వరుణ దేవతాకమైన ఋక్కులు వేదమందు తక్కువగా ఉన్నాయనే ఉద్దేశంతో, ఆలోటు పూరించడానికే తానిదంతా కల్పించానని వరుణుడుచెప్పి, శునశ్శేపుని కరుణించాడు. శునశ్శేపుడు రచించిన ఋక్కులు వేదమందు చేర్చబడినాయి. శునశ్శేపుడు వేదర్షి, మంత్ర ద్రష్ట-అయినాడు, అతడు తన తండ్రిచేత అమ్మివేయబడ్డాడు. కనుక సర్వ ఋషులున్నూ, హరిశ్చంద్రుడున్నూ-అతడిని తమ పుత్రునిగా స్వీకరిస్తామని తమ సంసిద్ధతను ప్రకటించారు. శునశ్శేపుడు విశ్వామిత్రునితనతండ్రిగా వరించి ఆయన వెంట నడిచాడు. విశ్వామిత్రుడు అతడిని తన పెద్ద కొడుకుగా స్వీకరించాడు.

ఇంతవరకు చెప్పినది వేదంలోను, భాగవత పురాణంలోనూ ఉన్న హరిశ్చంద్ర గాధ.

హరిశ్చంద్రుని గూర్చిగల శివ పురాణగాధ :

హరిశ్చంద్ర మహారాజు భార్య సత్యవతి. ఒకనాడామె మందిరంలో శివుడు వచ్చి వెళ్లిన చిహ్నాలను హరిశ్చంద్రుడు తెలిసికొని, ఆమెను ప్రశ్నించాడు. శివుడు వచ్చిన విషయం నిజమేననీ, తాను పూర్వజన్మలో కైలాస

మంతు శివపార్వతుల పరిచారికననీ, తనయందు అనుగ్రహంతో శివుడు దయ చేసి తనకి విషయాలు తెలిపినాడనీ ఆమెచెప్పింది. శివునికి పరమభక్తుడైన హరిశ్చంద్రుడు వెంటనే ఆమె యందు భార్యాబుద్ధిని విరమించుకొని, ఆమెనూ, శివుని అనుగ్రహం వల్ల ఆమెకు కలిగిన కవలశిశువులనూ—కైలాసానికి తీసుకొనిపోయి శివునికి అర్పించాడు ఆ కవలలే చండీశ్వర భృంగీశ్వరులు. హరిశ్చంద్రుడు తర్వాత చంద్రమతిని వివాహం చేసుకొన్నాడు. ఈగాధ శివపురాణంలో చెప్పబడింది.

హరిశ్చంద్రుని గురించిన మార్కండేయ పురాణగాధ :
ఇదే కావ్యగాథగా ప్రచారాన్ని పొందింది.

విశ్వామిత్ర మహర్షి యజ్ఞార్థమై హరిశ్చంద్రుని అర్థించి ధనమిస్తానని వాగ్దానం చేయించుకొన్నాడు మాతంగ కన్యలను వివాహమాడమని విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని ఒత్తిడి చేయగా, తాను ఏకపత్నీవ్రతస్థుడననీ, అవసరమైతే రాజ్యమైనా ఇచ్చివేస్తాను కానీ వారిని చేపట్టననీ అనగా—హరిశ్చంద్రుని రాజ్యాన్ని తీసుకొన్నాడు—విశ్వామిత్రుడు. హరిశ్చంద్రుడు రాజ్యాన్ని వదలుకొన్నాక—అతడు తనకు అంతకుపూర్వం వాగ్దానమిచ్చిన—యజ్ఞద్రవ్యానికై అతనిని నిలదీశాడు—విశ్వామిత్రుడు. ఆ బాకీ వసూలుకొరకై తన శిష్యుడు నక్షత్రకుని—ఆలుబిడ్డలతో కాశీకి ప్రయాణమవుతున్న హరిశ్చంద్రుని వెంట పంపించాడు. ఆలుబిడ్డలనూ, తననూ—అమ్ముకొని విశ్వామిత్రుని ఋణం తీర్చి నక్షత్రకుని పంపివేశాడు—హరిశ్చంద్రుడు. పాముకాటువల్ల మరణించిన లోహితుని శరీరాన్ని శ్మశానానికి తీసుకొని వచ్చి, ఉత్తరక్రియలకై ప్రయత్నించిన చంద్రమతి, కాటికాపరిగా ఉన్న హరిశ్చంద్రుడు—ఒకరినొకరు పోల్చుకొన్నారు కాటి సుంకం చెల్లించనిదే పుత్రుని కళేబరాన్ని కాల్చరాదనగా—సొమ్ముకై వెళ్ళిన చంద్రమతిపై రాజధనాపహరణనేరం అంటగట్టబడి, శిక్షకై హరిశ్చంద్రుని వద్దకే తేబడింది భార్యతో నరకబోయిన హరిశ్చంద్రుని సత్యవాక్యతత్పరతకు దేవతలు ప్రశంసించారు. విశ్వామిత్రుడు ప్రసన్నుడైనాడు. పరమసత్యపథగ మిగాఅందరూ హరిశ్చంద్రుని మెచ్చారు. హరిశ్చంద్రుని యొక్క ఈ గాథ మార్కండేయ పురాణంలోనిది.

4. ప్రశ్న :- శుక్రాచార్యునికి తెలిసిన మృత సంజీవనీ విద్య-బృహస్పతికి ఎందుకు తెలియదు?

సమాధానం :-

శుక్రుని గాధ మత్స్యపురాణంలోనూ, వ్యాసభారతంలోనూ. కాశీ ఖండంలోనూ, దేవీ భాగవతంలోనూ ప్రస్తావించబడింది. మృత సంజీవనీ విద్య శుక్రునికి మాత్రమే తెలియడానికి కారణమైన గాథ ఈ క్రిందిది.

బృహస్పతితో బాటు శుక్రుడున్నూ - బృహస్పతి తండ్రియైన అంగీరసుని వద్ద అనగా ఒకే గురువువద్దనే విద్యను అభ్యసించారు. వారి గురువూ, బృహస్పతి యొక్క తండ్రీ అయిన అంగీరసుడు-శిష్యులిరువురకూ సమానంగా విద్యను బోధించక, వారి మధ్య భేదాన్ని చూపసాగాడు. ఆ విషయాన్ని గ్రహించిన తర్వాత శుక్రుడు-అసంతృప్తితో అంగిరసుని విడిచి వెళ్ళాడు.

ఆ విధంగా వెళ్లిన శుక్రుడు-గౌతముని వద్దకు వెళ్లి-విద్యను అర్థించాడు. గౌతముడు శుక్రుని వల్ల—జరిగిన దానిని తెలుసుకొన్నాడు, తాను శుక్రునికి విద్యాబోధన చేయడం-అంగిరసునితో వైరాన్ని కొనితెచ్చుకోవడమే నని భావించాడు. గౌతముడు. సర్వవిద్యలకూ మూలభూతుడైనవాడు శివుడొక్కడే నని; ఆయనను అర్చించి కోరిన విద్యలను పొందమనీ గౌతముడు శుక్రునికి హితవు చెప్పాడు.

శుక్రుడు శివుని గూర్చి తీవ్రంగా తపమాచరించాడు, తన తపస్సుకు మెచ్చి దర్శనమిచ్చిన శివునినుండి శుక్రుడు-సర్వవిద్యలతోపాటు-ా మృత సంజీవనీ విద్యను కూడా పొందాడు.

కనుక బృహస్పతికిగాని, శుక్ర బృహస్పతుల గురువైన అంగిరసునికి గాని ప్రమేయం లేకుండా శుక్రుడు మృతసంజీవనీ విద్యను పొందిన ప్రకారం ఇది. ఈ కారణంగానే, శుక్రునికి తెలిసిన మృతసంజీవనీ విద్య బృహస్పతికి తెలియలేదు. కనుకనే ఆ విద్యను శుక్రునినుండి నేర్చుకొనడం కోసం బృహస్పతి—పుత్రుడైన కచుని పంపడం జరిగింది. ఆ తర్వాత జరిగిన కచ దేవయానుల కథ-ఇత్యాదులు విషయాంతరం.

5. ప్రశ్న :- దశరథునికి ముగ్గురు భార్యలు. వారికి నలుగురు కుమారులు జన్మించారు. మరి దశరథునికి శాంత అనే కుమార్తె ఉన్నట్లు రామాయణంలో ఉంది కదా? ఈ శాంత కౌసల్య, సుమిత్ర, కైకేయిలలో ఎవరి కుమార్తె?

సమాధానం :-

శాంత దశరథుని కుమార్తె కాదు. అంగదేశాధిపతియైన రోమపాదుని కుమార్తె. రోమపాదుని రాజ్యంలో వానలు కురువక క్షామం ఏర్పడినప్పుడు విద్వాంసులను సంప్రదించగా, ఋష్యశృంగని తీసుకువస్తే వానలు కురుస్తాయనీ, ఆ మహర్షి అడుగు పెట్టినచోట కరువు కాటకాలుండవనీ-పెద్దలు చెప్పారు అప్పుడు రోమపాదుడు ఋష్యశృంగుని తపోవనం నుంచి తీసుకొనిరాగా అంగ దేశంలో వర్షాలు కురిశాయి. రోమపాదుడు తన కుమార్తె అయిన శాంతను ఋష్యశృంగున కిచ్చి వివాహం చేసి వారిని తన ఇంటనే నిలుపుకొన్నాడు.

దశరథుడు-తనకు సంతానంలేదని చింతిస్తూ ఉన్నప్పుడు, దశరథుని ఆప్త సచివుడైన సుమంత్రుడు ఆయనకీ వృత్తాంతం చెప్పాడు. దశరథ మహారాజుచేత ఆ ఋష్యశృంగుడు ఒక యజ్ఞం చేయిస్తే దశరథునికి సంతానం కలుగుతుందని మహర్షుల సభలో సనత్కుమార మహర్షివలన తాను విన్నానని-సుమంత్రుడు దశరథునికి చెప్పాడు. అప్పుడు దశరథుడు తన మిత్రుడైన రోమపాదుని అంగీకారంతో అంగదేశం నుండి శాంతా ఋష్యశృంగులను తన అయోధ్యా నగరానికి తీసుకువచ్చి, వారిని తన అంతఃపురంలో ఉంచి అమితంగా గౌరవించాడు. ఋష్యశృంగుని ఆధ్వర్యంలో, ఆయన ఆజ్ఞ ప్రకారం దశరథుడు అశ్వమేధయాగమూ, పుత్ర కామేష్టి-ఈ రెండు యాగాలూ చేసి, సంతాన ఫలాన్ని పొందాడు, ఇది వాల్మీకి ప్రమాణం.

ఐతే- మన జానపద సాహిత్యంలోనూ, స్త్రీల పాటలలోనూ-దశరథుడు శాంత అనే బాలికను పెంపకం తెచ్చుకొన్నట్లు, ఆమెను పెంచుకొన్నందు వల్ల దశరథునికి సంతానం కలిగినట్లుగా ఉంది. దీనికి వాల్మీకి రామాయణంలో ఆధారం లేదు. లక్ష్మణ దేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణరేఖ- ఇటువంటి అవాల్మీకములైన విషయాలెన్నో మన జానపద సాహిత్యంలో పాటలుగా, పదాలుగా ఉన్నాయి. కానీ ప్రామాణికత విషయంలో వాల్మీకమే శిరోధార్యం కాబట్టి, దానినే స్వీకరించవలసి ఉంది.

విచిత్ర రామాయణం- ఇత్యాది గ్రంథాలలో అనేక ఇతర విధాలుగా ఉన్నా- అవి ప్రామాణికాలు కావు. రామాయణ గాథకు వాల్మీక రామాయణమూ, భారతగాథకు వ్యాసభారతమే పరమ ప్రమాణాలు.

ఋష్య శృంగుని గాథ హరివంశంలోనూ, వ్యాసభారతంలోనూ, వాల్మీక రామాయణంలోనూ కూడా చెప్పబడింది.

6. ప్రశ్న:- ద్రౌపది కాకుండా ఇంకా ఇతరులెవరైనా స్త్రీలు — బహు భర్తలను కలిగివున్న భార్యలు- ప్రాచీన కాలంలో ఉండి ఉన్నారా ?

సమాధానం:-

ఉన్నారు. ద్రౌపదికాకుండా ఇంకా అనేకులైన స్త్రీలు - బహుభర్తృకలైనవారు ప్రాచీన కాలంలో ఉన్నారు. వారిలో కొందరు ఈ క్రిందివారు.

మత్స్య పురాణంలోనూ, దేవీభాగవతంలోనూ ఈ క్రిందిగాథ చెప్పబడి ఉంది అదేమంటే-

కీర్తిమతి:- కీర్తిమతి అనేస్త్రీని- శుకమహర్షికి, పీవరికి- పుత్రులైన భూరిశ్రవుడు, గౌరప్రభుడు, కృష్ణుడు, శంభుడు, దేవశ్రవుడు అనే ఐదుగురు సోదరులు వివాహమాడారు. వీరు అకామకులు కారు. వేదవ్యాసుని పుత్రుడు శుకుడు.

పైన చెప్పిన ఐదుగురూ వేదవ్యాసుని కుమారుడైన శుకయోగి కుమారులు. వ్యాసమహర్షికి సాక్షాత్తూ మనుమలు. ఈ వృత్తాంతం మత్స్యపురాణంలోనూ, దేవీ భాగవతంలోనూ చెప్పబడి ఉంది.

శుకయోగి తొలుత బ్రహ్మచారిగా ఉన్నప్పటికీ, గృహస్థాశ్రమమే ముక్తిదాయకమని జనకరాజర్షి అతనికి బోధించడంవల్ల పీవరిని వివాహమాడినట్లు చెప్పబడింది.

వ్యాసభారతంలో ఈక్రింది వృత్తాంతం ఉంది. అజిత:- ఈమె ఔశీనరవతి కుమార్తె ఈమెను స్వయంవరంలో సాల్వేయుడు, శూరసేనుడు, శ్రుతసేనుడు, బిందుసారుడు, అతిసారుడు అనే ఐదుగురు అన్నదమ్ములు వివాహం చేసుకొన్నారు. వారు నితంతుడు అనే రాజర్షిపుత్రులు, ఈగాధ వ్యాసభారతంలో చెప్పబడి ఉంది.

విష్ణుపురాణంలోనూ, మత్స్యపురాణంలోనూ ఈక్రింది వృత్తాంతం ఇంకా సవివరంగా చెప్పబడిఉంది అదేమంటే- మారిష:- ప్రాచీనబర్హి యొక్క పుత్రులు ప్రచేతసులు. వీరు పదకొండు మంది, వీరంతా కలిసి ఈ మారిషను వివాహమాడారు. ప్రచేతసులకు మారిషయందు కలిగిన పుత్రుడే దక్షప్రజాపతి. ఈ వృత్తాంతం విష్ణుపురాణంలోనూ, మత్స్య పురాణంలోనూ మరింత విపులంగా చెప్పబడింది. ఇక్కడ క్లుప్తంగా మాత్రమే ఇచ్చాను.

వ్యాసభారతంలో ఈక్రింది గాధ చెప్పబడిఉంది. జటిల:- జటిలుడనే మహర్షి- గౌతమ మహర్షి వంశస్థుడు. జటిలుని పుత్రి యైన జటిల- ఏడుగురు ఋషులకు భార్య అయింది ఈవిషయం వ్యాస భారతంలో చెప్పబడింది.

**7 ప్రశ్న:** పరశురామునికీ, విశ్వామిత్రునికీ, ఏదో చుట్టరికం ఉందట. అది ఏమిటి? పరశురాముడు బ్రాహ్మణుడు, విశ్వామిత్రుడు క్షత్రియుడు- కదా? వారిమధ్య బాంధవ్యం ఎలా సాధ్యం ?

సమాధానం:

విశ్వామిత్రునికీ, పరశురామునికీ మధ్య బంధుత్వం ఉన్నది. ఆ గాథ విష్ణుపురాణంలోనూ, వ్యాస భారతంలోనూ, భాగవత పురాణంలోనూ ఉన్నది.

'గాధి' అనే రాజు కుమార్తె సత్యవతి. ఆమెను భృగువంశీయుడైన ఋచీకుడనే మహర్షి వివాహం చేసుకొన్నాడు. సత్యవతి సేవలకు, తనపై ఆమెకుగల శ్రద్ధానురాగాలకూ, భక్తికి సంతుష్టుడైన ఋచీకుడు- భార్యను వర మేదైనా కోరుకొమ్మన్నాడు. తన కొక కుమారుని, తన తల్లి కొక కుమారుని ప్రసాదించమని సత్యవతి ఋచీకుని కోరింది. ఋచీకుడు అంగీకరించి-వారిరువురి కోసం వేర్వేరుగా హోమజలాలను, హవిస్సులను ఇచ్చి-సత్యవతిని మేడిచెట్టును, ఆమె తల్లిని రావిచెట్టును కౌగిలించమని చెప్పాడు. కానీ మరచిపోయి సత్యవతి, ఆమెతల్లి-ఒకరు చేయవలసినది మరొకరు చేసి, ఒకరికిచ్చిన హోమ శేషాలను మరొకరు వినియోగించారు.

విషయం తెలిసిన ఋచీకుడు. సత్యవతి తల్లికి (గాధికి) జన్మించేవాడు క్షత్రియ కుమారుడైనా బ్రాహ్మణ కర్మదవుతాడనీ; సత్యవతికి జన్మించేవాడు బ్రాహ్మణ పుత్రుడైనా క్షత్రియ లక్షణం కలిగిన తీవ్ర స్వభావుడవుతాడనీ తెలిపాడు.

అందుకు సత్యవతి విచారించినదై, అటువంటి తీవ్రస్వభావం తన కుమారునికి బదులుగా మనుమనికి మార్పు చేయవలసిందని ఋచీకుని కోరింది. ఋచీకుడు భార్య కోరినట్లుగా అనుగ్రహించాడు.

జరిగిన దానికి ఫలితంగా-సత్యవతీ ఋచీకులకు జమదగ్ని జన్మించాడు. జమదగ్ని మహర్షి కుమారుడైన పరశురాముడు- ఋచీకుడు చెప్పినట్లుగానే తీవ్ర స్వభావుడయ్యాడు.

సత్యవతి తండ్రి అయిన గాధిరాజుకు కలిగిన పుత్రుడు విశ్వామిత్రుడు

తపస్వియై బ్రాహ్మణ కర్మడయ్యాడు.

దీనిని బట్టి-పరశురాముని నాయనమ్మ అయిన సత్యవతి తమ్ముడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుని అక్కయైన సత్యవతి మనుమడు లేదా విశ్వామిత్రుని మేనల్లుని కుమారుడు పరశురాముడు. విశ్వామిత్రుడు పరశురాముడు వీరి మధ్యగల బాంధవ్యం ఇది.

8. ప్రశ్న : శివ ధనుస్సును ఎత్తలేని రావణుడు-ఆ ధనుస్సును ఎత్తిన సీతాదేవిని ఎలా ఎత్తుకొని పోగలిగాడు?

సమాధానం:-

రావణుడు అర్భకుడు కాడు. సాక్షాత్తూ శివుడున్న కైలాస పర్వతాన్నే ఎత్తిన మహా బలశాలి, సాహసి. అదీగాక - శివధనువును ఎత్తే సందర్భంలో - సీత, రాముడు, రావణుడు - ఈ ముగ్గురి బలానికి పరీక్ష ఏర్పరచలేదు వాల్మీకి మహర్షి.

శివధనువును సీత ఎత్తినట్లుగా వాల్మీకి రామాయణంలో ఎక్కడా లేనేలేదు. దానిని ఎత్తి సీతను పెళ్ళాడడానికి రావణుడు రానూలేదు. శివధనువును ఎక్కుపెట్టే సందర్భంలో రావణుకు రావడమనేది పూర్తిగా అవాల్మీకమైన విషయం. వాల్మీకరామాయణానికి పూర్తిగా విరుద్ధమైన విషయం. ఇది స్పష్టం.

సీతతో, సీతా సౌందర్యంతో రావణునికి తొలిసారిగా పరిచయం కలిగించినది - శూర్పణఖ. అదీ - రామలక్ష్మణులు కామమోహితయైన శూర్పణఖను తిరస్కరించిన తర్వాతనూ - శూర్పణఖ ప్రేరణ మీదనే దండకారణ్యంలో జనస్థానంలో పధ్నాలుగు వేల మంది రాక్షసవీరులు - ఖరదూషణ త్రిశిరాది రాక్షస సేనా నాయకులతో సహా మరణించిన తర్వాతనే. లక్ష్మణునిచే ముక్కూ చెవులూ కోయబడిన ఆ శూర్పణఖ - జనస్థానంలో ఖరునితో చెప్పుకొని - ఆ రాక్షస నాయకులు ససైన్యంగా అసహాయశూరుడైన రామునిచేతిలో మరణించగా - తన పగ తీరక-ఆ పగ తీర్చుకొనడం కొరకే రావణుని సమీపించింది. సహజంగా స్త్రీలోలుడైన రావణుని ఎదుట సీతా సౌందర్యాన్ని వర్ణించి రావణుని రెచ్చగొట్టింది. తాను రామలక్ష్మణుల పట్ల మోహితురాలైనట్లుగా

శూర్పణఖ రావణునికి నిజాన్ని చెప్పలేదు. రావణుని కొరకు జగదేక సుందరి యైన సీతను తేవడానికి పోయి తాను భంగపడ్డానని శూర్పణఖ రావణునితో చెప్పింది జరిగినది అదే. కాబట్టి సీతా సౌందర్యాన్ని గురించి వినడం రావణునికి అదే ప్రథమం. అలాకాక - సీతా వివాహాత్పూర్వం రావణుడు ఆమెను గురించి విన్నా, చూచినా-ఆనాడే సీతను పొందడానికి ప్రయత్నం చేసి ఉండేవాడు-సహజంగా తాను స్త్రీలోలుడు కనుకనూ; ఆమె సౌందర్యవతి కనుకనూ.

అంతేకాదు - తానుకోరిన దానిని దేనినీ పొందకుండా విడిచిపెట్టే లక్షణం రావణునికి లేదు. సీతా వివాహాత్పూర్వమే సీతనుచూచిన, ఆశించిన రావణుడు ఆ తర్వాత 25 సంవత్సరాలు ఆగి ఆమెను ఎత్తుకుని వెళ్లాడనడ కేవలమూ అసందర్భం. సీతారామ వివాహం జరిగాక- వారు 12 సంవత్సరాలు అయోధ్యలో గడిపారు. రావణుడు సీతను అపహరించే నాటికి 13 సం॥ల వనవాసకాలం గడిచింది. సీతను ఆశించిన తర్వాత 25 సం॥లు రావణుడు ఆగాడని చెప్పడం అవాల్మీకమే కాక- హాస్యాస్పదం, ఔచితీభంగం.

శివ ధనువును ఎత్తలేని రావణుడు - ఆ ధనుస్సును ఎత్తిన సీతాదేవిని ఎలా ఎత్తుకు పోగలిగాడు? - అనడంలో రావణుడు సీతకంటే దుర్బలుడనే అర్థం స్ఫురిస్తుంది.

శివుడు నివసించే కైలాస పర్వతాన్నే పెకలించి ఎత్తి - తన శక్తితో, భక్తితో శివుని మెప్పించి వరాలు పొందిన రావణుని, దిగ్విజయం చేసి దిక్పాలకులను ఓడించిన రావణుని - అంత దుర్బలునిగా భావించడం ఉచితం కాదు. రావణుడే కనుక దుర్బలుడైతే, అతనిని జయించడం రామునికి మాత్రం ఏమి కీర్తి?

వాల్మీకంలో సుందరకాండ 10వ సర్గలో హనుమంతుడు చూచిన రావణుడు మహా వీరుడుగా. స్పృహణీయుడుగా వర్ణింపబడ్డాడు.

"భాస్వరే శయనం వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్।"
"నిశ్వసంతం యథానాగం రావణం వానరర్షభః।
ఆసాద్య పరమోద్విగ్నః సోఽపా సర్పత్ సుభీతవత్"॥
"అథారోహణ మాసాద్య వేదికాంతర మాశ్రితః।
సుప్తం రాక్షస శార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః॥"
"మాషరాశి ప్రతీకాశం నిశ్శ్వసంతం భుజంగవత్।
గాంగే మహతి తోయాన్తే ప్రసుప్త మివ కుంజరమ్॥"

సీతను అన్వేషిస్తూ రావణాంతఃపురంలో ఆ రాత్రివేళ తిరుగాడుతున్న పుడు - రావణుని శయనాగారంలో ప్రవేశించిన హనుమంతుడు - ప్రకాశవంత మైన శయనం పైన నిద్రిస్తున్న, వీరమూర్తియైన, రాక్షసాధిపుడు రావణుని చూచాడు. మదపుటేనుగు వలె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తూ నిద్రపోతున్న ఆ పరాక్రమశాలియైన రావణుని శయ్య వద్దకు హనుమంతుడు పోయిచూచాడు. అప్పుడు భయపడిన వానివలె హనుమంతుడు దూరంగా తప్పుకొన్నాడు. రాక్షస శార్దూలుడైన ఆ రావణుడు - గొప్ప మినుముల రాశివలె కనిపించాడు. రావణుని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు - ఒక మహాసర్పం బుసలు కొడుతున్నట్లుగా ఉన్నాయి. గంగానదీ జలాల మధ్య శయనించిన ఏనుగు వలె నిద్రిస్తున్నాడు.

అశోకవనాన్ని పాడుచేసి, తననెదిరించ వచ్చిన రాక్షసులందరినీ చంపిన హనుమంతుడు- ఇంద్రజిత్తుని బ్రహ్మాస్త్రానికి కట్టుబడి రావణ సభకు తీసుకొని పోబడ్డాడు. ఆ సభలో రావణుని మరింత స్పష్టంగా చూచిన హను మంతుడు-

"అహోరూప మహోధైర్యం అహోసత్త్వ మహోద్యుతిః।
అహో రాక్షస రాజస్య సర్వ లక్షణ యుక్తతా॥
యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః।
స్యాదయం సురలోకస్య స శక్రస్యాపి రక్షితా॥" -

అని ఆశ్చర్యంతో భావించాడు. దాని భావం ఏమంటే-"ఆహాహా! ఏమి రూపం! ఏమి ధైర్యం! ఏమి శక్తి! ఏమి కాంతి! ఈ రాక్షస రాజు-సర్వ మహా పురుష లక్షణాలతో ఎంత అద్భుతంగా ఉన్నాడు! ఒక్క అధర్మమే కను లేనట్లయితే ఇంద్ర రక్షితమైన స్వర్గ సామ్రాజ్యాన్ని పాలించడానికి అర్హుడు కదా ఇతడు!"-అని.

యుద్ధభూమిలో రాముడు తొలిసారిగా రావణుని ప్రత్యక్షంగా చూచి విభీషణునితో ఇలా అన్నాడు:-

"అహో దీప్తో మహా తేజాః రావణో రాక్షసేశ్వరః
ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యః రశ్మిభి ర్భాతి రావణః।
సువ్యక్తం లక్షయేహ్యస్య రూపం తేజస్సమావృతమ్॥"

భావం: ఏమి రాక్షస రాజు ఇతడు! మహాతేజంతో వెలుగుతున్న ఇతడిది ఏమి రూపం!

"భాతి రాక్షస రాజో౽సౌ ప్రదీప్తై ర్భీమవిక్రమైః।
భూతైః పరివృత స్తీక్ష్ణైః దేహవద్భి రివాంతకః॥"

భావం: "రాక్షస భటులతో కూడిన ఈ రాక్షస రాజు - భూత పరివృతుడైన యమునివలె - భీమ విక్రముడై ప్రకాశిస్తున్నాడు." - అని రాముడు అద్భుతాశ్చర్యాలతో పలికాడు. ఈ విధంగా శత్రువుల చేత కూడా ప్రశంసింపబడదగిన మహా మూర్తిమత్వం రావణునిది.

అంతటి వాడైన రావణుని - శివ ధనువును ఎక్కుపెట్టి సీతను పెండ్లాడే సందర్భంలో ప్రవేశపెట్టలేదు వాల్మీకి మహర్షి. సీతా కల్యాణ ఘట్టంలో రామ రావణులకు పోటీ ఏర్పరచడం మహర్షి అభిమతం కాదనేది స్పష్టం. శివధనువు దైవదత్తం; సీత దేవీస్వరూపిణి. దైవాంశ సంభూతుడు' దైవీ గుణ సంపన్నుడైన రామునికే ఆ అర్హత. ఎంతటి పరాక్రమశాలి అయినా రావణుడు రాక్షసుడు. ఆసురీ గుణ యుక్తుడు. అందుకే ఆ సందర్భం అతడికందలేదు.

9. ప్రశ్న:- మహాభారతంలో పాండు పుత్రులు పాండవులు; ధృతరాష్ట్రుని పుత్రులు కౌరవులూ ఎలా ఐనారు? అన్నదమ్ముల సంతానాలకు ఆ తేడా ఎలా వచ్చింది? గాంధారి కురువంశానికి చెందిన స్త్రీ కదా? తల్లి పేరుతో కౌరవులు చెలామణీ కావడానికి కారణమేమిటి?

సమాధానం:-

ముందుగా చెప్పవలసిన విషయం - గాంధారి కురువంశీయురాలు కాదు. ఆమె గాంధారరాజ పుత్రిక. సుబలుడనే పేరు గల గాంధారరాజు ఆమె తండ్రి. గాంధారి కురువంశస్థురాలు కాదు. ఆమె కురువంశపు కోడలే కాని ఆ వంశంలో జన్మించినది కాదు. కనుక, కౌరవులు తల్లి పేరుతో ఆ విధంగా వ్యవహరింపబడడం అనేది కేవలమూ సత్యదూరం.

ధృతరాష్ట్రుడు, పాండురాజు, వారి పూర్వులైన భీష్ముడు, శంతనుడు- ఇత్యాదులు జన్మించినదే కురువంశం. కురువు, పూరుడు, భరతుడు - వీరంతా వంశ ప్రసిద్ధులైన పుణ్యపురుషులు. వారి పేరు మీదుగా ఆ వంశానికి కురు వంశమనీ, పురువంశమనీ, భరతవంశమనీ పేర్లు వచ్చాయి. ప్రసిద్ధ కర్ము లైన వారి పేరిట వంశం ప్రసిద్ధం కావడం లోక సహజం కదా!

ఆ కురువంశీయులే ధృతరాష్ట్ర పాండురాజులు. కనుక 'కౌరవ నామం వారికీ, వారి సంతానాలకూ - కూడా వర్తిస్తుంది. ధృతరాష్ట్ర సంతా నమూ, పాండురాజ సంతానమూ కూడా - కౌరవ వంశంలో జన్మించినవారే ఆ వంశస్థులుగా అదే వంశం పేరిట పిలువబడదగినవారే.

ధృతరాష్ట్ర సంతానం ధార్తరాష్ట్రులుగాను, పాండురాజ సంతాన పాండవులు లేదా పాండవేయులు గానూ వారి వారి తండ్రుల పేరు మీదుగా చెప బడుతారు. తల్లుల పేర్ల మీదుగా గాంధారేయులు, కౌంతేయులు, మాద్రేయుల అవుతున్నారు.

కౌరవశబ్దం పాండవులకు కూడా వర్తిస్తుంది కనుకనే భగవద్గీతల భగవానుడు అర్జునుని అనేక చోట్లలో "కౌరవ" అనీ "పాండవ", "కౌంతేయ "పార్థః", "భారతః" అనీ ఇలా అనేక విధాలుగా సంబోధించడాన్ని మన గమనించవచ్చును.

వీనిలో 'కౌరవ' శబ్దం గోత్రార్థకం - అనగా వంశానికీ, కుటుంబానికి సంబంధించిన పేరు. 'పాండవ' శబ్దం అపత్యార్థకం. అపత్యమనగా సంతానం. కౌరవవంశానికి చెందినవారిలో పాండురాజు సంతానంగా ప్రత్యేకంగా పేర్కొనబడినవారు పాండవులు.

మరొక్క అంశం ఏమంటే - ధార్తరాష్ట్ర పాండవేయులిరువురూ కౌరవ శబ్ద వాచ్యులే అయినప్పుడు - కేవలమూ ధార్తరాష్ట్రులనే 'కౌరవు' లనే పేరుతో పేర్కొనడమూ, పాండవులను వేరుచేసి పేర్కొనడమూ ఎందువల్ల? - అనేది. దానికి సమాధానం - ఈ క్రిందిది.

ధార్తరాష్ట్రులూ, పాండవులూ - ఇరువురూ నిస్సంశయంగా కురువంశీయులే; కౌరవాభిధేయులే. అయితే, పాండవులు అరణ్యంలో పుట్టి, కౌన్నేళ్ళ వరకు అక్కడే పెరిగిన వారు. వారికి జాతకర్మ, నామకరణ, ఉపనయనాది యథోచిత సంస్కారాలన్నీ శతశృంగ పర్వత ప్రాంతారణ్యంలోనే జరిగాయి. తానున్న శతశృంగ పర్వత ప్రాంత నివాసులైన మహర్షుల వద్దనే పాండురాజు తన కుమారులకు వేదాధ్యయన, విద్యాభ్యాసాలను చేయింపజేశాడు. శర్యాతి పుత్రుడైన శుకమహారాజు - ఈ శతశృంగ పర్వత ప్రాంతంలోనే వానప్రస్థుడై తపోజీవనాన్ని గడుపుతూ ఉండగా - ఆయన వద్ద పాండు కుమారులందరూ ఆయుధ విద్యలు నేర్చి, అస్త్ర శస్త్ర ప్రావీణ్యం సంపాదించారు. ఈ విధంగా వేరొక చోటున పెరిగి, బాల్యంలో చాలా సంవత్సరాలు హస్తినాపురంలో కాకుండా మరొక ప్రదేశంలో ఉండిన కారణంగా పాండవులు లోకం చేత వేరుగా గుర్తించబడ్డారు. పాండురాజు మరణానంతరం మాత్రమే పాండవులతో కుంతి హస్తినాపురం చేరింది. ఆ విధంగా పెరిగి పెద్దవారైన తర్వాత రాజధానికి చేరిన పాండుపుత్రులు - అందరి చేతనూ పాండవులుగా పిలువబడ్డారు. స్వస్థానమైన హస్తినలో పుట్టి పెరిగిన ధార్తరాష్ట్రులు తొలినుండీ అక్కడే ఉండి - కౌరవులుగా స్థిరపడ్డారు.

ముఖ్యమైన మరొకకారణం-ధృతరాష్ట్రునికి ఏ విధంగానూ ప్రత్యేకమైన ఉనికి, గుర్తింపు లేవు. అతడు ఒక కురువంశీయుడు మాత్రమే. పాండు రాజుకు కిందమ ముని శాపం సంభవించిన కారణంగా విరక్తుడై రాజ్య త్యాగం చేయగా, ధృతరాష్ట్రుడు గద్దెనెక్కి, ప్రభువనిపించుకున్నాడే తప్ప, అతడు మూర్ధాభిషిక్తుడైన పరిపాలకుడు కాడు. జాత్యంధుడు కావడం వల్ల రాజ్యార్హత కోల్పోయిన వాడు. కానీ పాండురాజు అలా కాదు. సింహాసనా ధిష్ఠితుడై, దిగ్విజయ యాత్రచేసి, దశార్ణ, మగధ, పుండ్ర, విదేహాది దేశా లను జయించి రాజ్యవిస్తరణ చేసి సామ్రాజ్య స్థాపకుడనిపించుకొన్నాడు. తన అమేయ బల పరాక్రమాలతో అశేష సంపదను ఆర్జించి తెచ్చి - తన వంశ పూర్వ చక్రవర్తులను తలపించిన ఘనుడని పలువురి ప్రశంసలకు పాత్రుడై, ఒక ప్రత్యేకమైన గుర్తింపును పొందాడు. ఆ కారణం వల్లనే - ధృతరాష్ట్ర సంతానం కేవలం కౌరవులనే మూల నామాన్ని (వంశనామాన్ని) మాత్రమే కలిగి ఉండగా - ప్రజ్ఞాశాలి, పరాక్రమవంతుడైన పాండురాజు యొక్క సంతానం - పాండవులుగా ప్రత్యేకమైన గుర్తింపును పొందారు.

10. ప్రశ్న: శ్రీరాముడు, పరశురాముడు - ఈ రెండు అవతారాలెత్తింది శ్రీ మహావిష్ణువే. సాధారణంగా ఒక అవతారం చాలించిన తర్వాతనే మరో అవతారం ధరించడం జరిగింది. మరి ఈ రెండు అవతారాలూ ఒకేసారి ఎదురు పడతాయి. ఇదెలా సాధ్యం?

సమాధానం:-

శ్రీరామావతారం పూర్ణావతారం. పరశురామావతారం అంశావతారం. అంశావతారం తాను ఉద్భవించిన ప్రయోజనం తీరిన వెనుక, ఒక సాధారణ ప్రాణితో సమానమవుతుందని శాస్త్ర ప్రమాణం. అందువల్లనే, శ్రీరాముని ఎదుట పడిన పరశురాముడు భంగపడి వెనుదిరగడం జరిగింది. అంతేగాక, పరశురామ శ్రీరామావతారాలు ఉద్భవించిన ఆయా కాల సందర్భాలూ, వాని

పరిమితులూ, ప్రయోజనాలూ - విభిన్నమైనవి. అధికార దర్పితులై అహంక రించి మదించిన దురహంకారులైన ప్రభువులను శిక్షించి, భూత భవిష్యద్వర్త మానాలలోని పాలకులకు గుణపాఠం నేర్పవచ్చినది పరశురామావతారం. లోకానికి ఒక ఆదర్శ మానవుని జీవితాన్ని సోదాహరణంగా చూపడానికి, భావితరాల మానవులకు పథనిర్దేశకమైన మహోన్నత మానవ జీవితాదర్శా లను ఆచరించి చూపడానికి ఏర్పడినది శ్రీరామావతారం. ఆదర్శ పాలకునిగా, ప్రజాభిప్రాయాన్ని గౌరవించే ప్రభువుగా పృథివికి సుస్థితినిచ్చినది రామావ తారం. ఆధునికుల పరిభాషలో ఒకటి డిస్ట్రిక్టివ్, మరొకటి కన్స్ట్రక్టివ్. ప్రపంచానికి రెండూ అవసరమే. పరశురాముడు చేసిన వినాశనంలోనుంచే శ్రీరాముడు ప్రభవించాడు. దుష్టపాలకులను రూపుమాపిన వాడు పరశురాముడు ఆదర్శ పరిపాలకుడుగా రూపొందినవాడు శ్రీరాముడు.

పరశురాముడు చిరంజీవులలోనివాడు కావడంవల్ల - అతని అవతార పయోజనం నెరవేరిన తర్వాత కూడా అతడు జీవించి ఉన్నాడు. అంశావతారు డైన పరశురాముడు - అతని అవతార ప్రయోజనం నెరవేరిన వెనుక - చిరం జీవిగా ఉండి - శ్రీరామునికి ఎదురైనాడు.

అంశావతారం-తాను ఉద్భవించిన ప్రయోజనం తీరిన వెనుక ఒక సాధా రణ ప్రాణితో సమానమౌతుందనే శాస్త్రప్రమాణాన్ని అనుసరించి పరశురామావ తార లక్ష్యం నెరవేరిన వెనుక - అతడు భృగువంశీయుడైన ఒక విప్రుడు. తపస్వి. ప్రభావసంపన్నుడు. తేజశ్శాలి ఆసమయంలో విష్ణుమూర్తి యొక్క మరొక అవతారమైన శ్రీరామావతారం ఏర్పడడం అసంబద్ధంకాదు.

పరశురాముడుగా శ్రీమహావిష్ణువు దుష్టనిర్మూలనం చేశాడు. దుష్టవినాశ నం తర్వాత జరగవలసినది ప్రపంచాన్ని సువ్యవస్థితం చేయడం. చెడును అంతంచేసిన తర్వాత మంచిని ప్రోది చేయడం, ఉత్తమ వ్యవస్థలను నెలకొల్ప డం జరగాలి, శ్రీరామావతారంలో అదే జరిగింది పరశురామావతార లక్ష్యం

నెరవేరినాక జరుగవలసిన కార్యాలు శ్రీరామావతారంలో నెరవేర్చబడ్డాయి.

పరశురాముని గాథ బ్రహ్మాండ పురాణంలోను, బ్రహ్మ పురాణంలోను, వ్యాసభారతంలోను, వాల్మీకరామాయణంలోను - చెప్పబడింది.

సూర్యసావర్ణిక మన్వంతరంలోని సప్తమహర్షులలో పరశురాముడు ఒకడు.

**10. ప్రశ్న:- పంచ భీములు ఒకే సమయంలో జన్మించారని అంటారు. నిజమేనా? వారు ఒకే సమయంలో, ఒకే నక్షత్రంలో జన్మించి నప్పటికీ, వారి జీవితాలు ఒకే విధంగా నడవకపోవడానికి కారణం ఏమిటి?**

సమాధానం:-

పంచభీములు లేదా పంచబలులు అనబడే భీముడు, దుర్యోధనుడు, బకాసురుడు, జరాసంధుడు, కీచకుడు-ఒకే సమయంలో జన్మించలేదు. వారు సమవయస్కులనేది కూడా ఎంత మాత్రమూ నిజం కాదు. ఈ విషయానికి సంబంధించి-ఈ క్రింది అంశాలను పరిశీలించండి.

జరాసందుడు - కంసుని మామగారు. కృష్ణుడు - కంసుని మేనల్లుడు.

కనుక-జరాసందునికీ, కృష్ణునికీ-మూడు తరాల వయోభేదం ఉన్నది. ఈ లెక్క ప్రకారం భీమ, జరాసందుల మధ్య కూడా అంతే వయోభేదం ఉన్నది. భీమ దుర్యోధనులు.సమవయస్కులు. వారు కృష్ణుని కంటె కొద్దిగా చిన్న వాళ్ళు.

భీమాది పంచబలులు జన్మించిన జన్మ నక్షత్రాలు, జన్మ సమయాలు, లగ్న రాశ్యాదులు-వేరు వేరు కావడం వల్ల వారి జాతకాలు కూడా వేరుగానే ఉన్నాయి. కనుక-జీవిత గమనాలు కూడా వేరుగానే ఉంటాయి. వ్యాసకృత మైన భారతంలో ఎక్కడా ఈ అయిదుగురూ ఒకే సమయంలో, ఒకే నక్షత్రంలో జన్మించారని చెప్పబడలేదు.

"యస్మిన్నహని భీమస్తు జజ్ఞే భరత సత్తమ।
దుర్యోధనోపి తత్రైవ ప్రజజ్ఞే వసుధాధిప॥"

-అనే వ్యాస భారత శ్లోకాన్ని అనుసరించి భీమ-దుర్యోధను లిద్దరూ మాత్రమే ఒకే రోజున జన్మించారు-అదీ, ఒకేరోజున జన్మించారనే చెప్పబడింది కాని ఒకే సమయంలోకాదు. ఆ సందర్భంగా జరిగిన కథ ఈ క్రిందిది.

ధర్మరాజు జన్మించిన వార్త వినగానే అప్పటికి గర్భవతిగా ఉన్న గాంధారి-తన కంటె ముందుగా కుంతీదేవి సంతానవతి అయిందనీ, ఆ పిల్లవాడు భవిష్యత్తులో రాజ్యార్హుడు కాబోతాడనే ఆక్రోశంతో గర్భాన్ని మోదుకున్నది. అప్పుడు ఆమెకు గర్భపతనం జరిగింది. ఆ సమయంలో వ్యాస మహర్షిని ప్రార్థించగా, ఆ మహర్షి వేం చేసి, ఆ మాంస ఖండాన్ని నూట ఒక్క ముక్కలుగా విభజించి, ఒకొక్క దానినీ, ఒక్కొక్క నేతికుండలో ఉంచాడు. తనకు నూరుగురు కుమారులూ, ఒక్క కుమార్తె కావాలనీ గాంధారి యొక్క మనోభీష్టాన్ని అనుసరించి ఆయన ఆ విధంగా చేశారు.

అలా ఉంచబడిన కుండల నుంచి దుర్యోధనాదుల జననం జరిగిందనీ, కుంతీదేవికి భీముడు శతశృంగ పర్వతారణ్యంలో జన్మించిన రోజునే ఇక్కడ హస్తినాపురంలో దురోధ్యనుడు జన్మించాడనీ వ్యాస భారతం స్పష్టంచేస్తున్నది.

జరాసంధుడు భీముని కంటె, దుర్యోధనుని కంటె బాగా వయోధికుడు. అతడూ భీమ దుర్యోధనులూ ఒకే రోజున జన్మించడం యదార్థం కాదు.

ఇక-ఒకేరోజున జన్మించిన వారి జాతక ఫలితాలను గురించి-

ఎవరైనా ఒకేరోజున జన్మించినా, వారి జనన సమయాలలో తేడాఉంటే. జాతక ఫలితాలు తప్పక మారుతాయి.

జనన సమయంలో ఉన్న తేడాను బట్టి జన్మలగ్నం మారుతుంది. జన్మ

లగ్నం మారినప్పుడు, ద్వాదశ భావ ఫలాలున్నూ తప్పక మారడం జరుగు తుంది. ఆయాస్థానాలలో ఉన్న గ్రహాలు మారుతాయి. వాటిని బట్టి ఫలితాలు మారుతాయి.

ప్రతి దినమూ సూర్యోదయంనుండి మరుసటి దినం సూర్యోదయం వరకూ ద్వాదశలగ్నాలూ నడుస్తాయి ఏ లగ్న సమయంలో జన్మించిన వారికి ఆ లగ్నం జన్మలగ్నమవుతుంది.

ఒకే రోజున జన్మించినప్పటికీ, జన్మసమయం మారేసరికి, లగ్నమూ, గ్రహాల యొక్క స్థితీ కూడా మారుతుంది. ఉదాహరణకు మేషరాశిలో కుజుడు ఉండగా మకరలగ్నంలో జన్మించిన వారికి కుజుడు చతుర్థంలో ఉండగా ఆ కుజుడు అదే మేష రాశిలో ఉండగా కుంభ లగ్నంలో జన్మించిన వారికి తృతీయ మందు కుజుడు ఉండడం జరుగుతుంది. మొదటి వారికి చతుర్థ కుజ ఫలితాలు, రెండవ వారికి తృతీయ కుజ ఫలితాలు కలుగుతాయి. రెండింటి లోను ఎంతో భేదం ఉంటుంది.

ఈ విధంగా, జన్మించిన దినం ఒక్కటే అయినా, సమయం మారినట్ల యితే, ఫలితాలు ఎంతగానో మారడం జరుగుతుంది. జాతక చక్రం పూర్తిగా మారుతుంది. జన్మదినం ఒక్కటే అయినా, ఈ జననానికీ, ఆ జననానికీ- మధ్య గ్రహాలేవీ కూడా ఇతర రాశి ప్రవేశం చేయకుండా ఉన్నప్పటికీ కూడా జన్మ సమయం మారితే జాతక కుండలి పూర్తిగా మారుతుంది. దానిని బట్టి ఫలితా లున్నూ మారుతాయి. దశాంతర్దశలు విభేదిస్తాయి.

ఒకేదినమందు, జన్మసమయం మారేసరికి, అనేక మార్పులు ఉంటాయి లగ్నం మారుతుంది. నవాంశ మారుతుంది. దశా, అంతర్దశాశేషాలలో భేదం ఏర్ప డుతుంది తిథి మారవచ్చును. నక్షత్రం మారవచ్చును. గ్రహాలు తాముఉన్న రాశి గాని, నక్షత్రంగాని, నక్షత్రపాదంకాని మార్పుచెందవచ్చును. ఇంకా అనేక స్థూల

సూక్ష్మ అంశాలలో మార్పులు సంభవించ వచ్చును. ఈ మార్పు వల్ల రాశి కుండలిలో, నవాంశ కుండలిలో ఎన్నో భేదాలు ఏర్పడతాయి. అతి శీఘ్రగ్రహ మైన చంద్రుని గమనం వల్ల కూడా జన్మ సమయభేదాన్ని అనుసరించి, ఫలితా లలో ఎన్నో మార్పులు వస్తాయి.

పై కారణాల రీత్యా, ఒకే రోజున జన్మించినా, వివిధ సమయాలలో జన్మించిన వారి జాతకాలు ఒకే విధంగా ఉండవు. ఈ విషయంలో సందేహం లేదు.

## 11ప్రశ్న: గరుడ గర్వభంగం అంటారు కదా! అదెలా జరిగింది?

సమాధానం:-

గరుడ గర్వభంగ గాథ వ్యాసభారతంలో చెప్పబడి ఉంది.

ఇంద్రుని సారధి మాతలి, మాతలి కుమార్తె గుణకేశిని. మాతలి ఆమెకు వివాహం నిమిత్తం వరాన్వేషణ చేస్తూ ఒక యువకుని చూచాడు. అతడు సుముఖుడనే నాగుడని తెలిసి మాతలి అతని ఇంటికి వెళ్ళాడు. సుముఖుని తాత యైన ఆర్యకుని దర్శించి సుముఖునికి తన కుమార్తెనిచ్చి వివాహం చేయదలిచా నని మాతలి తెలిపాడు.

కానీ ఆర్యకుడు ఇలా చెప్పాడు. గరుత్మంతుడు కొద్దిరోజుల క్రితమే తన కుమారుడైన చికురుని చంపాడనీ; ఒక్క నెల రోజులలోగా సుముఖుని చంపుతానని ప్రతిజ్ఞచేసి ఉన్నాడనీ; అందువల్ల సుముఖునికి పిల్లనివ్వడం మంచిదికాదనీ ఆర్యకుడు మాతలికి చెప్పాడు.

ఈ విషయం చెప్పి-మాతలి ఇంద్రునీ, విష్ణువునూ ప్రార్థించాడు. విష్ణువు ఇంద్రునితో-సుముఖునికి అమృతం ఇమ్మని చెప్పాడు. ఇంద్రుడు గరుత్మంతు నికి కోపం తెప్పించడం ఇష్టం లేక-సుముఖునికి అమృతం ఇవ్వలేదు కాని,- దీర్ఘాయువునిస్తూ ఆశీర్వదించాడు. ఇంద్రుని ఆశీర్వచనం అమోఘం కనుక- మాతలి సుముఖునికి తన కుమార్తెనిచ్చి వివాహంచేశాడు.

ఈ విషయమంతా గరుత్మంతునికి తెలిసింది. అతడు విష్ణువు వద్దకు వచ్చి-సుముఖుని చంపుతానన్న తన ప్రతిజ్ఞకు భంగకరంగా విష్ణువు ఇదంతా

పాముకాటువల్ల మరణించింది. అప్పుడు రురుడు నిర్జనారణ్యంలోకి పోయి తీవ్రమైన దుఃఖంతో పరితపించి, ప్రమద్వర పునర్జీవితురాలు కావాలని తన ధర్మనిష్ఠపై ఒట్టుపెట్టుకొన్నాడు. తాను తపస్సు, దానం; దేవతలపట్లా, గురువులపట్లా పెద్దలపట్లా భక్తికలవాడై; ఆయా ధర్మాలను నిష్ఠతో ఆచరించినవాడై తే-ప్రమద్వర జీవించాలని రురుడు ఒట్టుపెట్టుకొని పలికాడు.

అప్పుడు ఒక దేవదూత కనిపించి - రురుని ఆయువులో ప్రమద్వరకు సగం ధారపోస్తే ప్రమద్వర జీవిస్తుందని దేవతలు తెలిపారని చెప్పాడు. రురుడు అందుకు అంగీకరించాడు.

ప్రమద్వర తండ్రి అయిన విశ్వావసుడు, ఆ దేవదూతతో కలిసి యమునివద్దకు వెళ్ళి - కోరగా, రురుడు ధారపోసిన సగం ఆయుర్దాయంతో యముడు ఆమెను బ్రతికించాడు. ఆ విధంగా ప్రమద్వరను రురుడు బ్రతికించుకొన్నాడు.

అనంతరం ప్రమద్వరను రురుడు వివాహం చేసుకొన్నాడు.

ప్రమద్వరను పాము కరచి చంపిందనే కోపంతో ఆ తర్వాత చాలా కాలంపాటు పాములపైన రురుడు పగ సాధించా.

14 ప్రశ్న : "గజ కచ్ఛపాలవలె పోరాడుకొంటున్నారు"- అని అంటారు. దాని అర్థం ఏమిటి?

సమాధానం:-

వ్యాసకృతమైన భారతంలో ఈ ప్రశ్నకు సమాధానం ఉన్నది. ఆ గాథ ఈ క్రిందిది:- మాతృదాస్య విముక్తికై అమృత సంపాదనానికై బయలు దేరిన గరుత్మంతుడు - తపోదీక్షలో ఉన్న తన తండ్రి కశ్యపుని దర్శించి నమస్కరించాడు. తాను తలపెట్టిన మహాకార్యమూ, దానికి కారణమైన తన తల్లి దాస్యమూ, కద్రువ - ఆమె పుత్రులూ అమృతాన్ని కోరిన విషయమూ

కశ్యప ప్రజాపతికి తెలిపి - ఆ మహత్కార్యాన్ని నిర్వహించడానికి తనకు తగిన ఆహారాన్ని చెప్పమని కోరాడు. అప్పుడు కశ్యప ప్రజాపతి - తన కుమారుడైన గరుత్మంతునికి తెలిపినదే ఈ గజ కచ్ఛపాల గాథ.

పూర్వం విభావసుడు, సుప్రతీకుడు అనే విప్ర సోదరులు ఐకమత్యంగా ఉండేవారు. కొన్నాళ్లకు కుటుంబ ఆస్తి విషయమై వారి మధ్య వివాదం చెల రేగింది. పర్యవసానంగా తమ్ముడు అన్నను తాబేలు కమ్మని; అన్న తమ్ముని ఏనుగుగా మారమని - ఒకరి నొకరు శపించుకొన్నారు. ఇరువురు సోదరులూ ఆయా జంతు రూపాలను పొంది - మహారణ్య మధ్యంలో సరోవర తీరాన అనేక వత్సరాల తరబడి ఘోరంగా పోరాడుతూనే ఉన్నారు. అవిరామంగా పోరుతూ ఉన్న ఆ గజ కచ్ఛపాలను పట్టి తినవలసిందని కశ్యప ప్రజాపతి- గరుత్మంతునికి ఆనతిచ్చాడు. వాటిని తినడం వల్ల అతడు మహా బలవంతుడు కాగలడని సెలవీయగా - గరుత్మంతుడు ఆ ప్రకారం చేశాడు.

తీవ్రంగా పోరాడుకొనే వారిని గూర్చి - 'గజ కచ్ఛపాల వలె పోట్లాడు తున్నారు'- అని అనడం పరిపాటి. ఆ నానుడి పై గాథ నుండే ఏర్పడింది.

**15 ప్రశ్న:- ధర్మరాజు చేసిన అశ్వమేధ యాగం కంటె సక్తుప్రస్థుని దానమే గొప్పదని అంటారు-ఎందుకు?**

**సమాధానం:-**

కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు మహావైభవంగా ఎన్నో దానా లతో, దక్షిణలతో అశ్వమేధయాగం నిర్వహించాడు. యజ్ఞ పరిసమాప్తి అయిన వెనుక-సర్వులూ ఆ యాగాన్ని ప్రస్తుతిస్తూ ఉన్న సమయంలో అక్కడకు ఒక ముంగిస వచ్చింది. దాని శరీరంలో సగభాగం మాత్రం బంగారమై, మిగతా సగభాగం మామూలుగానే ఉన్నది. ఆ ముంగిస అక్కడి వారందరూ వింటుం

పోయి అష్టావక్రుని ప్రసవించింది. ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు, అష్టావక్రుడు సమవయస్కులు. అష్టావక్రుడు - మేనమామ అయిన ఉద్దాలకునే తండ్రిగా భావించేవాడు. ఆ విధంగా అష్టావక్రుడు ఒకమారు ఉద్దాలకుని ఒడిలో కూర్చోగా, శ్వేతకేతువు పసితనం వల్ల - మీ తండ్రివద్దకే పొమ్మని అష్టావక్రుని తోసివేశాడు.

అప్పుడు అష్టావక్రుడు - ఉద్దాలకుడు తన తండ్రి కాదని తెలుసుకొని - తల్లి వద్దకుపోయి, తన తండ్రిని గూర్చి ప్రశ్నించాడు. ఏకపాదుడు వందితో శాస్త్రవాదం చేయడానికి జనకుని పట్టణానికి వెళ్ళాడనీ, ఇంతవరకు తిరిగి రాలేదనీ సుజాత తెలిపింది.

తనతో వాదించ వచ్చి ఓడిన పండితులను వంది - వరుణ గృహంలో జలదిగ్బంధనంలో ఉంచేవాడు. ఏకపాదుడు కూడా ఇన్ని సంవత్సరాలనుండి వందివద్ద బంధితుడై ఉన్నాడు.

అప్పుడు అష్టావక్రుడు జనకుని పట్టణానికి వెళ్ళి తన తండ్రి విషయం తెలుసుకొన్నాడు. జనకరాజ సభలో అష్టావక్రుడు వందితో శాస్త్రవాదం చేసి అతనిని ఓడించి - తన తండ్రితోపాటు వంది వద్ద బంధితులై ఉన్న విద్వాంసులందరినీ కూడా విడిపించాడు.

**18 ప్రశ్న :** ఒకరికి ఇచ్చిన వస్తువును మరొకరికి ఇవ్వరాదని ఎందుకు అంటారు?

**సమాధానం:-**

ఒక దేవతకు కాని వ్యక్తికి కాని అర్పించిన ద్రవ్యాన్ని కానీ, వస్తువిశేషాలను కానీ - వేటినీ - మరొక దేవతకు అర్పించడం దోషం. అదే విధంగా ఒక మనిషికి ఇచ్చిన ద్రవ్యాన్ని కానీ, వస్తు విశేషాలను కానీ వేరొకరికి ఈయడం దోషం.

దైవానికి, లేదా మానవులకు - ఒకరికిచ్చిన దానిపై మనకు ఏ విధమైన అధికారమూ ఉండదు. ఒకరి కిచ్చినది మరొకరికి ఇవ్వాలంటే - దాన్నిని

ముందుగా మనం తిరిగి తీసుకోవాలి కదా! దాని వల్ల "దత్తావహార"మనే దోషం సంక్రమిస్తుంది అనగా ఇచ్చిన దానిని తిరిగి స్వీకరించిన దోషం.

ఆ విధంగా ఒకరి కిచ్చిన దానిని మరొకరికిచ్చిన దోషం కారణం గానే 'నృగుడు' అనే మహారాజు ఊసరవెల్లిగా మారవలసిన శాపాన్ని పొందాడు. ఆ వృత్తాంతం భాగవత పురాణంలోను, వ్యాసభారతంలోను చెప్పబడిఉంది. అది ఈ క్రిందిది.

పూర్వం నృగుడనే ఒక మహారాజు ఉండేవాడు. అతడు బంగారు ఆభరణాలతో అలంకృతాలైన - దూడలతో కూడిన గోవులను - నిత్యమూ అసంఖ్యాకంగా దానం చేస్తూ ఉండేవాడు.

ఒకసారి అలా దానమిచ్చిన ఆవు ఒకటి - తిరిగి వచ్చి రాజ గోశాల లోని మందలో కలిసి పోయింది. ఆ సంగతి తెలియక - ఆ గోవును మరొకరికి దానమిచ్చాడు నృగమహారాజు.

ముందుగా దానం పొందిన విప్రుడు - తప్పిపోయిన తన ఆవు కోసం వెదుకుతూ - 'కన ఖలము' అనే గ్రామంలో మరొక విప్రుని యింటి ముంగిట ఆ గోవును కనుగొన్నాడు.

ఆ ఆవు నాదంటే నాదని విప్రులిద్దరూ వివాదపడి - చివరకు రాజైన నృగుని వద్దకు వెళ్ళారు. కానీ ఎన్నో రోజుల వరకు నృగుడు వారికి దర్శనం ఇవ్వలేదు. ప్రజలను పట్టించుకోని ఆ రాజుపై వారికి కోపం కల్గింది. ప్రజలు తమ విన్నపాలను చెప్పుకొనడానికి వీలుగా పరిపాలకుడు ఉండాలనీ, ప్రజలకు సమీపించరాని వాడుగా పాలకుడు ఉండరాదనీ ఆ విప్రులు ధర్మాన్ని తలచారు. అధికారమత్తతతో ప్రజలకు చేరరానివాడుగా ఉన్నందుకుగాను ఆ రాజుపై విప్రులు ఆగ్రహించారు. ప్రజలకు చేరరానివాడై పాలకుడు ఉండరాదని, అట్టి అపరాధియైన నృగ మహారాజును - ఊసరవెల్లిగా మారి ఒక పాడు నూతిలో పడి ఉండమని - ఆ విప్రులు శపించారు.

నృగుడు ఊసరవెల్లియై విప్ర శాపాన్ని అనుసరించి అనేక సంవత్సరాలు ఉండిన తర్వాత - యదు వంశంలో జన్మించిన శ్రీమహావిష్ణువు కరస్పర్శ వల్ల నృగునికి శాప విముక్తి కలుగుతుందని అనుగ్రహించారు ఆ విప్రులు. ఆ గోవును విప్రులిద్దరూ కలిసి వేరొక విప్రునికి ఇచ్చివేసి వెళ్ళిపోయారు.

తాను దానం చేసిన గోవును తిరిగి స్వీకరించిన పాపంవల్ల నృగునికి నరకలోకం ప్రాప్తించింది. కొంతకాలం నరకంలో ఉన్న తర్వాత - నృగుడు తాను పొందిన శాపంవల్ల ఊసరవెల్లి (తొండ)యై జన్మించాడు. ఆ విధంగా తొండరూపంతో పాడునూతిలో ఉన్న నృగ మహారాజా - కాలాంతరంలో శ్రీకృష్ణుని కరస్పర్శ వల్ల శాప విమోచనాన్ని పొందాడు.

19 ప్రశ్న : మునులు తాము శపించిన వారిమీద తమ కమండలంలోని నీరెందుకు చల్లుతారు?

సమాధానం:-

జలం సర్వ ప్రపంచానికి ఆధారం. జలంలోనుండి సర్వలోకమూ, సమస్త భూతజాలమూ జన్మించాయి. విశ్వమంతా జలంలోనుండి పుట్టి చివరకు జలంలోనే లయిస్తుంది. కాబట్టి జలం సర్వ విశ్వాత్మకం.

లోకంలో మంత్ర శక్తిని తమయందు నిలుపుగల వస్తువులు మూడే ఉన్నాయి. అవి : 1. జలం, 2. రుద్రాక్ష, 3. విభూతి.

జల కలశంలో ఏ దేవతామూర్తినైనా ఆవాహనం చేసి పూజించవచ్చును. జలం సర్వ దేవతాత్మకం. ఏ సంకల్పాన్నైనా జలాన్ని స్పృశించి చేయడం విధి విహితం.

అందుకే శాపవాక్యాలతో జలాన్ని అభిమంత్రించి ప్రయోగించితే - ఆ శాపాన్ని ఇచ్చిన వాని శక్తి ఆ జలంలో నిక్షిప్తమై పని చేస్తుంది.

శాపోదకం యొక్క ప్రభావాన్ని తెలిపే కథలు అనేకంగా ఉన్నా - ఒక దానిని మాత్రం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

విష్ణుపురాణంలోనూ, వ్యాసభారతంలోనూ, భాగవత పురాణంలోనూ కూడా ఈ గాథ చెప్పబడి ఉంది.

పూర్వం ఇక్ష్వాకు వంశీయుడైన సౌదాసుడనే రాజు ఒకడు - శ్రీరామునికి పూర్వుడు-ఉండేవాడు. అతడి రాజ్యానికి సంబంధించిన అడవిలో ఇద్దరు రాక్షసులు పులుల రూపంతో సంచరిస్తూ-కంటపడిన సర్వ ప్రాణులనూ భక్షిస్తూండే వారు. సౌదాసుడు వేటకు వచ్చి-ఆ ప్రాంతాలలో ఒక్క మృగం కూడా కనబడక-ఆ పులుల రూపంలోవున్న రాక్షసులలోని ఒక పులిని-బాణ ప్రయోగం చేసి చంపాడు. రెండవ రాక్షసుడు సౌదాసునిపై ఆగ్రహించి-ఆ రాజును పరుష వాక్యాలతో దూషించి-తగిన ప్రతీకారం చేస్తానని చెప్పి-అదృశ్యుడై పోయాడు. రాజు కలవరపడుతూ అయోధ్యకు చేరాడు.

ఆ సౌదాస మహారాజు కొంత కాలం తర్వాత దీక్షితుడై ఒక యజ్ఞాన్ని చేస్తూ ఉన్నాడు. ఆ యజ్ఞాంతదినాన-ఆనాడు సౌదాసుని పై పగబట్టిన రాక్షసుడు-రాజ పురోహితుడైన వశిష్ఠుని రూపంలో సౌదాసుని సమీపించాడు. తనకు నరమాంసాన్ని వండించి పెట్టమనీ, తన మాటకు పూర్వాపరాలూ, మంచి చెడ్డలూ ఆలోచించక చెప్పినట్లు చేయవలసిందనీ-మాయా వశిష్ఠుడు సౌదాసుని ఆజ్ఞాపించి వెళ్ళాడు. ఉత్తముడూ, సత్త్వగుణ సంపన్నుడూ ఐన వశిష్ఠుడు ఆవిధంగా ఆజ్ఞాపించినందుకు ఆశ్చర్యపడ్డాడు సౌదాసుడు. కానీ మహానుభావుడైన వశిష్ఠునికి తెలియని ధర్మమేముంది? ఆయనకు మంచిచెడ్డలు తెలుపవలసిన అవసరం ఏముంది? సకలధర్మవేత్త, బ్రహ్మమానసపుత్రుడైన వశిష్ఠుడు ఆవిధంగా ఆజ్ఞాపించాడని భావించిన సౌదాసుడు వంటవానిని ఆ ప్రకారం చేయమని-వధ్యస్థానంలో ఉన్న-మరణశిక్షపడి-ఎవరూ తీసుకొని వెళ్ళనిశవాన్ని తెచ్చి వండమని- చెప్పాడు. అనంతరం ఆ రాక్షసుడు వంటవానిలో-ఆవహించి నరమాంసాన్ని సిద్ధంచేశాడు. తన ప్రతీకారానికి రాక్షసుడు ఈ విధంగా రంగాన్ని సిద్ధం చేశాడు.

ఇంతలో నిజమైన వశిష్ఠుడు అక్కడికి రాగా-జరిగినది రాక్షసమాయ అని తెలుసుకోలేని సౌదాస మహారాజు-ఆ నరమాంస భోజనాన్ని నిజమైన వశిష్ఠునికి పెట్టించాడు. అప్పుడు రాక్షసుడు ఊహించి నట్లుగానే జరిగింది. ఏమంటే- తనకు వడ్డించబడినది నరమాంసమని తెలుసుకొన్న వశిష్ఠునికి పట్ట రాని ఆగ్రహావేశాలు కలిగాయి.

సౌదాసుని పనికి వశిష్ఠుడు నివ్వెరపాటుతో కూడిన క్రోధంతో- "రాజా, ఇదేమి రాక్షస కృత్యం? ఈ అకార్యానికి నీవెలా సాహసించావు? మతి భ్రష్టుడ వైనావా? నీవు చేసిన ఈ అకృత్యానికి శిక్షగా-నీవు నరమాంస భక్షకుడవైన రాక్షసుడవు కావలసిం"దని వశిష్ఠుడు శపించాడు.

తనను నరమాంసం కోరినవాడు వశిష్ఠుడేననీ, అతడే తననిప్పుడు తప్పు పట్టి శపించాడనీ భావించిన సౌదాసుడు కూడా క్రోధ పూరితుడయ్యాడు. "నేనూ ప్రతిశాపం ఇవ్వగల"నని శపించడానికై జలాన్ని చేతితో గ్రహించాడు. అయితే- పూజ్యుడైన వశిష్ఠుని శపించరాదని-సౌదాసుని అతని భార్య మదయంతి శాప జలాన్ని విడవకుండా నిరోధించింది.

సౌదాసుడు కోపాన్ని నిగ్రహించుకొని-ప్రభావ సంపన్నమైన ఆ శాప జలాన్ని ఎక్కడ విడిచి పెట్టాలని వితర్కించుకొని-ఆ జలాన్ని ఎక్కడ విడి చినా అపకారం జరుగుతుందని-చివరకు ఆ జలాన్ని తన పాదాల పైననే పోసు కొన్నాడు. ఆ శాపజలం పాదాలమీద పడగానే సౌదాసుని పాదాలు కల్మష దూషితాలు అయినాయి. అందువల్ల అతనికి "కల్మాష పాదుడు" అనే పేరు ఏర్పడింది.

అనంతరం జరిగిన దానిని వారంతా చర్చించుకోగా-ఈ వృత్తాంతమంతా రాక్షస మాయా కల్పనగా తెలిసి వచ్చింది. సౌదాసుడు, మదయంతి-వశిష్ఠుని చరణాలకు పునః పునః ప్రణామాలు చేసి-గుర్వనుగ్రహాన్నీ, శాపమోక్షణాన్నీ అర్థించారు.

అమోఘమైన వశిష్ఠశాపాన్ని మతలించడం వసిష్ఠునికి కూడా అసాధ్యం. తర్వాత పన్నెండేళ్ళకు కల్మాషపాదుని శాపం నివృత్త మవుతుందని వశిష్ఠుడు ఆనతిచ్చిన ప్రకారమే జరిగింది.

## 20 ప్రశ్న : శాప జలాన్ని విడవకపోతే శాపం పని చేయదా?

**సమాధానం :**

శాపవాక్కులతో జలాన్ని అభిమంత్రించి ప్రయోగించితే-ఆ శాపాన్ని ఇచ్చినవాని మంత్రశక్తి-ఆ జలంలో నిక్షిప్తమైన పని చేస్తుంది. అయితే-అమోఘ వచస్కులైన తపోధనులకు మాటే మంత్రం. వారి అనుగ్రహమే వరం, దీవెనే వరప్రదానం, ఆగ్రహరూపమైన నిందావాక్యమే శాపమూ కాగలవు. ఒక్కొక్కమారు అట్టి సిద్ధవాక్కులయిన మహాపురుషులనోట అప్రయత్నంగా జారిన పలుకులు కూడా- వరాలూ, శాపాలూ అయిన సంఘటనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అందువల్ల శాపాన్ని ఉద్దేశించకపోయినా- అప్రయత్న వాక్పతితాలైన శబ్దాలు కూడా శాపంగా పరిణమించినవి అనేకం ఉన్నాయి. ఉదాహరణార్థం-ఈక్రింది శ్లోకం వాల్మీకినోట అప్రయత్నంగానే వెలువడి-శాపంగా పరిణమించింది.

"మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీస్సమాః|

యత్క్రౌంచ మిధునాదేక మవధీః కామ మోహితమ్॥

-వంటివి. కాబట్టి శాపాన్ని ఉద్దేశించి జలాన్ని విడిచి పెట్టక పోయినా, అమోఘ వచస్కుని వాక్కు శాపంగా రూపొందవచ్చును. వ్యాస భారతంలో యక్ష ప్రశ్నలలో ధర్మరాజు చెప్పినట్లు- వాక్కు కూడా అవసరం లేదు. కేవలం- నిష్కారణంగా క్షోభించబడిన ధర్మాత్ముని హృదయం- క్షణంలో ముల్లోకాలనూ భస్మం చేయగలదు. ఈ అంశాన్ని- సర్వ ధర్మజ్ఞుడైన ధర్మరాజు- యక్షునికిచ్చిన సమాధానంతో స్పష్టంచేశాడు.

21 ప్రశ్న : రావణుని తల్లివైపు పూర్వీకులు ఎవరు? వారి చరిత్ర ఏమిటి?

సమాధానం :

రావణుని తల్లి వైపు పూర్వీకుల గాథ- వరాహ పురాణంలోను, వాల్మీకి రామాయణం ఉత్తరకాండలోను వివరించబడింది. కృతయుగంలో- స్వాయంభువమనువు కుమారులైన హేతి, ప్రహేతి- అనే రాక్షస సోదరులు ఉండేవారు. వీరిపేర్లు హేతి, ప్రహేతిగా కూడా పేర్కొనబడ్డాయి. వారిలో ప్రహేతి తపస్విగా ఉండిపోయాడు. హేతి- యముని చెల్లెలైన 'భయ'ను చేపట్టి, విద్యుత్కేశుడు అనే కుమారుని పొందాడు. సంధ్యా పుత్రికయైన సాలకటంకటను విద్యుత్కేశుడు వివాహం చేసుకొన్నాడు.

సాలకటంకట గర్భవతి కాగా ఆమె మందర పర్వతంపై ప్రసవించి! మగశిశువు కలుగగా వానిని అచ్చటనే విడచి వచ్చింది.

శివుడు ఆ శిశువును చూచి దయతలచాడు. ఆ బాలుని తానే ఎత్తి తెచ్చి పార్వతికి అప్పగించి- వానిని పుత్రునిగా భావించమని చెప్పి. శివుడు వానిని అప్పటికప్పుడే యువకునిగా మార్చి- వానికి సుకేశుడనే పేరు పెట్టి వానిని దేవ పురుషునిగా చేశాడు. ఆ సుకేశునికి కామగమనం కలిగిన ఒక విమానాన్ని ప్రసాదించాడు. శంకరుని అనుగ్రహానికి పాత్రుడైన సుకేశుడు దేవతలకు కూడా గౌరవార్హుడై ఉన్నాడు.

గ్రామణి అనే గంధర్వుని కుమార్తె 'దేవవతి'ని సుకేశుడు వివాహమాడి 'మాల్యవంతుడు,' 'సుమాలి,' 'మాలి'- అనే ముగ్గురు పుత్రులను పొందాడు. వారు ముగ్గురూ తీవ్ర తపస్సు చేసి బ్రహ్మ వల్ల వరాలు పొందారు.

ఆ రాక్షస సోదరులు- దేవశిల్పియైన విశ్వకర్మను పిలిచి- తమకు తగిన నివాసాలను నిర్మించమని కోరారు. తాను గతంలో ఇంద్రుని ఆనతిపై నిర్మించిన 'లంక' అనే చక్కని నగరం- దక్షిణ సముద్ర తీరంలో త్రికూట

పర్వతంపైన సువేలాద్రి శిఖరంపై ఉన్నదనీ, ఆ లంకా నగరంలో నివాసం ఏర్పరుచుకోమనీ- విశ్వకర్మ తెలిపాడు.

అప్పుడు రాక్షస నాయకులైన మాల్యవంతుడు, సుమాలి, మాలి- తమ రాక్షస పరివారంతో లంకా నగరంలో నివసించసాగారు. వారు ముగ్గురూ- 'నర్మద'- అనే గంధర్వస్త్రీ కుమార్తెలైన సుందరి, కేతుమతి, వసుద- అనే కన్యలను వివాహమాడారు. ముగ్గురూ పుత్ర పుత్రికా సంతానాన్ని పొందారు.

మాల్యవంతుడు, సుమాలి, మాలి- ముగ్గురూ తమ శక్తినీ, వరబలాన్నీ చూచుకొని గర్వించి- క్రూరకర్ములై నర సుర ముని గణాలను బాధిస్తూ లోకకంటకులయ్యారు. దేవ, ఋషి గణాలు శివుని వేడగా ఆయన విష్ణువును ఆశ్రయించమన్నాడు.

దేవలోకంపై దండెత్తిన మాల్యవంతాది రాక్షసులను విష్ణువు అనేక యుద్ధాలలో సర్వనాశనం చేశాడు. విష్ణువు విజృంభణానికి ఆగలేని మాల్యవంతాదులు- చావగా మిగిలిన రాక్షసులతో- లంకలో కూడా ఉండే వీలులేక పాతాళ లోకానికి పోయారు. వారు వదలి వెళ్ళిన లంకను - అనంతర కాలంలో కుబేరుడు ఆక్రమించుకొన్నాడు.

ఒకమారు సుమాలి- తన కుమార్తెయైన కైకసితో భూలోకానికి వచ్చి కుబేరుని వైభవం చూచాడు. కుబేరుని తండ్రి, పులస్త్య బ్రహ్మపుత్రుడూ అయిన విశ్రవసువును ఆరాధించి- కుబేరునంతటి పుత్రులను పొందమని చెప్పి కైకసిని - విశ్రవసు బ్రహ్మ వద్దకు సుమాలిని పంపించాడు. కైకసి ఆ ప్రకారమే విశ్రవసువును సమీపించి - తన అభీష్టాన్ని తెలపింది.

అసుర సంధ్యాసమయంలో వచ్చినందువల్ల అసుర ప్రవృత్తికల వారు జన్మిస్తారని చెప్పి - విశ్రవసుడు కైకసిని అనుగ్రహించాడు. ఆ విధంగానే కైకసికి దశగ్రీవుడు, కుంభకర్ణుడు, శూర్పణఖ, విభీషణుడు - జన్మించారు. ఇదీ రావణుని తల్లి వైపు వంశక్రమం.

**22 ప్రశ్న :** మరుద్గణాలు అనగా ఎవరు? వారి వృత్తాంతం ఏమిటి?

**సమాధానం :**

మరుద్గణాల వృత్తాంతం-బ్రహ్మపురాణంలోను, మత్స్యపురాణంలోను, వాల్మీక రామాయణంలోను చెప్పబడిఉంది. ఆగాథ ఈ క్రిందిది.

కృతయుగంలో జరిగిన దేవదానవ యుద్ధాలలో దితి పుత్రులైన రాక్షసు లంతా దేవతల చేతిలో సంహరించ బడ్డారు. తన పుత్రులందరూ మరణించి నందుకు దితి ఎంతగానో దుఃఖించింది. అప్పుడు దితి తన భర్త అయిన కశ్య పుని-తనకు ఇంద్రుని జయించగల కుమారుని ప్రసాదించమని ప్రార్థించింది. కశ్యపుడు దితిని అనుగ్రహించాడు. ఆమెకు ఒక వ్రతం ఉపదేశించాడు. ప్రస వం అయ్యే వరకూ దితి వ్రతనిష్ఠతో శుచిగా ఉండాలనీ-ఆ విధంగా పుత్రో త్పత్తి అయ్యేవరకూ శుచిగా నియమ నిష్ఠతో ఉండగలిగితే-ఇంద్రుని జయించ గల పుత్రుడు జన్మించగలడనీ- దితికి కశ్యపుడు వరమిచ్చాడు.

దితి ఎంతగానో ఆనందించి-కుశప్లవం అనే ప్రాంతంలో తన దీక్షను సాగిస్తున్నది. ఇంద్రుడు ఈ వృత్తాంతాన్నంతనూ తెలుసుకొని-దితి తపమాచ రిస్తున్న ప్రదేశానికి చేరుకొని-దితికి సర్వవిధాలైన పరిచర్యలూ చేస్తూ-అవకాశం కోసం వేచి చూస్తూ ఉన్నాడు.

ఒకనాడు దితి గర్భభారంతో అలసి- వ్రతనియమాన్ని తప్పి, జుట్టు విరబోసుకొని, మిట్టమధ్యాహ్నం వేళలో-పడక యొక్క తలవైపున కాళ్ళు. కాళ్ళవైపునతల-ఉంచి నిద్రించింది. దానివల్ల ఆమెకు అశుచిత్వం కలిగింది. దానిని అవకాశంగా తీసుకొని- ఇంద్రుడు యోగశక్తితో దితి గర్భంలో ప్రవే శించి- గర్భస్థ శిశువును తన వజ్రాయుధంతో 7 ముక్కలుగా ఖండించి మళ్ళీ ఒక్కొక్క ఖండాన్ని 7 ముక్కలుగా ఖండించాడు.

ఆ బాధవల్ల దితి మేలుకొని జరిగిన విషయం గ్రహించి, తన శిశువును చంపవద్దని ఇంద్రుని వేడుకొంది. ఇంద్రుడు బయటకు వచ్చి-ఆత్మరక్షణార్థమై

ఈవని చేశానని దితి పాదాలు పట్టుకొన్నాడు. దితి, తన శిశువు ముక్కలైనందుకు దుఃఖించి, చేసేదిలేక ఇంద్రుని ఇలా కోరింది. తన గర్భస్థ శిశుఖండాలన్నీ శిశువులుగా జన్మించాలనీ, వారు 7 సమూహాలుగా ఏర్పడి-వాయుగణాలకు అధిపతులు కావాలనీ-దితి ఇంద్రుని కోరింది, వారు ఇంద్రునితో స్నేహంగానే ఉంటారని మాట ఇచ్చింది.

ఇంద్రుడు-దితి సంతానానికి మరుద్గణాలు అని పేరుపెట్టి- దేవగణాలలో స్థానమిచ్చాడు. దితి కోరిన వాటన్నిటికీ అంగీకరించాడు. వారు 7 సమూహాలుగా బ్రహ్మలోకంలోనూ, ఇంద్రలోకంలోనూ, అంతరిక్షంలోనూ, నాలుగు దిక్కులలోనూ సంచరిస్తారని చెప్పాడు.

## 23 ప్రశ్న : శూర్పణఖ భర్త ఎవరు? ఆమె వృత్తాంతం ఏమిటి?

సమాధానం :

రావణ కుంభకర్ణ విభీషణులతో పాటుగా శూర్పణఖ కూడా- పులస్త్య బ్రహ్మ కుమారుడైన విశ్వవో బ్రహ్మ కుమార్తె రావణ కుంభకర్ణులకు చెల్లెలు. విభీషణునికి అక్కగారు విశ్వవో బ్రహ్మకు 'పాక' అనే భార్యయందు పుట్టిన పుత్రిక అనీ, విశ్వవో బ్రహ్మకు కైకసియందు పుట్టిన పుత్రిక అనీ- వాల్మీక రామాయణంలోను, వ్యాసభారతంలోనూ- ఈమె జన్మక్రమాన్ని గురించి పాఠభేదంగా చెప్పబడింది.

వైశ్వానరుడనే రాక్షసుని పుత్రికయైన 'కాలక' అనే రాక్షసికి జన్మించిన కాలకేయులలోని వాడైన 'విద్యుజ్జిహ్వుడు' అనే రాక్షసునికి- శూర్పణఖను ఇచ్చి వివాహం చేశాడు రావణుడు.

మరొకప్పుడు రావణుడు- కాలకేయుల నివాసమైన అశ్మనగరంపై దండెత్తాడు. అక్కడ కాలకేయులపై పోరుతున్న సమయంలో- కాలకేయులలో ముఖ్యుడై, తన సైన్యాన్ని తీవ్రంగా నష్టపరుస్తూ ఉన్న విద్యుజ్జిహ్వుని- రావణుడు యుద్ధోన్మత్తుడై తన ఖడ్గంతో నరికి వేశాడు.

కాలకేయులను రూపుమాపి ఇల్లు చేరుకోగానే శూర్పణఖ - తన భర్తను అతని అనుచరులను చంపించినందుకు దుఃఖంతో రావణుని నిలవేసింది.

రావణుడు యుద్ధావేశంలో తాను చేసిన పనికి క్షమించమని చెల్లెలిని కోరాడు. శూర్పణఖను ఓదార్చి, ఆమెకు జీవితంలో ఏ లోటూ రాకుండా చూస్తానని చెప్పాడు.

దండకారణ్యంలో 'జనస్థానం' అనే ప్రాంతంలో తన ప్రతినిధిగా - అక్కడ ఉండే దూషణ, త్రిశిరాది రాక్షస వీరులకు, రాక్షస సైన్యాలకు అధిపతియై ఉన్న 'ఖరు'డనే రాక్షసయోధుడు - రావణుని పినతల్లి కొడుకు ఉన్నాడు.

శూర్పణఖను ఖరునివద్ద ఉండమనీ, ఆమెను అతడు ఏలోటూ రాకుండా చూస్తాడనీ రావణుడు చెప్పాడు. శూర్పణఖ తపస్వులనూ, సాధుజీవనులనూ హింసిస్తూ ఆ అరణ్యంలో ఉండేది. ఆమె స్వేచ్ఛా విహారిణియై జనస్థానంలో ఖరుని ఆశ్రయంలో ఉండేది.

తర్వాత కొన్నాళ్ళకు శూర్పణఖ అడవిలో రామలక్ష్మణులను చూచి మోహించి - వారిచేత తిరస్కరించబడింది. సీత ఉన్నందువల్లనే తనను వారు తిరస్కరించారనే అభిప్రాయంతో సీతను మ్రింగబోయింది శూర్పణఖ, రాముడు శూర్పణఖను అడ్డుకొన్నాడు. క్రూరులతోనూ, వినీతులు కానివారితోనూ పరిహాసం ఆడరాదని లక్ష్మణుని రాముడు హెచ్చరించి శూర్పణఖతో అంతకుముందు లక్ష్మణుడు పరిహాసం ఆడినందుకు మందలించాడు. పట్టశక్యం కాకుండా సీతపై పడుతున్న శూర్పణఖను విరూపను చేసి దూరంగా తోలమనీ, సీతకు శూర్పణఖ వల్ల ఆపద లేకుండా చేయమనీ లక్ష్మణునికి ఆనతిచ్చాడు రాముడు. పురుషమైన రాక్షసుడైతే వానిని సంహరించి ఉండేవారు - రామలక్ష్మణులు. స్త్రీ కావడంవల్ల - రాముడు విరూపను చేసి విడిచిపెట్టమన్నాడు. లక్ష్మణుడు ఆ ప్రకారం శూర్పణఖ ముక్కూ చెవులూ కోసివేశాడు.

రామలక్ష్మణులు నిష్కారణంగా తనను హింసించారని శూర్పణఖపోయి ఖరునితో చెప్పింది. ఇద్దరు అన్నదమ్ములు ఒక స్త్రీతో ఉన్నారనీ, వారే తనని

హింసించారనీ, వాటి ముగ్గురినీ చంపి వారి రక్తాన్ని తాను త్రాగాలనీ చెప్పింది. ఖరుడు - ముందుగా తన యోధులను 14 మందిని రామలక్ష్మణులపైకి వెళ్ళ మన్నాడు. శూర్పణఖ వారిని వెంటపెట్టుకొనిపోయింది. కానీ వారంతా రాముని చేతిలో మరణించారు. శూర్పణఖ తిరిగి ఖరుని వద్దకుపోయి అతనిని దూషిం చింది. అప్పుడు ఖరుడు 14 వేల రాక్షస సైన్యంతో, దూషణ త్రిశిరాది వీరులతో రామునిపైకి వచ్చాడు. రాముడు అది చూచి - సీతను, ఆమెకు రక్షణగా లక్ష్మ ణుని - ఒక కొండ గుహలో దాచి ఉంచి - తన ఒక్క చేతిమీదుగా - వారం దరినీ నిశ్శేషంగా హతమార్చాడు.

పగ చల్లారని శూర్పణఖ - రావణుని వద్దకు పోయింది. జనస్థానంలో రామలక్ష్మణులనే నరులు - ఒక సుందరితో ఉన్నారనీ; ఆ సుందరిని తాను రావణుని కొరకు తేబోగా ఆ నరులు తన ముక్కు చెవులూ కోశారనీ; తాను ఖరునితో పోయి చెప్పగా ఖరుడు వారిపై దండెత్తి ససైన్యంతా హతుడైనా డనీ; ఆ నరులవల్ల జనస్థానంలో రావణుని ఆధిపత్యం నాశనం అయిందనీ; వారివద్దనున్న ఆ అతిలోకసుందరిని తేవడం ఒక్కటే ఆ నరులకు తగిన శిక్ష అనీ - ఆ సుందరిని పొందని జన్మ వ్యర్థమనీ; ఆమెను తేవడం ఉభయ తారకం - (ఇటు సీతను పొందడమూ, అటు రామలక్ష్మణులపై కక్ష తీర్చు కోవడమూ)గా ఉంటుందనీ- శూర్పణఖ రావణుని చెవిలో ఇల్లు కట్టుకొని పోరి పోరి చెప్పింది. వనికిమాలిన నరులు తనంతటివానిని చెల్లెలికి ఇంత అపకారం చేయగా - ప్రతిక్రియ చేయలేని చేత గాని వాడవని నిందించింది. రావణుని ముందు సీత అందాన్ని ఎంతగానో ప్రశంసించి అతడి మతిపోగొట్టింది.

రామలక్ష్మణులు లేని సమయంలోనే సీతను ఎత్తుకురావాలనీ, అదే వారు తమ రాక్షవీరులందరినీ చంపిన దానికి తగిన ప్రతిక్రియ అవుతుందనీ బోధిం చింది. చివరకు సీతాపహరణం చేయించి తన పగ తీర్చుకొంది.

శూర్పణఖ కుమారుడు జంబుకుడు-అనేవాడు-అరణ్యంలో పొదలలో

ఉండగా లక్ష్మణుడు ఆ విషయం తెలియక పలాలకై కత్తి విసరగా వాడు తెగి మరణించాడు.

ఇదీ శూర్పణఖ వృత్తాంతం.

24 ప్రశ్న : అరుణుడు ఎవరు? అతడు సూర్యుని కంటె ముందుగా వస్తాడని అంటారు. నిజమేనా? అరుణుడు, సూర్యుడు ఒకరేనా? కాదా?

సమాధానం :

వ్యాసమహర్షికృతమైన భారతంలో ఈ విషయానికి సంబంధించిన గాధలున్నాయి. దక్షప్రజాపతి యొక్క పుత్రికలూ, కశ్యప ప్రజాపతి భార్యలూ అయిన వినత, కద్రువలు సంతానార్థినులై - తమ భర్త అయిన కశ్యప ప్రజాపతిని- భక్తి శ్రద్ధలతో సేవించారు. ఆ సేవలకు సంతృప్తుడైన కశ్యపుడు వారిని ఒకనాడు తన చెంతకు పిలిచి, అభీష్ట వరాలను కోరుకొమ్మన్నాడు.

బల పరాక్రమాలు కలిగిన వేయిమంది పుత్రులు కావాలని కోరింది కద్రువ. తేజమూ, బలమూ, శౌర్యమూ కలిగిన ఇరువురు కుమారులను అభిలషించింది వినత. వారు కోరిన ప్రకారమే అనుగ్రహించాడు కశ్యపుడు. వినత, కద్రువ గర్భవతులయ్యారు. కశ్యపుడు తపోవనానికి వెళ్ళాడు.

కొంతకాలానికి కద్రువ వేయి గ్రుడ్లనూ, వినత రెండు గ్రుడ్లనూ ప్రసవించారు. కద్రువకు జన్మించిన అండాలలో నుండి వేయిమంది నాగులు బయల్పడ్డారు. వారు- శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, మణినాగుడు, ఏలా పుత్రుడు- మొదలైనవారు.

వినతకు కలిగిన అండాలనుండి ఎన్నాళ్ళకూ పిల్లలు రాకపోవడంతో వినత చింతించినదై, తన అండాలలో ఒక దానిని చిదిపింది. దానిలో నుండి మహా తేజస్వి అయిన ఒక కుమారుడు వెలికి వచ్చాడు. అతనికి అప్పటికి ఊరు భాగంవరకు మాత్రమే శరీర నిర్మాణం జరిగింది. దేహ నిర్మాణం పూర్తి కాకు

డానే జన్మించిన ఆ అనూరుడే అరుణుడు. బ్రహ్మ ఆజ్ఞ ప్రకారం అతడు సూర్యునికి రథసారధి అయ్యాడు. సారధి కనుక- రథికుడైన సూర్యుని కంటె అరుణుడే ముందుగా ఉదయిస్తాడు.

కాళ్ళు లేకుండా జన్మించిన అనూరుడు- తన తండ్రియైన కశ్యపుని ఆశ్రమంలో ఉండేవాడు. ఒకప్పుడు సూర్యునికి దేవతలపైన ఆగ్రహం కలిగింది. తాను లోకాలన్నిటికీ ఉపకారం చేస్తూ ఉన్నప్పటికీ రాహు కేతువులు తనను పీడిస్తున్నారనీ, దేవతలు వారిని నివారించడం లేదనీ- సూర్యుడు దేవతలపై ఆగ్రహించాడు. ఆ కోపంతో తన తీక్షాతి తీక్షమైన కిరణాలతో ప్రచండంగా మండిపోసాగాడు. లోకాలు ఆ తీక్షతకు తట్టుకోలేక పోయాయి. ఎల్లప్పుడూ లోకహితం కోరేవారైన మహర్షులూ, దేవతలూ బ్రహ్మదేవునికి ఈ విషయం విన్నవించారు.

అప్పుడు సూర్యుని కోప కారణాన్ని బ్రహ్మ వారికి తెలిపాడు. అరుణుడు అనే పేరుగల కశ్యపబ్రహ్మ పుత్రుడున్నాడనీ, వానిని సూర్యరథానికి సారధిగా చేయమనీ బ్రహ్మదేవుడు తెలిపాడు. అరుణుడు సూర్యరథానికి సారధియై-దాహుకేతువులకూ సూర్యునికి మధ్య అడ్డుగా ఉంటాడనీ, దానివల్ల సూర్యుని-రాహుకేతువులు నిత్యమూ బాధించలేరనీ బ్రహ్మదేవుడు వివరించాడు.

గరుత్మంతుడు- తన అన్న అరుణుని తన పై కూర్చుండ బెట్టుకొని తీసుకొని వెళ్ళి-సూర్యరథంపై అతనిని సారథిగా ఏర్పరచాడు.

అనూరుని భార్య పేరు శ్యేని, రామాయణంలో రామకార్యానికి సహకరించిన జటాయువు, సంపాతి-అనూరుడనే ఈ అరుణుని కుమారులే.

**25 ప్రశ్న :** జనకుని వద్దనున్న శివధనువు అతనికి ఎలా లభించింది? ఆ ధనువు యొక్క వృత్తాంతం ఏమిటి?

**సమాధానం:-**

వాల్మీకి రామాయణం బాలకాండ 66వ సర్గలో-రామలక్ష్మణులతో కూడి తన యజ్ఞాన్ని చూడవచ్చిన విశ్వామిత్ర మహర్షికి-జనక మహారాజు-తనకు శివ

ధనువు ఏవిధంగా లభించినదీ, సీతాదేవి ఏ విధంగా లభించినదీ, సీతా వివాహ సందర్భంగా జరిగిన సర్వ వృత్తాంతాన్నీ వివరించాడు. ఆ వృత్తాంతం ఈ క్రిందిది-

పూర్వం దక్షయజ్ఞవిధ్వంసన సమయంలో శివుడు తన ధనుస్సును దేవతల పైకి ఎక్కుపెట్టాడు. అంతట దేవతలు ఆయనను స్తోత్రం చేయగా శివుడు తన కోపాన్ని ఉపసంహరించుకొని-ఆ ధనుస్సును దేవతలకే ఇచ్చివేశాడు. దేవతలు ఆ ధనువును జనకుని పూర్వీకుడైన దేవరాతునికి న్యాసంగా ఇచ్చారు. అప్పటి నుండీ ఆ శివధనుస్సు పరంపరాగతంగా జనకుని గృహంలోనే ఉండిపోయింది.

ఒకప్పుడు జనకుడు యజ్ఞం చేయ తలపెట్టి భూమిని దున్నుతుండగా-ఆయనకు లభించిన స్త్రీ శిశువుకు 'సీత' అని నామకరణం చేసి పెంచుకొన్నాడు-జనకుడు. సీత పెరిగి పెద్దదయింది సీత అయోనిజ కావడంవల్ల ఆమెను శౌర్య శుల్కగా నిర్ణయించాడు జనకుడు. అనేకులు రాజపుత్రులు, రాజులు- సీతను అభిలషించారు. అట్టివారందరికీ-సీతకు పరాక్రమమే శుల్కం (ఓలి)గా చెల్లించి ఆమెను పొందవచ్చుననీ, శివధనువును ఎక్కుపెట్టడమే సీతకు చెల్లించవలసిన శుల్కమనీ-జనకమహారాజు ప్రకటించాడు.

శివధనువును ఎక్కుపెట్టడం ఎవరివల్లనూ కాలేదు. తమ పరాక్రమాన్ని సంశయించి, తమను తిరస్కరించాడనే కోపంతో-సీతను తమ కిమ్మని అడిగిన రాజులు జనకునిపై దండెత్తారు. సంవత్సరం పాటు సాగిన ఆ ముట్టడికో జనకుని సైన్య సామాగ్రి అంతా వ్యయమైపోయింది. జనకుడు దేవతలను ప్రార్థించి చతురంగ బలాలను పొంది-ఆ రాజులను తరిమివేశాడు.

సాంకాస్య పురాధీశుడైన సుధన్వుడనే రాజు-మిధిలా నగరాన్ని ముట్టడించి-శివధనువునూ, సీతనూ కూడా తనకు ఇచ్చివేయమని జనకునికి రాయబారం పంపించాడు. జనకుడు యుద్ధంలో సుధన్వుని హతమార్చాడు. జనకుడు తన తమ్ముడైన కుశధ్వజుని సాంకాస్య పురానికి పట్టాభిషిక్తుని చేశాడు

ఆ రోజులలో అనేక రాజులు, రాకుమారులు-శివధనువును ఎక్కుపెట్టిన వానికే సీతనిచ్చి వివాహం చేస్తాననే జనకుని ప్రకటన తెలుసుకొని-శివధనువును ఎక్కుపెట్టడానికై వచ్చి-విఫల ప్రయత్నులై మరలిపోతుండేవారు. అనన్నా హమంతా ఒక్క రోజులో జరిగిన సంఘటన కాదు. ఆ వచ్చిన వారిలో రావణాసురుడు లేడు.

పై వృత్తాంత మంతా బాలకాండ 66వ సర్గలో జనకుడు విశ్వామిత్ర మహర్షికి చెప్పాడు. ఇదే సీతాకల్యాణ వృత్తాంతాన్ని-అయోధ్యా కాండ 118వ సర్గలో-అనసూయా అత్రిమునుల ఆశ్రమానికి సీతారామ లక్ష్మణులు వెళ్ళినపుడు-అనసూయాదేవి ముచ్చటపడి సీతను ప్రశ్నించగా- అనసూయాదేవికి సీతాదేవి చెప్పింది.

విశ్వామిత్రుని యాగరక్షణకై ఆయనతో వెళ్ళిన రామలక్ష్మణులను వెంటబెట్టుకొని-జనక మహారాజు యజ్ఞసందర్శనార్థం విశ్వామిత్రుడు మిథిలా నగరానికి వెళ్ళాడు. అక్కడ విశ్వామిత్రుని అభ్యర్థనపై జనకుడు శివధనువును తెప్పించి రామలక్ష్మణులకు చూపించాడు. శివధనువుకు సంబంధించిన గాథనంతా జనకుడు విశ్వామిత్రునికి చెప్పిన తర్వాత-విశ్వామిత్రుడు ఆ వింటిని రామునికు చూపమని కోరాడు. జనకుని ఆజ్ఞ మీదట ఆవింటిని ఉంచిన ఎనిమిది చక్రాల బండిని అనేకమంది బలాఢ్యులు అతి కష్టం మీద లాగుకొని తెచ్చారు.

విశ్వామిత్రుని అనతిపై రాముడు ఆ వింటిని ఎక్కుపెట్టగా-ఆ ప్రయత్నంలో అది విరిగిపోయింది అంతకు పూర్వం అనేకమంది రాజులూ, రాజపుత్రులూ మొదలైన వారెందరో ఆ శివధనువును లేవనెత్తడానికి, దాని భారాన్ని పరీక్షించడానికి ప్రయత్నించారు. కానీ ఆ వింటిని వంచడానికి కాని, దానికి అల్లెతాడు ఎక్కించడానికి గానీ, దానిలో బాణాన్ని సంధించడానికి గానీ ఎవరికీ శక్యం కాక పోయింది.

అటువంటి ఆ శివధనువును-రాముడు అవలీలగా చేతిలో పట్టుకొని లేవ

నెత్తాడు. ఆ వింటిని వంచి-అల్లెతాటిని ఎక్కించే ప్రయత్నంలో అది విరిగి పోయింది.

శివధనువుకు సంబంధించిన సమగ్ర వృత్తాంతమిది.

## 26 ప్రశ్న : రామాయణంలో కాకాసుర వృత్తాంతం అంటే ఏమిటి?

సమాధానం :

కాకాసుర వృత్తాంతం వాల్మీకరామాయణంలో సుందరకాండ 38 వ సర్గలోనూ, 67 వ సర్గలోనూ కూడా చెప్పబడింది.

క్లుప్తంగా ఆ గాథ ఏమంటే చిత్రకూట పర్వతం మీద ఈశాన్య ప్రదేశాన మందాకినీ తీరంలో సిద్ధాశ్రమ ప్రాంతంలో సీతారాములు విహరిస్తూ ఉండగా- కాకి రూపంలో వచ్చిన ఇంద్రపుత్రుడు సీతాదేవిని తన ముక్కుతో, గోళ్లతో- గాయ పరచాడు. సీతాదేవి ఒడిలో నిద్రిస్తున్న రాముడు- సీత గాయంతో నుండి కారుతున్న రక్తపు తడికి మేల్కొన్నాడు. "నిన్ను ఈ విధంగా గాయపరచిన దుర్మార్గుడెవ"దని సీతను ప్రశ్నిస్తూ రాముడు చుట్టూ నలుదిక్కులకూ చూచాడు. అప్పుడు సీతకు ఎదురుగా రక్తసిక్తమైన గోళ్ళు, ముక్కుతో ఉన్న కాకిని రాముడు చూచాడు. సీతను గాయపరచిన ఆ కాకిపైన రామునికి తీవ్రమైన క్రోధం కలిగింది. దర్భపై బ్రహ్మాస్త్రాన్ని అభిమంత్రించి- రాముడు ఆ కాకిపైన ప్రయోగించాడు.

మండుతూ పరమ భయంకరంగా తనను దహించవస్తున్న ఆ అస్త్రాన్ని తప్పించుకొనడానికి ఆ కాకి ముల్లోకాలూ తిరిగి- ఆశ్రయమూ, రక్షణా లభించక పోగా- చివరకు రామపాదాలనే ఆశ్రయించింది. కరుణా సముద్రుడైన రాముడు ఆ కాకిని కరుణించాడు.

కాని, బ్రహ్మదేవతాకమైన ఆ అస్త్రాన్ని వ్యర్థం చేయడం శక్యంకాదు- అని రాముడు చెప్పగా- ఆ అస్త్రానికి తన కుడి కంటిని ఇచ్చివేసి ఆ కాకి తన ప్రాణాలను రక్షించుకొని- రామునికి, అతని తండ్రి దశరథునికి వందనాలు చెప్పి వెళ్ళింది.

ఈ గాథ అరణ్యకాండలో జరిగినా, అరణ్యకాండలో ప్రస్తావనకు రాదు. సుందరకాండ 38వ సర్గలో సీతాదేవి- రామునికి తనను చూచివచ్చిన గుర్తుగా చెప్పమని ఈ కాకాసుర వృత్తాంతాన్ని హనుమంతునికి చెప్పింది.

ఇదే గాథను సీతాదేవి తనకు చెప్పినది చెప్పినట్లుగా హనుమంతుడు రామునికి సుందరకాండ 67వ సర్గలో వివరించాడు.

## 27 ప్రశ్న : బ్రహ్మరథం అంటే ఏమిటి? ఈ పదాన్ని ఏ సందర్భంలో వాడుతారు?

**సమాధానం :**

ఈ బ్రహ్మరథం ప్రస్తావన వ్యాసభారతంలో నహుషుని చరిత్రలో ఉన్నది. ఒకప్పుడు బృహస్పతిని ఇంద్రుడు అలక్ష్యం చేయగా, అతడు ఇంద్రునిపై ఆగ్రహించి వెళ్ళిపోయాడు. అనంతరం ఇంద్రుడు మరొక పురోహితుని ఏర్పరచుకొన్నాడు. ఆ పురోహితుడైన విశ్వరూపుడు (త్వష్టప్రజాపతి పుత్రుడు)- రాక్షసులతో తనకు గల బంధుత్వం కారణంగా- వారికి హవిర్భాగాలు ఇవ్వడంతో, ఇంద్రుడు అతనిని సంహరించాడు. ఇంద్రునిపై బ్రహ్మహత్యాపాతకం ఆవహించింది. దోషదూషితుడైన ఇంద్రుడు స్వర్గాన్ని విడిచి వెళ్ళిపోయాడు.

అప్పుడు దేవతలు- భూలోకంలో మహారాజుగా ఉన్న నహుషుని గొప్పతనాన్ని విని- అతనికి దేవతలంతా తమ తమ అంశలను ప్రసాదించి- నహుషుని ఇంద్రునిగా చేశారు. ఇంద్రపదవిని పొందగానే నహుషుడు గర్వంతో మహర్షులనూ, దేవతలనూ, పూజ్యులనూ అవమానించ సాగాడు. అంతేగాక శచీదేవిని కోరాడు. శచీదేవి ఆ ఆపదను తప్పించుకొన దలచి- బృహస్పతితో సంప్రదించింది. అతని సలహా మీద- నహుషుని "బ్రహ్మరథం"పై అధిష్ఠించి రమ్మని శచీదేవి కోరింది.

అందుకు నహుషుడు అంగీకరించాడు. పూజ్యులు, తపస్వులనే ఆలోచన లేకుండా- అగస్త్యాది మహర్షులచేత తన పల్లకిని మోయించుకొంటూ బయలు దేరాడు. పూజ్యములైన మంత్రాలను హేళన చేస్తూ వారితో వాదించి, అగ

స్త్యుని తలను నహుషుడు తన్నాడు. అంతేగాక వాహనం మోస్తున్న ఆ మహ ర్షులందరిలో పొట్టివాడైన అగస్త్యుని వల్ల పల్లకి ఒక వైపు క్రుంగిపోతున్నది. తపస్వులైన ఆ మహర్షులు- నహుషుని దురాగతాలను సహిస్తూ- అతని పల్లకీని సహనంతో మోస్తూ ఉన్నారు. ఆ ఎగుడు దిగుడులను సరిచేసుకొంటూ మహ ర్షులు నడుస్తున్నందువల్ల నడక ఆలస్యం అవుతున్నది.

ఆ బ్రహ్మరథంలో కూర్చున్న నహుషునికి ఈ ఆలస్యం దుర్భరంగా ఉంది. త్వరగా శచీదేవిని చేరాలనే ఆత్రంతో అతడు "సర్ప సర్ప" (త్వరగా వెళ్ళు) అని అదిలిస్తూ- అగస్త్యుని కాలితో తన్నాడు. వెంటనే అగ స్త్యుడు "సర్పోభవః" సర్పంగా అవుదువుగాక! అన్నాడు. తక్షణమే నహుషుడు పెద్ద కొండచిలువగా మారి భూలోకంలో పడ్డాడు. అతని అహంకారం అణగారింది.

తనకు పూర్వజన్మజ్ఞానం నిలిచి ఉండాలనీ, ఏ ప్రాణులైనా తనకు చిక్కగానే తనకు లొంగి ఉండాలనీ నహుషుడు కోరగా - అగస్త్యుడు వానిని దయతలచి అనుగ్రహించాడు. నహుషుడు సర్పరూపంలో అడిగిన ప్రశ్నలకు ఎవరైన సమాధానం చెపితే - నహుషునికి శాపవిమోచనం కలుగుతుందని అగ స్త్యుడు వానిని అనుగ్రహించాడు. పాండవుల అరణ్యవాస సమయంలో - భీముడు నహుషుని నోటచిక్కాడు. భీమునికై వెదుకుతూ వచ్చిన ధర్మరాజు- ఆ మహా సర్పరూపుడైన నహుషుని చూచి - అతని వృత్తాంతాన్ని తెలుసు కొన్నాడు. నహుషుని ప్రశ్నలకు ధర్మరాజు సమాధానం చెప్పడమూ, నహు షునికి యథారూపం సిద్ధించడమూ జరిగాయి.

బ్రహ్మరథమంటే బ్రహ్మవంశీయులచేత, లేదా బ్రహ్మవేత్తలచేత మోయబడిన వాహనాన్ని అధిరోహించడం. అత్యధికమైన సత్కారానికి చిహ్నంగా ఈ పదం వాడుతారు. బ్రహ్మరథాన్ని మహాసత్కారంగా పరిగణి స్తారు. మహాత్ములకు ఈ సత్కారం జరుపుతారు.

యతులు, సన్న్యాసులు, అవధూతలు- సిద్ధి పొందినప్పుడు - వారిని బ్రహ్మరథంపై సాగనంపడం సంప్రదాయం.

లోకంలో ఎవరికైనా గొప్ప గౌరవం జరిగినప్పుడు-వారికి బ్రహ్మరథం పట్టాలనడం వాడుకగా స్థిరపడింది.

**28 ప్రశ్న : త్రిమూర్తులలో బ్రహ్మకు ఆలయాలు లేవు. ఎందువల్ల?**

**సమాధానం :**

దీనికి కారణమైన గాథలు-బ్రహ్మాండ పురాణం, శివపురాణం, బ్రహ్మ వైవర్తపురాణం, భాగవత పురాణం, వేంకటాచల మాహాత్మ్యం, స్కాంద పురాణం మొదలైన వానిలో ఉన్నాయి. వానిలో కొన్ని గాథలు ఈ క్రిందివి.

ఒకానొక సమయంలో బ్రహ్మ, విష్ణువులకు-వారిలో ఎవరు అధికులనే విషయంపై వివాదం ఏర్పడింది. వారి వివాదం క్రమంగా తీవ్రస్థాయికి చేరింది లోకపాలకులు, చరాచర జగదధి నాధులైన ఆ ఇరువురి సంఘర్షణతో సర్వ సృష్టి గడగడ లాడింది.

అప్పుడు బ్రహ్మ విష్ణువుల నడుమ ఒక మహాగ్ని స్తంభం సాక్షాత్కరించింది. "ఈ స్తంభం యొక్క ఆద్యంతాలను ఎవరైతే కనుగొన గలుగుతారో, కనుగొని ముందుగా తిరిగి ఆ ప్రదేశానికి ఎవరు రాగలరో, వారే అధికులనే" వాక్కు ఆ స్తంభంనుండి వినవచ్చింది.

అంతట బ్రహ్మ హంసవాహనుడై ఆ స్తంభం యొక్క చివరను కనుగొనడానికి ఆకాశమార్గాన బయలుదేరాడు. విష్ణువు వరాహరూపియై అధో మార్గాన ఆ స్తంభం యొక్క మొదలును చూడబోయాడు. ఇరువురూ వారివారి మార్గాలలో ఎంత దూరం ప్రయాణించినా ఆ స్తంభం యొక్క ఆద్యంతాలను కనుగొనలేకపోయారు. బ్రహ్మ తిరిగివస్తుండగా ఆకాశగంగాజలాల నుండి జారిన మొగలిపూవు, కామధేనువు ఎదురైనాయి. తాను ఆ అగ్ని స్తంభం యొక్క చివరిభాగాన్ని చూచినట్లుగా సాక్ష్యం చెప్పడానికి వారినుభ్యరినీ అంగీక

రింపజేసి, వారిని వెంటబెట్టుకొని, బ్రహ్మ మరలి వచ్చాడు. విష్ణువు తిరిగివచ్చి తన వైఫల్యాన్ని అంగీకరించాడు. బ్రహ్మ మాత్రం తాను సఫలుడైనట్లుగా పలికాడు. మొగలిపూవు, కామధేనువు ఆయనకు సాక్ష్యం పలికాయి.

తక్షణమే ఆ అగ్ని సంభజ్వలిత జ్వాలల నుండి మహోగ్రుడై మహాశివుడు ఆవిర్భవించాడు. అసత్యం పలికిన బ్రహ్మదేవునికి భూలోకంలో పూజార్హత ఉండబోదని శివుడు శపించాడు. మొగలిపూవు శివార్చనకు పనికిరాదనీ, గోవు యొక్క ముఖం చూడరాదనీ-విధించాడు సత్యశీలుడైన విష్ణువే సర్వజగన్నాధుదని స్పష్టంచేసి-అతని ఆధిక్యతను స్థాపించాడు. అసత్యం చెప్పిన బ్రహ్మయొక్క ఐదవ ముఖంగార్దభముఖంగా మారింది. అనంతరకాలంలో శివుని నిందించిన ఆ ముఖాన్ని శివునిఆజ్ఞపై భైరవుడు తెగవేశాడు. (బ్రహ్మకు తొలుత ఐ ముఖాలుండేవి )

బ్రహ్మ ప్రార్థించగా-యజ్ఞాలలో బ్రహ్మకు పూజ ఉండరాదనీ, మిగిలిన స్థలాలలో బ్రహ్మను పూజించవచ్చుననీ శివుడు కటాక్షించాడు.

పై కారణం వల్లనే బ్రహ్మదేవునికి ఆలయాలు లేవు.

పైన చెప్పిన గాథ శివపురాణంలోను, స్కాందపురాణంలోనూ, బ్రహ్మాండపురాణంలోనూ- ఉన్నది.

బ్రహ్మకు పూజ లేకపోవడానికి మరి రెండు గాథలుకూడా ఉన్నాయి. అవి ఈక్రిందివి.

ఒకప్పుడు బ్రహ్మ తన పుత్రుడైన నారదునికి-సృష్టి చేయమని ఆనతిచ్చాడు. కాని నారదుడు సంసారబంధనాలలో నిమగ్నుడు కావడానికి అంగీకరించలేదు. అప్పుడు బ్రహ్మ కోపించి నారదుని శపించడంవల్ల-నారదుడు బ్రహ్మకు భూలోకంలో పూజలేకుండాలని శపించాడు. ఇది బ్రహ్మవైవర్త పురాణంలోని గాథ.

త్రిమూర్తులైన బ్రహ్మవిష్ణు మహేశ్వరులలో అధికులెవరనీ, ఎవరు మోక్షప్రదాయకులనీ మునులు ఒకప్పుడు చర్చించుకొన్నారు. త్రిమూర్తుల వద్దకు వెళ్ళి-వారిని పరిశీలించి ఆ విషయాన్ని నిర్ణయించడం కొరకు భృగు

మహర్షిని పంపించారు. భృగువు బ్రహ్మవద్దకు వెళ్ళే సమయానికి బ్రహ్మ సరస్వతియందు తదేకచిత్తుడై ఉండి-భృగువుకు తగిన మర్యాద వెంటనే చేయ లేకపోయాడు. ఆకారణంగా భృగువు బ్రహ్మపై ఆగ్రహించి- బ్రహ్మకు పూజార్హత ఉండరాదని శపించాడు. ఇది వేంకటాచల మహాత్మ్యంలోనూ, భాగ వత పురాణంలోనూ చెప్పబడిన గాధ.

పైకారణాలవల్ల బ్రహ్మకు భూలోకంలో పూజార్హత లేకపోయింది

## 29 ప్రశ్న ; శ్రీ మహావిష్ణువు ఆదిశేషునిపైన పవళించడానికి కారణ మేమిటి?

సమాధానం :

వ్యాసకృతమైన మహాభారతంలో ఈ గాధ ఉన్నది. కశ్యప ప్రజాపతి యొక్క భార్యలలో వినత, కద్రువలు- కశ్యప ప్రజాపతిని భక్తితో సేవించగా- ఆయన సంతోషించి వరం కోరుకొమ్మన్నాడు. ఆయన వారికిచ్చిన వరం ప్రకారం- కద్రువకు కలిగిన అండాల నుండి శేషుడు, వాసుకి, కర్కోటకుడు, ఐరావతుడు- ఇత్యాది నాగులు జన్మించారు. కద్రువ వేయి మంది, వినత ఇద్దరు- పుత్రులను కోరుకొన్నారు.

వినతకు కలిగిన అండాల నుండి ఎంత కాలానికీ పిల్లలు బయల్పడక పోవడం వల్ల- ఆమె చింతాక్రాంతయై ఒక అండాన్ని చిదుమగా- దానిలో నుండి ఊరువుల వరకే రూపు దిద్దుకొన్న తేజస్వియైన అర్ధశరీరుడు బయల్ప డ్డాడు. తన శరీర నిర్మాణం పూర్తి కాకుండా చేసినందుకు దుఃఖంతో అరుణు డనే ఆ అనూరుడు- ఆమె సవతికి దాసి కావాలని వినతను శపించాడు. అనం తరం ఆగ్రహాన్ని మరలించుకొని, రెండవ అండంలోని కుమారుడు ఆమె దాస్య నివారణం చేయగలడని చెప్పి- తాను బ్రహ్మ నియామకంపై సూర్య రథ-సారధిగా వెళ్ళిపోయాడు.

అనంతర కాలంలో ఒకనాడు వినతా కద్రువలు సముద్ర తీరానికి వెళ్ళి-అక్కడ ఉచ్చైశ్రవమనే దేవతాశ్వాన్ని చూచి- ఒక పందెం వేసుకొన్నారు. ఆ అశ్వ శరీరమంతా తెల్లనిదేనని వినత, దాని తోక నలుపని కద్రువ- వాదించుకొన్నారు. ఎవరు ఓడిపోతే వారు- రెండవ వారికి దాసి కావాలని నియమం చేసుకొన్నారు.

క్షీర సాగర మధన సమయంలో జన్మించిన ఆ అశ్వం- శరీరమంతా శుద్ధ ధవళ వర్ణం కలిగినది. కద్రువ కుత్సిత బుద్ధితో ఈ పందెం ప్రారంభించింది. కపటమెరుగని వినత - కద్రువ మాటలకు లోబడి పందానికి అంగీకరించింది.

ఉచ్చైశ్రవాన్ని అప్పటి కప్పుడు దగ్గరకు వెళ్ళి చూడకుండా- రేపు వచ్చి చూడవచ్చునని చెప్పి, కద్రువ వినతను ఆశ్రమానికి తీసుకొని పోయింది. కద్రువ మనస్సులో- వినతను మోసం చేయాలనే దురూహ ఉన్న కారణంగా ఆ విధంగా చేసింది.

ఆ రాత్రి కద్రువ తన నాగకుమారులను పిలిచి-తాను దాసి కాకుండడం కోసం - ఉచ్చైశ్రవం తోకను చుట్టుకొని నల్లగా కనిపింప జేయమని కోరగా అధర్మ భీతితో నాగులు ఎంతమాత్రం దానికి సమ్మతించలేదు, అధర్మాన్ని ఇష్టపడక- నాగులలో కొందరు తల్లిని విడిచి దూరంగా వెళ్ళిపోయారు. తన మాట వినలేదనే కోపంతో- జనమేజయుని సర్పయాగంలో పడి మరణించమని అప్పుడు కద్రువ- నాగులను శపించింది శాప భయంతో అక్కడ ఉన్న నాగులందరూ కద్రువ మాటకు అంగీకరించి- ఉచ్చైశ్రవాన్ని సమీపించారు. వారు కద్రువ ఆజ్ఞను పాటించి, శాపాన్ని తప్పించుకొనదలచారు. కర్కోటకుడు తల్లి ఆజ్ఞను పాటించి, ఉచ్చైశ్రవం తోకకు వేలాడి, వినతకు దాస్య కారకుడయాడు.

ఈ దుష్ట వ్యవహారాన్నంతనూ ఏవగించుకొన్నాడు అనంతుడు (శేషుడు.) అతడు కద్రువ సంతానంలో జ్యేష్ఠుడు. తన తల్లి, తమ్ములు చేస్తూ

ఉన్న దుష్కార్యాలకు కలతచెంది, ఆ ఆదిశేషుకు విరక్తితో పోయి పుణ్య తీర్థాలన్నీ సందర్శించి వచ్చి- బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. శేషునికి బ్రహ్మ ప్రత్యక్షమై, అతనికి ఏమి కావాలని ప్రశ్నించాడు. "ఓ విధాతా! నా తమ్ములైన నాగులు-నా తల్లికలసి-నా పినతల్లియైన వినతను దుర్బుద్ధితో కష్టాల పాలు చేస్తున్నారు. ఆ నాగులు నిత్యమూ పరస్పరం సంఘర్షణ పడుతూ ఉంటారు. వారి దుష్టత్వాన్నీ, దుశ్చింతలనూ, కుత్సిత బుద్ధులనూ సహించలేక, దుఃఖంతో తపస్సు ప్రారంభించాను. తపోవృత్తిలోనే ఉంటూ శరీరాన్ని కృశింపజేసి నశించిపోవాలని నా నిర్ణయం"- అని మిక్కిలి విరక్తితో శేషుడు బ్రహ్మదేవునితో చెప్పాడు. అంతట బ్రహ్మదేవుడు- "ఓ శేషుడా! నీ తల్లి, సోదరుల కుటిలవర్తనమూ, నీ తల్లి శాపమూ - నాకు తెలుసు! వారివల్ల నీవు దుఃఖాన్ని పొందవద్దు. ఉత్తముడవైన నీవు- నీకు వలసిన వరాలను కోరి సుఖంగా ఉండు."-అని బోధించాడు. బ్రహ్మ ఓదార్పుతో శేషుడు దుఃఖాన్ని వీడి బ్రహ్మను ఈ క్రింది వరాన్ని కోరుకొన్నాడు. తన బుద్ధి సర్వదా ధర్మనిష్ఠమై ఉండాలని, తపోశమదమాదులయందు నిమగ్నమై ఉండే విధంగా, పాప కార్యాన్ని గూర్చి ఆలోచించే వ్యవధి లేని విధంగా ఉండే బాధ్యతను తనకు ఒప్పగించమని కోరాడు- అనంతుడు.

బ్రహ్మ అతని ధర్మనిష్టకు మెచ్చి- అతడుకోరినట్లే అనుగ్రహించాడు. అనంతుడనే శేషునియొక్క ఒకరూపం భూభారాన్ని మోసేటట్లూ, మరొకరూపం మహావిష్ణునికి తల్పంగా అమరేటట్లూ వరం ఇచ్చాడు. బ్రహ్మదేవుడు బ్రహ్మ ఆనతి ప్రకారం శేషుడు శ్రీమహావిష్ణువుకు తల్పంగా ఏర్పడ్డాడు. ఆనాటినుంచి విష్ణువు శేషతల్పంపైన వవశించాడు. శేషుడు తన మరొక రూపంతో భూభారాన్ని వహించాడు.

30 కర్ణుని తండ్రి పేరు సూతుడు కదా! సూతుడు శౌనకాదులకు పురాణాలు చెప్పినట్లు ఉన్నది కదా! ఈరెండూ ఒకదానికొకటి సంబంధం లేకుండా ఉన్నాయి. ఇది ఏమిటి?

సమాధానం:-

కర్ణుని తండ్రియైన సూతుడూ; శౌనకాదులకు పురాణ కథలు వినిపించిన సూతుడూ-ఒకరు కాదు. వారిరువురూ వేరు వేరు వ్యక్తులు.

కర్ణుని తండ్రిపేరు అతిరథుడు. 'సూతుడు' అనేది అతని పేరు కాదు- అతని వృత్తి. ఆ కాలంలో రథం తోలే వారిని 'సూతులు' అనేవారు. నదిలో దొరకిన బాలుని (కుంతీపుత్రుని)-ఈ అతిరథుడు, ఇతని భార్యయైన రాధ పుత్రునిగా స్వీకరించి- వసుషేణుడనే పేరు పెట్టి పెంచినట్లుగా వ్యాసభారతంలో చెప్పబడింది.

శౌనకాది మహర్షులకు పురాణాదులను వినిపించిన సూతుని పేరు ఉగ్రశ్రవసుడు. ఈయన- రోమహర్షణుడనే మహర్షి కుమారుడు.

ఈ ఉగ్రశ్రవసుడు వ్యాసుని శిష్యుడయిన వైశంపాయనుని నుండి పురాణాదులనూ, పుణ్య గాథలనూ అభ్యసించాడు శౌనకాదులు కోరగా అనేక పుణ్య గాథలను వారికి వినిపించినవాడు - ఈ ఉగ్రశ్రవసుడనే పేరుగల సూత పౌరాణికుడే.

## 31 ప్రశ్న : అప్సరసలు ఎవరు ?

సమాధానం:

అప్సరసలను గురించిన గాథలు - బ్రహ్మవైవర్త పురాణం, విష్ణు పురాణం, మత్స్యపురాణం, పద్మపురాణం, భాగవత పురాణం, భవిష్యత్పురాణం, వ్యాసభారతం, బ్రహ్మపురాణం, దేవీ భాగవతం, మార్కండేయ పురాణం, వాల్మీకి రామాయణం - ఇత్యాదులలో అనేకం ఉన్నాయి.

రంభ, ఘృతాచి, తిలోత్తమ, చిత్రరేఖ, జానపది, ప్రమ్లోచన, ప్రమోచన, పుంజకస్థల, మోహిని, మదన, కాంతిచంద్రిక, కుమారి, సౌరభేయి, నర్తిని, బుద్బుద, లత, హంస, వర్చస్- వ్యాసుని మొదలైనవారు అప్సరసలు.

వీరిలో మేనక, ఘృతాచి, ఊర్వశి తప్ప - మిగిలినవారు క్షీరసాగరాన్ని మథించినప్పుడు ఆ పాల సముద్రంలోనుండి పుట్టినట్లు చెప్పబడింది. వీరిలో మేనక, ఘృతాచి - కశ్యప బ్రహ్మకు- కపిల అనే భార్యయందు జన్మించారు. ఈ కపిల - దక్షప్రజాపతికి ధరణీదేవియందు జన్మించినది.

ఊర్వశి నారాయణఋషి ఊరువు (తొడ)నుండి జన్మించినది. ఆ వృత్తాంతం ఏమంటే - ఆదిఋషులైన నరనారాయణులు తపస్సు చేసుకొంటూ బదరికాశ్రమంలో ఉన్నారు. ఇంద్రుడు వారి తపస్సును భంగం చేయడానికి అప్సరసలను పంపాడు. ఆ అప్సరసలను చూచి - నారాయణఋషి - తన గోరుతో తొడను గీరుకొన్నాడు. దానినుండి ఆ అప్సరసలందరికంటె సుందరాంగి ఒకతె వెలువడింది. ఆమెను చూచి అప్సరసలు వెలవెలబోయారు. ఊరువునుండి జన్మించిన ఆమెకు ఊర్వశి అని పేరు వచ్చింది. ఊర్వశిని ఇంద్రునికి తన కానుకగా ఇమ్మని నారాయణఋషి చెప్పి-ఆమెను అప్సరసలతో చేర్చి ఇంద్రుని వద్దకు పంపాడు. ఆమె అప్సరసలతో కలసి స్వర్గానికి చేరింది.

ఒకప్పుడు సూర్యుడు, వరుణుడు ఊర్వశిని చూచి మోహితులు కాగా - వారికి అగస్త్యుడు, వసిష్ఠుడు - కుంభ సంభవులై జన్మించారు.

పురూరవుడనే చక్రవర్తికి ఈమె కొంతకాలం భూలోకంలో భార్యగా ఉన్నది. ఈ పురూరవుడు షట్చక్రవర్తులలోనివాడు. పాండవుల వంశకర్త.

అప్సరసలకు వివాహవిధిలేదు. అప్సరసల గాథలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

**32 ప్రశ్న :** ఋష్యమూక పర్వత ప్రాంతంలోనికి వాలి ప్రవేశించరాదనే ఆంక్ష ఎలా వచ్చింది?

**సమాధానం :**

వాలి రాజ్యానికి వచ్చిన తొలి రోజులలో దుందుభి అనే మహా బలిష్ఠ

దైన రాక్షసుడొకడు వాలిని యుద్ధానికి పిలిచాడు. దుందుభితో యుద్ధంచేసి-వాలి వానిని సంహరించాడు.

బలగర్వితుడయిన వాలి - మరణించిన దుందుభి కళేబరాన్ని రెండు-చేతులతో ఎత్తి ఒక యోజనం దూరానికి పోయి పడేవిధంగా విసరివేశాడు. ఆ దుందుభి కళేబరం- ఆ ప్రాంతంలో తపస్సు చేసుకొంటున్న మతంగ మహర్షి ఆశ్రమంలో పడింది. దుందుభి నోటివెంట, చెవులవెంట ప్రవహిస్తున్న రక్తధారలు మతంగాశ్రమం నిండా చిందడమేగాక, మతంగ మహర్షి పైన కూడా పడ్డాయి. మతంగ మహర్షి ఆశ్రమంనుండి వెలుపలకు వచ్చి దుందుభి కళేబరం ఆశ్రమ పదంలో పడి ఉండడం చూచాడు. దానిని విసరిన వాడు వాలి-అని తన తపశ్శక్తితో తెలుసుకొన్నాడు.

దుందుభి కళేబరం ఆశ్రమంలోని వృక్షాలకు ఢీకొని పడడం వల్ల ఆ వృక్షాలు విరిగిపడి బీభత్సంగా తయారయింది. అదంతా చూచి మతంగ మహర్షి కోపంతో-"ఎవడైతే అహంకారంతో ఈపని చేశాడో-వాడు ఈ ఆశ్రమానికి ఒక ఆమడ పరిధిని దాటి లోనికి రావడానికి వీలులేదు. ఈ ఆంక్షను అతిక్రమించినట్లయితే వాని శిరస్సు వ్రక్కలవుతుంది. ఒక్క రోజులోపుగా వాలి తన అనుచరులతో ఆ ప్రాంతాన్ని విడిచిపోవాలని" మతంగమహర్షి శాసించాడు. తన అనుచరులైన వానరుల వల్ల ఆ శాపాన్ని తెలుసుకొని-వాలి ఋష్యమూకాన్ని విడిచిపోయాడు.

వాలిసుగ్రీవులకు విరోధం కలిగాక- సుగ్రీవుని-ఎక్కడా నిలవనీయకుండా తరిమికొట్టాడు-వాలి. అప్పుడు సుగ్రీవుడు-ఋష్యమూక పర్వతం మీదనే తలదాచుకోగలిగాడు. ఋష్యమూక పర్వత ప్రాంతంలోనికి వాలి ప్రవేశించరాదని, వాలి ఆప్రాంతంలో ప్రవేశిస్తే మరణిస్తాడనే ఆంక్ష ఉండడంవల్ల-వాలి భయంలేకుండా సుగ్రీవునికి ఋష్యమూక పర్వతమే ఆశ్రయమైంది.

**33 ప్రశ్న:** లంకిణి ఎవరు? ఆమె వృత్తాంతం ఏమిటి? ఆమె రావణుని సేవకురాలా?

సమాధానం :

లంకిణి లంకా నగరానికి అధిదేవత. ఆమె-రావణుడు నగర ద్వారాన్ని కావలి కాయడానికి నియమించిన ఉద్యోగిని కాదు.

హనుమంతుడు సీతాన్వేషణం కోసం లంకా నగరాన్ని ప్రవేశించ బోయిన ప్పుడు- లంకిణి ఆయనను అడ్డగించి-హనుమంతుని చేతి పిడికిటి పోటు తిన్నది. అప్పుడు లంకిణి ఆయనను శరణువేడి-తన వృత్తాంతాన్ని హనుమంతునికి ఈ విధంగా చెప్పింది.

పూర్వం రావణుడు దిగ్విజయంచేసే సమయంలో నంది- మొదలయిన వారు రావణుని చేతిలో దెబ్బతిన్నారు. అప్పుడు వారు కోపంతో- లంకానగరం భస్మం కావాలని శపించారు. అప్పుడు లంకిణి- ఆ నగరంతో పాటు తానూ భస్మం కాగలననే భయంతో-బ్రహ్మవద్దకు పోయి-నందీశ్వరుని శాపాన్ని తొల గించమని ప్రార్థించింది.

బ్రహ్మదేవుడు లంకిణి పట్ల కరుణించి-లంకానగరం దగ్ధమై పోయినా లంకిణికి భయంలేదనీ, ఎప్పుడైతే ఒక కోతి చేతిలో లంకిణి భంగపడుతుందో- ఆనాడే రాక్షసులకు వినాశనం ప్రారంభమైనట్లుగా భావించాలనీ, అంతవరకూ లంకానగరం దగ్ధం కాదనీ చెప్పినట్లుగా లంకిణి హనుమంతునికి చెప్పింది. హనుమంతుడు తనకు పడగొట్టడంతో-బ్రహ్మదేవుడు చెప్పిన సమయం వచ్చిం దని గుర్తించి-లంకిణి హనుమంతునికి దారి ఇచ్చింది.

34 ప్రశ్న : జాబాలి, జంబుమాలి-వీరిద్దరూ ఎవరు? వీరికి గల సంబంధం ఏమిటి?

సమాధానం:

జాబాలి ఒక మహర్షి. ఆయన ప్రస్తావన, రామాయణంలో అయోధ్యా కాండలో వస్తుంది. సీతారాములు చిత్రకూటం వద్ద ఉండగా భరతుడు సపరివారంగా అక్కడకు వచ్చాడు. రాముని అయోధ్యకు మరలి రమ్మని ప్రతి

మాలాడు. ఆ సందర్భంగా జాబాలి మహర్షి-రాముడు అయోధ్యకు తప్పక తిరిగి రావాలని చెబుతూ, అందుకు సమర్ధింపుగా నాస్తిక వాదాన్ని వినిపిస్తాడు. ఇదీ జాబాలి మహర్షి పాత్ర రామాయణంలో జాబాలి మహర్షి నాస్తిక వాదం ఒక ముఖ్యాంశం.

జంబుమాలి-రావణుని మంత్రియైన ప్రహస్తుని కుమారుడు. సుందర కాండలో ఇతని ప్రస్తావన వస్తుంది. హనుమంతుడు సీతాదేవిని వెదకడానికి లంకకు వచ్చినప్పుడు అశోకవనాన్ని ధ్వంసంచేసిన సందర్భంలో-ఈ జంబు మాలి హనుమంతుని ఎదుర్కొని - ఆ యుద్ధంలో మరణించాడు. రావణుని చిన్న కొడుకైన అక్షకుమారుడు కూడా అదే సందర్భంలో హనుమంతుని చేతిలో మరణించాడు. ఈ అక్షకుమారుడు-రావణుని మరొక భార్య ఐన 'ధాన్యమాలిని, కుమారుడు. ఈవిధంగా అనేకులు హనుమంతుని చేతిలో మరణించిన తర్వాత ఇంద్రజిత్తుని బ్రహ్మాస్త్రానికి హనుమంతుడు కట్టుబడ్డాడు. అనంతర కథ విషయాంతరం.

## 34 ప్రశ్న: ఆషాఢమాసంలో గోరింటాకు ఎందుకు పెట్టుకుంటారు ?

సమాధానం:

"ఆషాఢస్య ప్రధమ దివసే" అంటూ వర్షారంభ సమయాన్ని వర్ణించ పూనుకున్నారు కాళిదాసు, తన మేఘసందేశంలో.

ఆషాఢమాసంలో వర్షర్తు ప్రారంభం జరుగుతుంది. ప్రతి ఋతువులోనూ, ఋతువు మారే సమయంలోనూ- మానవ దేహారోగ్య పరిరక్షణకు అవసరమైన సూచనలు భారతీయ సంస్కృతిలో చేయబడ్డాయి. ప్రజలకు వాటిపట్ల నమ్మకం ఏర్పడడం కోసం-అవి మత సంబంధమైన, దైవపరమైన, సంప్రదాయాలుగా ఏర్పరచబడినప్పటికీ, నిజానికి అవన్నీ ఆరోగ్య సూత్రాలు.

ఉగాదికి వేపపూత తినడమూ, ఆషాఢంలో గోరింటాకు పెట్టుకోవడమూ- ఇవన్నీ అటువంటివే.

గృహసంబంధమైన పనులలో స్త్రీలు ఎక్కువగా నీటిలో మసలడం జరుగుతుంది. వర్షాకాలంలో క్రిమికీటకాదులు నీటిద్వారా శరీరంలో ప్రవేశించ కుండానూ - ముఖ్యంగా చేతులు, కాళ్ళు, గోళ్ళకు హాని చేయకుండా ఉండడం కోసం, బొరుపులు, పుప్పిగోళ్ళు, పుళ్లు - సర్వచర్మ వ్యాధులూ రాకుండా చేసే గోరింటాకును - ఆరోగ్యం, అందం ఇచ్చేదిగా గుర్తించి, దానిని వినియోగించ వలసిందిగా ఋషులు ఏర్పరచారు.

గోరింటాకు ఒక మూలిక, ఔషధి. ఇదేగాక ఇంకా ఎన్నో మూలికలనూ, ఔషధులను-ఏవిధంగా ఉపయోగించాలనే విషయాలు మనభారతీయ శాస్త్రగ్రంథా లలో ఎంతో విపులంగా చెప్పబడ్డాయి. మానవజీవితానికి అవసరమైన అనేక విషయాలను శాస్త్రీయంగా అభివృద్ధి చేసినవారు భారతీయులు. వానిలో-వృక్ష దోహదక్రియలు, పశుజాతుల అభివృద్ధి విధానాలు (Animal breeding), ఆయుర్వేదం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, వృక్షవైద్యం, పశువైద్యం, గజ వైద్యం అశ్వవైద్యం, మూలికావరిజ్ఞానం, ధాతుపరిజ్ఞానం, వస్తుగుణ పరిజ్ఞానం, లోహవిజ్ఞానం - ఇత్యాది విషయాలెన్నో ఉన్నాయి. ఆయా విషయాలలో-అతి విస్తృతమైన పరిజ్ఞానాన్ని లోకానికి అందించి - ఆయా విషయాలకు శాస్త్రగౌర వాన్ని కల్పించారు-ప్రాచీనభారతీయ ఋషులు.

ఇంటి పరిశుభ్రతకు, శుద్ధికి-గోమయాన్నీ, గోమూత్రాన్నీ ఉపయోగించ డం మనకు తరతరాలుగా వస్తున్న ఆచారం. గోమయం, గోమూత్రాలవల్ల సూక్ష్మక్రిములు నశిస్తాయి. తేళ్ళు, జెర్రులు-వంటి విషకీటకాలు చేరవు. ఇంటి ముందు గోమయాన్ని నీళ్ళలో కలిపి చల్లడమూ, కొంతకాలం క్రితంవరకు ఇంటిలోపలకూడా గోమయంతో అలండమూ, సున్నంతో ముగ్గులు పెట్టడమూ, శుద్ధినిమిత్తం గోమూత్రాన్ని ఇంటిలోపల చల్లడమూ, పసుపును పాదాలకూ శరీరానికి పూసుకొనడమూ, పసుపును ఇంటిలో శుద్ధికి వినియోగించమూ-ఇలా అసంఖ్యాకమైన మన ఆచారాలన్నీ ఆరోగ్యసూత్రాలే. ఈపైన చెప్పినవన్నీ క్రిమినాశనానికి పనికివస్తాయి.

దేవతానుగ్రహంతోబాటు ఆరోగ్యవృద్ధి చేసే ఋతూచితమైన విధులు-కార్తీకమాసంలో రాత్రి నాలుగవజాములో బ్రాహ్మీముహూర్తంలో సూర్యోదయాత్పూర్వమే నదీస్నానం; మాఘమాసంలో సూర్యోదయసమయంలో నదీస్నానం; ధనుర్మాసంలో వేకువనే దేవతానివేదనం చేసిన పొంగలి తినడమూ; కార్తీకమాసంలో ఉపవాసాలూ; ప్రతినెలలోనూ ఏకాదశీఉపవాసాలూ; శివరాత్రి ఉపవాసమూ, జాగరణమూ; ఉగాదికి వేపపువ్వు, కొత్త చింతపండు, కొత్త బెల్లమూ, మామిడికాయ-ఇత్యాదులు చేర్చిన పచ్చడి తినడమూ; నిత్యమూ ప్రవాహజలంలో నదీస్నానం; సూర్యనమస్కారాలు; తులసీపూజా ప్రదక్షిణాదులు; తులసిఆకులను తినడమూ; తులసిచెట్లను ఇంటిపరిసరాలలో పెంచడమూ; రుద్రాక్షధారణమూ- ఇవన్నీ మానవుల ఆరోగ్య పరిరక్షణ నిమిత్తంగా-దయామయులైన ఋషులు ఉపదేశించిన ఆరోగ్య సూత్రాలు.

శివరాత్రి జాగరణ (Sleep Deprviation) వల్ల డిప్రెషన్, స్కిజోఫ్రెనియా- అనే మానసిక వ్యాధులు నివారించబడతాయని ఆధునిక విజ్ఞాన పరిశోధనలో తేలిన విషయం. పూర్వ భారతీయ ఋషులు బోధించిన అంశాలూ, అనుగ్రహించిన శాస్త్రాలూ- అనంతంగా ఉన్నాయి.

కొత్తగా రజస్వల ఐన బాలికకు నువ్వులూ బెల్లమూ కలిపి చిమ్మిలిగా తినిపించడం భారతీయ ఆయుర్వేదశాస్త్రం విధించిన ఆచారం. దీనివల్ల గర్భకోశ సంబంధమైన వ్యాధులు మొలకెత్తవు. ఋతుచక్రం క్రమబద్ధమౌతుంది. కళ్ళకు ఆముదంతో చేసిన కాటుక పెట్టడం, శరీరాన్ని నూనెతోమర్దించడం-ఇలా చెప్పవలసినవి ఇంకాఎన్నో ఉన్నాయి.

భారతీయ ఆయుర్వేద శాస్త్రం ఆమోదించిన వస్తు మిశ్రమాలతో కూడిన వంటకాలే అనాదిగా మన దేశంలో ఆచరణలో ఉన్నాయి. కారణం-కొన్ని కొన్ని వస్తువులను కలిపినట్లయితే-విషమిశ్రమాలు ఏర్పడతాయి. మరికొన్ని వస్తువుల మిశ్రమంవల్ల ప్రాణులకు మేలు కలుగుతుంది. వస్తుగుణ విశేషాలనూ, వివిధ మిశ్రమాల ఫలితాలనూ-భారతీయులు ప్రాచీనకాలంలోనే గుర్తించారు. కనుకనే-

దుష్ఫలితాలు కలగని వస్తువులను మాత్రమే కలిపి వండేవిధంగా పాకశాస్త్రాన్ని రూపొందించారు. దానికి భిన్నమైన విధంగా వస్తువులను మిశ్రితంచేసి తినడం కూడదు.

భారతీయ నాట్యశాస్త్రం; సంగీతం; హఠయోగ, రాజయోగ, ధ్యాన యోగ, క్రియాయోగాది యోగవిధానాలు-ఇవన్నీకూడా మానవుల శరీరాన్నీ, మనస్సునూ, బుద్ధినీ, ఆత్మనూ వికసింపచేసి అభ్యుదయాన్ని కలిగించేవిగానే రూపొందించారు-మన పూర్వ ఋషులు.

పశువులలో మంచిజాతుల అభివృద్ధికి; పశువులకు గర్భం కలగడానికి; పూయని, కాయని చెట్లు పూయడానికి, కాయడానికి, మానవులకూ వృక్ష పశు పక్షాలకూ కలిగే అనేక వ్యాధుల నివారణకు- ఇంకా అసంఖ్యాకమైన ఎన్నో విషయాలకు తగిన పద్ధతులనుభారతీయ ఋషులు వివరించారు.

ఈనాటికీ తుప్పుపట్టకుండా ఢిల్లీలో నిలిచిఉన్న అశోక స్తంభం-పూర్వ భారతీయుల లోహవిజ్ఞానానికి నిదర్శనం. పూర్వభారతీయవిజ్ఞానాన్ని నమ్మని వారికి ఇది ఒక కనువిప్పు.

అనంతమైన ఆర్షభారతీయ విజ్ఞానానికి నిదర్శనాలైన విషయాలు-ఇక్కడ చెప్పనివి-ఇంకా ఎన్నో ఉన్నాయి. ఇక్కడ చెప్పిన విషయాలను కూడా ఇంకా వివరించవలసి ఉంది. ఋషిప్రోక్తాలైన అసంఖ్యాక విషయాలు, అనంతమైన ఆర్షభారతీయ విజ్ఞానాన్ని గురించి ఇంకా చెప్పవలసినది- కొన్ని గ్రంథ సంపుటులు కాగలదు.

**35 ప్రశ్న :** పెళ్ళిలో నల్లపూసలు; పసిపిల్లలకు, పెళ్ళికుమార్తె, పెళ్ళి కుమారులకు నల్లచుక్క--ఎందుకుపెడతారు? గర్భిణికి నల్లగాజులు' నల్లబట్టలు- ఎందుకు వాడరు?

**సమాధానం :**

రంగులను వైద్య విజ్ఞాన శాస్త్రపరంగా విశేషణ చేసి, కలర్ థెరపీని శాస్త్రజ్ఞులు వెలుగులోనికి తెచ్చారు. ఆ ప్రమాణాల రీత్యా వివిధ వర్ణాల వస్త్రా

లను ధరించినప్పుడు ఆ రంగులు వ్యక్తియొక్క మానసిక స్థితిని శాసించగల వని విజ్ఞానవేత్తలు చెబుతున్నారు. ఆ పరిజ్ఞానం ప్రాచీన భారతీయ విజ్ఞానవేత్తలు చెప్పిన విషయాలనే ధ్రువపరుస్తున్నది. తెలుపు సత్త్వగుణాన్నీ, ఎరుపు రజో గుణాన్నీ, నలుపు తమోగుణాన్నీ ప్రకోపింపజేస్తాయని భారతీయ విజ్ఞానం తెలుపుతున్నది. తెలుపురంగు సత్వగుణ ప్రధానం, ఎరుపు రజోగుణప్రధానం. నలుపు తమోగుణప్రధానం అదేవిషయాన్ని మరొక మాటలలో తెలుపురంగు ప్రశాంతినీ, సంయమనాన్నీ శాంత స్వభావాన్నీ; ఎరుపు ఉత్సాహాన్నీ, కార దీక్షనూ, సంకల్పశక్తినీ, నలుపు నిరాశనూ, దుఃఖాన్నీ, విరక్తినీ వృద్ధిచేస్తా యని ఆధునిక విజ్ఞానమైన కలర్‌థెరపీ వివరిస్తున్నది.

సారాంశంగా నలుపురంగు-ధరించిన వ్యక్తికి నిరాశ, దుఃఖం, వైరాగ్యాల వంటి నెగటివ్ ఫీలింగ్స్‌ను, కలుగజేస్తుందని తెలుస్తున్నది. దీనికే మనవారు ప్రాచీన పరిభాషలో 'నలుపురంగు తమోగుణ ప్రధానం' అన్నారు. పైన చెప్పిన మనోభావాలనే ఈ తమోగుణం ప్రతిబింబిస్తుంది. సృష్టిస్థితులకు ప్రాతినిధ్యం వహించి, సంతానం యొక్క పాలన, పోషణ చూడవలసిన గర్భవతికి సంసా రం పట్ల ఉండవలసినది అనురక్తియే కాని, విరక్తికాదు. ఆమె ఉన్న స్థితికి నైరాశ్యభావాలు పనికిరావు. అందువల్లనూ, ఆమె మానసికస్థితి బిడ్డపై ప్రతి ఫలించి ప్రభావాన్ని చూపుతుంది కనుకనూ - గర్భవతికి నల్లబట్టలూ, నల్ల గాజులూ నిషేధించారు. వధువుచేత ధరింపజేసే నల్లపూసలు - వివాహంలోని లక్ష్మీ, గౌరీ, సరస్వతీ సూత్రాలలో ఒకటి.

నల్లచుక్కను దృష్టిదోష పరిహారార్థంగా ఉపయోగిస్తారు. పసిపిల్లల మీదనూ వధూవరుల మీదనూ అందరిచూపూ కేంద్రీకృతం కావడం సహజం. నరుని కంటికి నల్లరాయి బద్దలౌతుందని అనుభవజ్ఞులైన పెద్దలభావన్న ఆ దోషా నికి పరిహారంగా దృష్టిదోష పరిహారకమైన నల్లచుక్కను పెట్టడం ఆనవాయి తీగా వస్తున్నది.

**36 ప్రశ్న :** ఆషాఢంలో అత్తా-కోడళ్ళు/అల్లుళ్ళు-ఒకే గడప దాటరాదన డానికి కారణం ఏమిటి? ఇది పెళ్ళయిన మొదటి సంవత్స రంలోనే ఎందుకు? తర్వాతి సంవత్సరాలలో ఎందుకు లేదు?

**సమాధానం :**

ధర్మశాస్త్రాలలోనూ, స్మృతులలోనూ, చరకసంహిత, సుశ్రుత సంహితాది వైద్య గ్రంథాలలోనూ - దాంపత్య జీవితాన్ని ప్రారంభించిన ప్రథమ సంవత్సరంలో ఆషాఢంలో దంపతులు వేరుగా ఉండాలని చెప్పబడింది. దాని వలన ఉత్తమ సంతానం కలుగుతుందని చెప్పబడింది. తొలి సంవత్సరపు ఆషాఢమాసంలో గర్భం కలిగితే, ఆ జన్మించే సంతానం వలన-ఆ జన్మ ఎక్కడైతే సంభవిస్తుందో ఆ గృహయజమానికి కీడుకలుగుతుందని చెప్పబడింది.

ఆషాఢమాసానికి సంబంధించిన ఈ నిషేధం మాత్రమే అధిక ప్రచారంలో ఉంది. కాని, అంతగా ప్రాచుర్యం పొందని మరొక నిబంధన కూడా ఈ సందర్భంలో విధించబడిఉంది. అదేమంటే-తొలి సంవత్సరపు చైత్ర మాసంలో వధువు తప్పక భర్తతో కలిసే ఉండాలని కూడా చెప్పబడింది.

కొత్త దంపతులు తొలి సంవత్సరపు ఆషాఢంలో కలుసురాదనే ఉద్దేశంతోనే తొలి ఆషాఢంలో అత్తా కోడళ్ళు, అత్తా అల్లుళ్ళు ఒక గడప దాటరాదన్నారు తర్వాతి సంవత్సరాలలో ఈ నియమాన్ని ధర్మశాస్త్రం విధించలేదు.

ఈ నిషేధం-భార్యాభర్తలకు సంబంధించినదేకాని, అత్తాకోడళ్ళకూ, అత్తాఅల్లుళ్ళకూ సంబంధించినది కాదు. కాలక్రమంలో ఈ నిషేధం అత్తా అల్లుళ్ళకూ, అత్తాకోడళ్ళకూ సంబంధించినదన్నట్లుగా రూఢమైంది. భార్యాభర్తలు ప్రథమ సంవత్సరంలో ఆషాఢమాసంలో వేరుగా ఉండాలనే ముఖ్యాంశం మరుగున పడిపోయింది. అత్తా అల్లుళ్లూ అత్తాకోడళ్లూ ఒక గడప దాటకుండాఉంటే చాలును-నూతనదంపతులు సమీపస్థులైనా దోషంలేదనేస్థాయికి ఈసంప్రదాయం చేరుకుంది. కానీ యదార్థం అది కాదు. నూతన దంపతులకు ప్రథమాషాఢంలో సామీప్యం కలుగరాదు; ప్రథమాషాఢంలో గర్భధారణం జరుగరాదు ఇవే ఈ సంప్రదాయంలోని ప్రధానాంశాలు.

**37 ప్రశ్న : ప్రత్తి, బూరుగు-పెరట్లో వేయరాదనడానికి కారణం ఏమిటి?**

సమాధానం :

వాస్తుశాస్త్రం మానవుల జీవితాభ్యుదయాన్ని దృష్టిలో ఉంచుకొని, కొన్ని విధినిషేధాలను విధించింది. వానిలో ప్రత్తి, బూరుగువంటి చెట్లను, పాలుకారే చెట్లను, ముళ్ళకల చెట్లను-ఇంటి ఆవరణలో వేయరాదనేది ఒకటి ఈ అంశం చాలా విస్తృతమైన పరిధి కలది. కొన్ని కొన్ని వస్తువుల సామీప్యం వల్ల కొన్ని విధాల వ్యాధులు, లేదా ఇబ్బందులు కలుగుతాయి. తులసీవనంలో నివసించడం వల్ల కుష్టు, క్షయ, కాస, శ్వాస-ఇత్యాది వ్యాధులు ఉపశమిస్తాయని శాస్త్రవాక్యం. ములగచెట్టు కూడా ఇంటి పెరట్లో వేయరానిదిగా చెప్పబడింది. ములగచెట్టును ఆశ్రయించి గొంగళి పురుగులు అత్యధిక సంఖ్యలో ఉంటాయని అందరికీ తెలుసు. వానివల్ల అనేక చర్మవ్యాధులు, చర్మసంబంధమైన అసౌకర్యాలు-కలుగుతాయి. ప్రత్తి, బూరుగు చెట్లు శనిగ్రహకారకత్వంలోనివిగా చెప్పబడ్డాయి. ప్రతి గ్రహంయొక్క కారకత్వాలలోనూ అనేక ఇతర అంశాలతో బాటు-కొన్ని వ్యాధులు కూడా ఉన్నాయి. శనిగ్రహకారకత్వంలోని వ్యాధులు ఈ చెట్లవల్ల కలుగుతాయని భావం. ఈ చెట్ల కాయలు పగిలి-వానిలోని దూది పింజలు గాలిలో కలిసి, ఆ సమీపంలోఉన్న వారికి శ్వాసకోశ వ్యాధులను కలుగజేస్తాయి. అందువల్ల ఆచెట్లను నివాసగృహాలకు సమీపంలో వేయరాదు.

కొన్ని కొన్ని కామ్యఫలాలకొరకు (ఉదా: సంతానప్రాప్తి మొ॥) కొన్ని కొన్ని నిర్దిష్ట వృక్షాల సమిధలను మాత్రమే హోమం చేస్తారు. అట్టివస్తు గుణ వివేకానికి సంబంధించిన నిషేధమిది.

ఇట్టి విధి నిషేధాలు ఇంకా అనేక వృక్షాల విషయంలోనూ, వస్తువుల విషయంలోనూ చెప్పబడ్డాయి. ఆయుర్వేద శాస్త్రం ఈ విధి నిషేధాలను ధృవీకరించింది ఉదాహరణార్థ-

"అభుక్త్వా అమలకం పథ్యం భుక్త్వాతు బదరీఫలమ్॥
కపిత్థం సర్వదా పథ్యం కదళీ న కదాచన॥"

భావం: భోజనం చేయకముందు ఉసిరికాయ తినడం మంచిది. భుజించిన తర్వాత రేగుపండు తినడం పథ్యం వెలగపండు తినడం సర్వదా పథ్యం. అరటిపండు ఎప్పుడూ కూడా పనికిరాదు.

ఇంటికి "ముందు ములగ, వెనుక వేప వేయరాదంటారు?"-అని ఈ శీర్షికలో కొందరు ప్రశ్నించారు. అది సరికాదు. ముందు ములగ, వెనుక వెలగ వేయరాదనేది సరైననది. వేపచెట్టు లక్ష్మీప్రదం. అది ఇంటికి సమీపంలో తప్పక వేయాలి. వేపచెట్టుగాలి ఆరోగ్యాన్ని ఇస్తుంది. క్రిమికీటకాలను నశింప చేస్తుంది. వేపచెట్టుకుగల రోగనిరోధ/నివారణ శక్తి అపరిమితం. దానిని ఇంటి ఆవరణంలో పెంచడంవల్ల నిషేధాలు ఏవీలేవు సరికదా, వేపచెట్టును. తప్పక ఇంటిపరిసరాలలో పెంచాలని వాస్తుశాస్త్రం చెప్తున్నది.

**38 ప్రశ్న: శనిదశలో శనిదోషం-తైలాభిషేకం, తిలదానం చేయిస్తే పోతుందా? ఎలా పోతుందో శాస్త్ర ప్రమాణం ఉన్నదా?**

సమాధానం :

ఒక్క శని దశలోనే కాదు ఏలినాటి శని, అష్టమ శని, అర్ధాష్టమశని, శని మహాదశ-ఇత్యాది శని సంబంధమైన దోషాలకూ, నవగ్రహాలకు సంబంధించిన దోషాలకూ కూడా చేయవలసిన పరిహారాలు-స్మృతులలోనూ, జ్యోతిశ్శాస్త్రంలోనూ చెప్పబడ్డాయి.

ఈ విషయాలకు స్పష్టమైన శాస్త్రప్రమాణం ఉన్నది. ఆయా గ్రహసంబంధమైన దోషాలు మానవులకు కలిగినప్పుడు నవగ్రహాలనూ ఉద్దేశించి చేయవలసిన దోషపరిహార విధానాలు-పురాణాలలోనూ శాస్త్రాలలోనూ-చెప్పబడ్డాయి.

నవగ్రహాలకూ-ఆయా గ్రహాల కారకత్వం గలవీ, ఆయా గ్రహాలకు ప్రీతికరాలూ అన పదార్థాలు, వస్త్రాదులు, ధాన్య విశేషాలు, రత్నవిశేషాలు-శాస్త్రంలో చెప్పబడి ఉన్నాయి. ఏ గ్రహ సంబంధమైన దోషం ఏర్పడినప్పుడు ఆ గ్రహ సంబంధమైన ధాన్యాదివస్తువులను దానమివ్వడం ద్వారా దోష నివార

ణం కాగలదని శాస్త్రప్రమాణం. తిలలకు, తైలాలకూ కారకత్వం శనైశ్చరునిది కావడం వలన-తైలాభిషేకమూ, తిలదానమూ శనిప్రీతికై చెప్పబడినాయి.

"తిలైర్మతైర్మాష గుడాన్న దానై ర్లోహేన
నీలాంబర దానతోవా।
ప్రీణాతి మంత్రైర్నిజ వాసరేచ తస్మై
నమః శ్రీరవినందనాయ॥"

-అని ప్రమాణం. దీని భావం: శనివారంనాడు నువ్వులు, యవలు, మినుములు, బెల్లము, అన్నము, ఇనుము, నల్లని బట్టలు-వీటిని దానం చేయడం వల్లకానీ; శని దేవతాకమైన మంత్రాన్ని శనివారంనాడు జపించడంవల్లకానీ-ప్రీతిని పొందే టటువంటి ఓ సూర్యనందనుడా! నీకు నమస్కారం.

"తుష్టో దదాసి వైరాజ్యం రుష్టో హరసి తక్షణాత్।
దేవాసుర మనుష్యాశ్చ సిద్ధ విద్యాధ రోరగాః।
త్వయావ లోకితా స్సర్వే నాశం యాంతి సమూలతః........
విరించి శక్ర విష్ణూనాం మనుష్యాణాంతు కాకథా।
తేనత్వం సర్వసత్వేన గ్రహరాజో మహాబలః...."

భావం: ఓ శనైశ్చరా! నీవు తృప్తిని పొందితే సామ్రాజ్యాన్నైనా ప్రసాదిస్తావు. కోపిస్తే సర్వసంపదలనూ తక్షణమే హరిస్తావు. దేవతలు, అసురులు, మానవులు, సిద్ధులు, విద్యాధరులు, నాగులు-వీరంతా నీయొక్క చూపుకు గురైతే- సమూలంగా నాశనమౌతారు. బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు- మొదలైన వారంతా నీ ప్రభావానికి లోబడినవారే అనగా. ఇక సామాన్య మానవుల మాట చెప్పేదేముంది? అని పద్మ పురాణం శని ప్రభావాన్ని వర్ణించింది.

పద్మ పురాణంలోని ఈ శనిస్తోత్రానికి కర్త-దశరథుడు. అగాధ ఏమంటే- ఒకప్పుడు దశరథుని రాజ్యంలో తీవ్రమైన దుర్భిక్షం ఏర్పడింది. శనిగ్రహం

రోహిణీ నక్షత్రంలో ప్రవేశించబోతున్నాడనీ, ఆ కారణంగానే ఈ క్షామం ఏర్పడిందనీ, దీనిని నివారించడం అసాధ్యం అనీ దైవజ్ఞులు చెప్పారు. అలాగైతే శనిగ్రహాన్నే నిర్మూలించి-ప్రజాక్షేమం కలిగిస్తానని దశరథుడు నిశ్చయించుకొని, తన రథంతో శనిగ్రహంపైకి యుద్ధానికి వెళ్ళాడు. శనిగ్రహంపై బాణప్రయోగం చేయబోయాడు. అతని ఆత్మశక్తికి శని సంతోషించి-దశరథుని పట్ల ప్రసన్నుడైనాడు. దశరథునికి అతడు కోరిన వరాలను ఇవ్వడానికి సుముఖుడైనాడు శనైశ్చరుడు.

అప్పుడు దశరథుడు శనిప్రభావాన్ని వర్ణిస్తూ అనేక విధాలుగా శనైశ్చరుని స్తోత్రం చేశాడు. పైనచెప్పిన శ్లోకాలు ఆ స్తోత్రంలోని భాగాలే. (పూర్తి స్తోత్రం ఇవ్వడానికి గ్రంథవిస్తరభీతి ఆటంకమైంది.)

శనైశ్చరుడు దశరథుని యందు ప్రసన్నుడై-అతని రాజ్యానికి క్షామపీడ లేకుండా వరమిచ్చాడు. అంతేగాక, దశరథకృతమైన ఈ శని స్తోత్రాన్ని పఠించినవారికి శనిగ్రహదోషం నివృత్తి కాగలదని అనుగ్రహించాడు.

కనుక-పైన చెప్పిన "తిలైర్యవైర్మాష...." ఇత్యాది పదార్థాలతో శనైశ్చరుడు సంప్రీతుడు కాగలడనే విషయానికి పద్మపురాణంలోని ఈ ప్రమాణం ఉన్నది. ఇంకా అనేక గ్రంథాలలో-గ్రహాలకు చేయవలసిన ఉపచారాలు. వారికి ప్రీతికరాలైన రత్నాలు, ధాన్యాలు, ఇతర సేవలూ చెప్పబడ్డాయి. ఆప్రకారంగా ఆచరించి-గ్రహదోషాలకు నివారణం కలిగించుకోవచ్చును. వీనికి అన్నిటికీ-పురాణాలలో, ధర్మశాస్త్రాలలో స్పష్టమైన ప్రమాణాలున్నాయి. కానీ వాటినన్నిటినీ ఒకేచోటున చెప్పడం సాధ్యంకాదు. ఏమంటే- ఈ ఒక్క అంశమే ఒక గ్రంథం కాగలదు.

ఈసందర్భంగా- నవగ్రహాలకూ ప్రీతికరాలైన రత్నధాన్యాదులు ఈక్రిందివి.

| గ్రహం | ధాన్యవిశేషం | రత్నవిశేషం |
|---|---|---|
| సూర్యునికి | గోధుమలు | కెంపు |

| | | |
|---|---|---|
| చంద్రునికి | బియ్యం | ముత్యం |
| కుజునికి | కందులు | పగడం |
| బుధునికి | పెసలు | మరకతం |
| గురునికి (బృహస్పతికి) | సెనగలు | పుష్యరాగం |
| శుక్రునికి | బొబ్బర్లు | వజ్రం |
| శనికి | తిలలు(నువ్వులు) | నీలం |
| రాహువుకు | మినుములు | గోమేధికం |
| కేతువుకు | ఉలవలు | వైడూర్యం |

ఈవిధంగా దానాదులు ఇవ్వదగిన విధానాలు-శాస్త్రరీత్యా చెప్పబడి ఉన్నాయి.

39 ప్రశ్న : శనివారానికి, వేంకటేశ్వరునికి ఉన్న సంబంధమేమిటి? శని వారంనాడు వేంకటేశ్వర ప్రీతిగా వార నియమం చేస్తారు' ఎందుకు? దీనికి శాస్త్ర ప్రమాణం ఏమైనా ఉన్నదా?

సమాధానం :

వివిధ ఆచారాలకూ, సంప్రదాయాలకూ ప్రమాణాలు-పురాణాలలోనూ, ధర్మ శాస్త్రాలలోనూ చెప్పబడి ఉన్నాయి. వేంకటేశ్వర ప్రీతికై శనివారనియమం చేయడానికి కూడా పురాణాలలో ఆధారాలున్నాయి.

మార్కండేయ పురాణంలో ఈవిషయమై ఈవిధంగా ప్రస్తావించబడింది-

"కలౌ కుమార రూపేణ షణ్ముఖో భగవాన్ హరిః
దృశ్యతైక ముఖే నైవ వేంకటాచలనాయకః॥"

"సౌభాగ్యదాయకం విష్ణుం వేంకటేశం సమర్చయేః శనివారే"-అనిన్నీ,

"సుబ్రహ్మణ్య కుమారాఖ్యా విష్ణ్వాఖ్యా వేంకటాచలే
శేష శైషీ కలా బ్రాహ్మీ సర్వచైతన్య రూపిణీ
శ్రీవేంకటేశ్వర రూపేణ కలౌ ప్రత్యక్ష దర్శనం
సర్వదాపి శనేర్వారే భక్తేష్టార్థ ప్రదాయినీ

ఇదం కలియుగే ముఖ్యం సత్యం సత్యం న సంశయః॥"

అనిన్నీ చెప్పబడింది.

ఈ పైన చెప్పిన శ్లోకాల భావం ఏమంటే-ఆరు ముఖాలు కలిగిన కుమార స్వామి-కలియుగంతో ఏకముఖుడైన వేంకటాచల నాయకుడుగా దర్శనం అనుగ్రహిస్తూ ఉన్నాడు. సౌభాగ్యదాయకుడున్నూ, విష్ణుస్వరూపుడున్నూ' అయిన శ్రీవేంకటేశ్వరుని శనివారంనాడు తప్పక అర్చించవలసినది. కుమారాఖ్య కలిగిన సుబ్రహ్మణ్యుడు విష్ణ్వాఖ్యతో వేంకటాచలమునందు వెలసి ఉన్నాడు. సర్వచైతన్య రూపిణియైన, బ్రాహ్మీశక్తియైన సరస్వతి-శ్రీవేంకటేశ్వర రూపంతో కలియుగంలో ప్రత్యక్ష దర్శనం ఇస్తూ ఉన్నది. శనివారంనాడు అట్టి సుబ్రహ్మణ్య, సరస్వతీ, మహావిష్ణువుల సమగ్ర స్వరూపమైఉన్న శ్రీవేంకటేశుని- శనివారంనాడు అర్చించడం- భక్తులకు సర్వదా సరవి అభీష్టార్థాలనూ ప్రసాదిస్తుంది. ఈ వ్రతం కలియుగంలో ముఖ్యమైనది. ఇది సత్యం. సంశయం లేదని చెప్పబడింది.

కాబట్టి-శనివారంనాడు శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి వారనియమాన్ని పాటించడమూ, శనివారంనాడు శ్రీవేంకటేశ్వరుని పూజించడమూ-పురాణ ప్రమాణం కలిగినవిషయాలే. దేవతల ప్రీతికై ఆయాదేవతలకు ఇష్టమైన వారాలలో ఏకభుక్తాన్ని (ఒక్కపూట మాత్రమే భుజించడం) నియమంగా పాటించడం-ధర్మశాస్త్రాలు తెలిపిన విషయం కనుక-శ్రీవేంకటేశ్వరునికి ప్రీతికరమని చెప్పబడిన శనివారంనాడు-ఆ దేవుని ఉద్దేశించి వారనియమాన్ని ఏకభుక్తాన్ని పాటించడం సముచితమే.

**40 ప్రశ్న : తిరుపతి- మొదలైన పుణ్యక్షేత్రాలలోని ఆలయాలకు ఉన్న శక్తి-అదే దేవుని ఆలయం వేరేచోట ఉంటే ఉండదా?**

**సమాధానం :**

**శ్రీమహావిష్ణువు అర్చావతారంగా స్వయం వ్యక్తమైన పవిత్రక్షేత్రం తిరుపతి.**

పుణ్యక్షేత్రాలలో-సిద్ధపురుషులు తపస్సు చేసిన స్థలాలూ, భగవదవతార మేదైనా వ్యక్తమైన స్థలాలూ-మహాప్రభావాన్ని కలిగిఉంటాయి. మానవులు చెక్కించి ప్రతిష్ఠించిన మూర్తుల కంటె, దేవతామూర్తులు స్వయంగా వ్యక్తమైన స్థలాలకూ ప్రభావం అధికంగా ఉంటుంది.

ఆయాక్షేత్రాలలో ప్రతిష్ఠించబడిన యంత్రశక్తిని బట్టి కూడా క్షేత్రం మహాప్రభావసంపన్నమైనదీ, మహత్తరమైనదీ కాగలదు. ఇవన్నీ కూడిన క్షేత్రం కావడంవల్లనే- తిరుపతి క్షేత్రం అపూర్వవైభవ శోభితం కాగలిగింది.

ఈక్రింది విషయాలు మార్కండేయపురాణంలోనూ, వరాహపురాణం లోనూ, వేంకటాచల మాహాత్మ్యంలోనూ, చెప్పబడిఉన్నాయి.

శ్వేత వరాహరూపంలో ప్రళయకాల సముద్రం నుండి భూమిని ఉద్ధరించిన అనంతరం శ్రీమహావిష్ణువు-భూలోకంలో నివసించే నిమిత్తం-వైకుంఠం నుండి తన క్రీడా పర్వతాన్ని గరుత్మంతునిచేత తెప్పించినట్లు వరాహపురాణం లోనూ, వేంకటాచలమాహాత్మ్యంలోనూ చెప్పబడింది. సాక్షాత్తుగా విష్ణునివాసమైన వైకుంఠంలో భాగమైన నారాయణగిరి అనే ఆ పర్వతమే వేంకటేశ్వర నివాస స్థానం కావడంవల్ల దానికి అంత పవిత్రత చేకూరిందని వరాహపురాణంలో చెప్పబడింది. అక్కడ శ్రీనివాసుడు స్వయంవ్యక్తుడు కావడం వల్ల అది కలియుగ వైకుంఠమయింది.

శ్రీ ఆది శంకరాచార్యులవారు- తిరుమల శ్రీవేంకటేశుని సన్నిధిలో మహాప్రభావ సంపన్నమూ, జనాకర్షణ, ధనాకర్షణ శక్తులుకలిగిన మహాయంత్రాన్ని ప్రతిష్ఠించారు. ఆయంత్రప్రభావం చెప్పనలవికానిది. ఆ యంత్రప్రభావమూ, వేంకటాచల ప్రాంతంలో కలిగిన దేవతా సంచారమూ, భగవదవతారసంభవమూ -ఇత్యాదులు తిరుపతిక్షేత్ర మాహాత్మ్యానికి కారణాలు. ఈ అంశానికి సంబంధించిన కొన్ని విశేషాలను ఈక్రింద విన్నవిస్తున్నాను.

తిరుపతి ప్రాంతం, ఆ పరిసర ప్రదేశమూ-వరాహ క్షేత్రంగాపురాణాలు పేర్కొంటున్నాయి. శ్రీమహావిష్ణువు యొక్క శ్వేతవరాహావతారం వెలసిన పవిత్ర క్షేత్రం అది. ఇది వరాహక్షేత్రం కనుకనే-శ్రీనివాసుడుగా, శ్రీవేంకటేశ్వరుడుగా దిగివచ్చిన శ్రీమహావిష్ణువు-వరాహస్వామి అనుమతితో ఇక్కడ తన నివాసాన్ని ఏర్పరచుకొన్నాడు. దానికి ఫలంగా- తిరుపతిలో ముందుగా వరాహస్వామిని సేవించుకొని, అనంతరం మాత్రమే శ్రీవేంకటేశ్వరుని సేవించుకొనాలని చెప్పబడింది. శ్రీవేంకటేశ్వరునికి నివాసస్థలాన్ని వరాహస్వామి ఇచ్చినందుకుగాను-ప్రథమదర్శనం వరాహస్వామిదని నిర్ణయం. ఇది శ్రీవేంకటేశ్వరునిచే స్వయంగా ఈయబడిన వాగ్దానం.

ఆదివరాహ, శ్వేతవరాహ, భూవరాహ, యజ్ఞవరాహ రూపాలతో శ్రీమహావిష్ణువు వెలసిన పవిత్రక్షేత్రమది. ఈ క్షేత్రానికి పాలకుడు వరాహస్వామి ఆకారణంగానే అది వరాహక్షేత్రమైంది.

తన నివాసమైనన విష్ణువక్షాన్ని భృగుమహర్షి తన్నిన కారణంగా అలుక వహించిన శ్రీమహాలక్ష్మిని వెదుకుతూ-వైకుంఠంనుంచి సాక్షాత్తుగా శ్రీమహావిష్ణువు దిగివచ్చి సంచరించిన పవిత్ర- పాదస్పర్శనంతో పునీతమైన నేల. విష్ణుభగవానుడు వైకుంఠం విడిచివచ్చి- లక్ష్మిని అన్వేషిస్తూ, వేంకటాచల ప్రాంతమంతటా తిరుగాడుతూ లక్ష్మినామాన్ని స్మరించిన దివ్యభూమి. శ్రీమహాలక్ష్మి అంశతో పద్మావతి జన్మించిన ప్రదేశం. లక్ష్మినారాయణులైన శ్రీపద్మావతీ శ్రీనివాసుల కల్యాణం జరిగిన పవిత్ర ప్రదేశం.

శ్రీవేంకటేశ్వరుని మూర్తి-ఎవ్వరూ చెక్కించి ప్రతిష్ఠించిన విగ్రహంకాదు. విష్ణుభగవానుడే వైకుంఠం నుంచి స్వయంగా అవతరించి, కలిలో భక్తజన సంరక్షణార్థం స్వయంవ్యక్త మూర్తిగా అర్చావతారుడై వెలసిన స్వరూపం.

వైకుంఠం నుంచి మహాలక్ష్మిని వెదుకుతూ తిరుమలగిరి వేంకటాచల ప్రాంతాన్ని చేరిన శ్రీమహావిష్ణువు-లక్ష్మిని గూర్చి ఎంతోకాలం ఇక్కడ తపస్సు

చేసి ఉన్నాడు. ఆ కారణంగా ఈప్రదేశానికి, శ్రీవేంకటేశ్వరునికి-లక్ష్మీప్రసన్నత అపారంగా కలిగింది.

తపస్విగా ఉన్న శ్రీమహావిష్ణువును సేవించుకొనే నిమిత్తం శివుడు, బ్రహ్మ-ఆవూదూడల రూపాలతో వేంకటాచల ప్రాంతంలో సంచరించి ఉన్నారు. శ్రీమహాలక్ష్మి స్వయంగా గొల్లభామ రూపాన్ని ధరించి ఆ ఆవుదూడలను చోళ రాజుకు చేర్చింది.

నారాయణవనానికి పాలకుడైన ఆకాశరాజు, ధరణిదేవిలకు కుమార్తెయై జన్మించిన పద్మావతీదేవిని శ్రీనివాసుడు వివాహమాడిన దిక్కుడే, వివాహానంతరం ఆరుమాసాలవరకు పద్మావతీశ్రీనివాసులు-వేంకటాచల సమీపంలోని అగస్త్యాశ్రమంలో నివసించారు. శుకమహర్షి అగస్త్యమహర్షి వంటి మహాత్ముల తపోభూమి వేంకటాచల పరిసరప్రాంతం.

త్రేతాయుగంలో ఈ పర్వతం పైన విష్ణుమూర్తి-వృషభుడనే రాక్షసుని సంహరించగా ఈపర్వతానికి వృషభాద్రి అనేపేరు త్రేతాయుగంలో ఉండేది.

ఇక్కడ వేంకటేశ్వరుని నివాసార్థం ఆదిశేషుడే వేంకటాద్రిగా ఇక్కడ ఏర్పడ్డాడనీ, సప్తగిరులు శేషుని శరీరపుచుట్టలనీ, శేషునివడగలే సప్తగిరి శిఖరాలనీ పురాణోక్తి.

ఆదిశంకరులు ప్రతిష్ఠించిన యంత్రప్రభావం-వేంకటేశ్వరుని 'మాహాత్మ్యానికి' తోడై తిరుపతిక్షేత్రాన్ని నిత్యకల్యాణంగా భాసింపజేస్తున్నది.

41 ప్రశ్న ; అగస్త్యభ్రాత అనగా ఎవరు? అగస్త్యభ్రాత అని ఎవరిని అంటారు? ఆకాశరామన్న, అగస్త్యభ్రాత-ఒకే రకానికి చెందినవారా?

సమాధానం:

అరణ్యవాసంలో ఉన్న సీతారామలక్షణులు దండకారణ్యాన్ని చేరారు. అక్కడ ఉన్న మహాత్ములైన ఋషుల ఆశ్రమాలనన్నిటినీ సందర్శిస్తూ, తపోధనులైన ధర్మభృత్తు, శరభంగుడు సుతీక్ష్ణుడు మొదలైన తపస్వుల ఆశీస్సులను అందుకొంటూ వారు సాగుతున్నారు. అట్టి సమయంలో సుతీక్ష మహర్షి సూచన ననుసరించి-అగస్త్యాశ్రమానికి మార్గం అడిగి తెలుసుకొన్నారు. అప్పుడు సీతారామలక్ష్మణులు తమదారిలో అగస్త్యభ్రాత ఆశ్రమాన్ని దర్శించి, ఒకరాత్రి ఆ అగస్త్యభ్రాత ఆశ్రమంలో నిద్రించి, అక్కడినుండి అగస్త్యాశ్రమాన్ని చేరుకొన్నారు.

అగస్త్యుడు మహాప్రభావశాలి. తపస్సంపన్నుడు. ఆయన వింధ్యపర్వతాన్ని నిగ్రహించినవాడు. రాక్షసులకు భయంకరుడుగా నిలిచిన ఆయన వలన-దండకారణ్యంలోని ఋషులు-ప్రశాంతంగా బ్రతకగలుగుతున్నారని చెప్పబడింది. ఆయన ప్రభావం వల్ల రాక్షసులకు దక్షిణదిక్కు-అంటే భయం ఏర్పడింది. ఆయన వల్లనే దక్షిణదిక్కుకు 'అగస్త్యదిక్కు' అనే పేరు వచ్చింది. ఈయన ఆశ్రమసాన్నిధ్యంలో ఎందరో తపస్వులు వారి నియమిత తపోజీవనాన్ని కొనసాగిస్తున్నారు. ఆయన ఆశ్రమంలో తపస్వులు, దేవతలు, గంధర్వులు, నాగులు మొదలైన వారే కాకుండా-పశులుకూడా ధర్మాన్ని పాటిస్తూ నియమిత ఆహారంతో నివసిసూ ఉంటాయి. అని ఈ విధంగా అగస్త్యమహర్షి ప్రభావాన్ని గూర్చి వాల్మీకి రామాయణం అరణ్యకాండ పదవసర్గలో, ఇంకా ఎంతో విస్తృతంగా వర్ణించబడిఉంది.

లోకంలో ప్రసిద్ధకర్ముడైన ఒక వ్యక్తికి సంబంధించిన వ్యక్తులు-అవ్యక్తి ద్వారానే వ్యవహరించబడతారు. అవ్యక్తికి సోదరులు గానో, మరొకవిధంగానో ఆవ్యక్తితో వారికిగల బాంధవ్యాన్ని అనుసరించి-వారిని "ఫలానావారితాలూకుగా" వ్యవహరించడం అందరికీ పరిచితమైన విషయమే ఇట్టి విషయానికి మూలకందం వంటిది రామాయణంలోని అగస్త్యభ్రాత వృత్తాంతం.

మహాప్రసిద్ధకర్ముడైన అగస్త్యుని సోదరుడు ఈ అగస్త్యభ్రాత ఆయన అగస్త్యుని ఆశ్రమానికి అనతిదూరంలోనే ఆశ్రమాన్ని నిర్మించుకొని, తపోనిష్ఠలో ఉన్నాడు. ఈయనే "అగస్త్యభ్రాత"గా వాల్మీకిచేత నామకరణం చేయబడి, ఈనాటికీ మనందరిచేతనూ తలచు కొనబడుతున్నాడు.

ఏవ్యక్తులైనా తమంతతాముగా సుప్రసిద్ధులు కానప్పుడు, వారు ఒక ప్రసిద్ధునికి సంబంధించిన వారైనప్పుడు-వారి పేరు మరుగున పడిపోయి, "ఫలానావారికి" సంబంధీకులుగానే వ్యవహృతులు కావడానికి "అగ్యస్త్యభ్రాత" ప్రథమోదాహరణం. అనామకుల పట్ల రూఢమైంది-ఈ పదబంధం.

ఆకాశరామన్నకూ, అగస్త్యభ్రాతకూ భేదం ఉంది. తాను గుప్తంగా ఉంటూ, తన ఉనికిని బయల్పరచకుండా రహస్య చర్యలు జరిపే వానిని ఆకాశరామన్నగా వ్యవహరిస్తారు. అగస్త్యభ్రాత వేరు. లోకప్రసిద్ధులైన వ్యక్తులకు సంబంధించినవారు. (వారు కూడా ప్రత్యేకతను కలిగిఉంటే తప్ప) ఆ ప్రసిద్ధుల పేరుమీదుగా వ్యవహరించబడుతూన్న ఆవిధంగా పేర్కొంటారు. ప్రస్తుత వ్యవహారంలో "కేరాఫ్ ఎడ్రస్" అన్నట్లుగా.

అగస్త్యభ్రాత అనే వ్యవహారం కేవలమూ అవహేళనంగా జనవ్యవహారంలో రూఢమైంది. సంస్కృతాంధ్రాలలో ఇట్టి వెక్కిరింపులు అనేకం ఉన్నాయి 'యంత్రబ్రహ్మ' 'దేవానాంప్రియ'-వంటివి వీనిలో కొన్ని. 'బుద్ధావతారం' అనేది కూడా మనకు పరిచితమై పరిహాసపదమే.

42 ప్రశ్న : రావణుడు సీతాదేవిని ఏవిధంగా తీసుకొనిపోయాడు? ఈవిషయంలో రకరకాల వాదాలు ప్రచారంలో ఉన్నాయి. వాస్తవం ఏమి?

సమాధానం :

సీతారామ కథకు వాల్మీకమే పరమ ప్రమాణం-అని అంగీకరించదలిస్తే-వాల్మీకి రామాయణంలో-సీతను రావణుడు ప్రత్యక్షంగా తాకి తీసుకొని

పోయినట్లే ఉంది-స్పష్టంగా. ఆ అంశాన్ని ఈ క్రింది వాల్మీకి రామాయణ శ్లోకాలు నిరూపిస్తున్నాయి.

"అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కాలచోదితః!
జగ్రాహ రావణస్సీతామ్ బుధః ఖే రోహిణీ మివ॥"

భావం:-ఆ దుష్టాత్ముడైన రావణ రాక్షసుడు-కాలం త్రోసికొని రాగా-ఆకాశంలో బుధగ్రహం రోహిణీ నక్షత్రాన్ని పట్టినట్లు సీతను పట్టుకొన్నాడు."

"వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః
ఊర్వోస్తు దక్షిణే నైవ పరిజగ్రాహ పాణినా॥"

భావం:-ఆ రాక్షసుడు ఎడమచేతితో సీత కేశాలను పట్టుకొని, కుడిచేతితో ఆమె యొక్క ఊరు భాగాన్ని అవలంబించి ఎత్తుకొన్నాడు.

"తామకామాం సకామార్తః పన్నగేంద్ర వధూమివ।
వివేష్టమానా మాదాయ ఉత్పపాతాథ రావణః॥"

తనయందు అనురక్తురాలు కాక-గిలగిలలాడుతూ చుట్టుకొని పోయే నాగవనితను వలె-సీతను ఎత్తుకొని రావణుడు పైకి ఎగసినాడు.

"సభగ్న ధన్వా విరథో హతాశ్వో హతసారథిః।
అంకే నాదాయ వైదేహీం పపాత భువి రావణః॥"

భావం:- (జటాయువు వల్ల) రథం భగ్నంకాగా; అశ్వములూ సారథీ చంపబడగా-తన తొడపై నుంచుకొన్న సీతతో-రావణుడు-నేలపైన పడినాడు.

"సం పరిష్వజ్య వైదేహీం వామే నాంకేన రావణః।
తతే నాభిజఘా నార్తో జటాయుం క్రోధ మూర్ఛితః॥"

భావం:- సీతను తన వామభాగమునుండి జారిపోనీయక గట్టిగా చేరదీసి పట్టుకొని-రావణుడు పట్టరాని కోపంతో-జటాయువును చేతితో మొత్తినాడు.

కిష్కింధలో సుగ్రీవుడు-రామునితో-

"స్ఫురన్తీ రావణస్యాంకే పన్నగేంద్ర వధూ ర్యథా॥"

భావం:- నాగసుందరి వలె ఆమె (చుట్టుకొని పోతూ) రావణుని తొడపై కనబడింది.

మానవతామూర్తి, హేతువాది అయిన వాల్మీకి-అనేక మహత్తర ప్రయోజనాలను భావన చేసి వ్రాసిన కావ్యం రామాయణం. సీతను ఎత్తుకొని పోయే సందర్భంలో రావణుడు ఆమెను పట్టుకొని తీసుకొని వెళ్ళాడనే వాల్మీకి వ్రాశాడు. ఆ తర్వాత-ఆమె పరిశుద్ధత రావణస్పర్శవల్ల ఏమాత్రమూ చెడ లేదనే విషయాన్ని-సీతాగ్నిప్రవేశ ఘట్టంద్వారా అన్యాపదేశంగా తెలియ జేశాడు.

సీతాదేవి అబల, నిర్జన ప్రదేశంలో ఒంటరిగా ఉంది. రావణుడు రాక్షసుడు, పైగా కాముకుడు. అట్టి స్థితిలో యుక్తా యుక్త విచక్షణా రహితుడై వాడు చేసిన దుష్కార్యానికి-ఆమె పవిత్రత భంగించబడినట్లు భావించడం తగదు. నిస్సహాయంగా ఉన్న స్త్రీ పై-పురుషుడు ఏ ఘాతుకాన్నైనా జరిపినట్ల యితే-ఆ పాపం, ఆ తప్పు ఆమెను అంటవని, ఆ కార్యంలో ఆమెకు బాధ్యత లేదని-వాల్మీకి ప్రపంచానికిచ్చిన సందేశం.

ఆ విషయాన్ని అర్థం చేసుకోకుండా తర్వాతి కాలంలో వచ్చిన భక్త కవులు-అవాల్మీకాలనదగిన కల్పనలెన్నో చేశారు. రావణుని దుస్సహమైన రూపాన్ని చూడలేక సీత మూర్ఛపోయినట్లు వ్రాసి, ఆ కవులు లక్ష్మణునిచేత ఒక గీత గీయించారు. ఆ గీతను దాటలేని రావణుడు-సీత పడిఉన్న భూఖం డాన్ని పెల్లగించుకొని ఆమెను తీసుకుపోయినట్లు వ్రాశారు.

లక్షణుడు గీత గీయడం, రావణుడు సీతను తాకకుండా తీసుకొని వెళ్ళ డం-వాల్మీకంలో ఎంతమాత్రమూ లేని విషయాలు.

43 ప్రశ్న: మహాభారతంలో ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనందువల్ల అగ్రజుడైనప్పటికీ, పాండురాజు అభిషిక్తుడయ్యాడు. కాని అగ్రజుని కుమారుడుగా దుర్యోధనునికి రాజ్యార్హత, హక్కు, ఉన్నాయి కదా, మరెందుకు యుద్ధం సంభవించింది?

సమాధానం:

నేత్రహీనత కారణంగా ధృతరాష్ట్రునికి రాజ్యాధికారం లేదు. ఆ రీత్యా పట్టాభిషిక్తుడైన పాండురాజు అకాలమరణం చెందడం వల్ల, తాత్కాలికంగా ఒక ధర్మకర్త వంటి పాత్రను ధృతరాష్ట్రుడు నిర్వహించవలసి వచ్చింది. ఈ తాత్కాలికాధికారాన్ని వదులుకోదలుచుకోలేదు-ధృతరాష్ట్రుడు. తనకూ, తన పుత్రులకూ, రాజ్యాధికారం శాశ్వతంగా, వంశానుగత వారసత్వంగా నిలిచిపోవాలనుకున్నాడు.

భీష్మ, విదురాదుల మాట కాదనలేక, ధర్మరాజుకు యువరాజ్యాభిషేకం చేసినా, ధృతరాష్ట్రుడు తన మనస్సులో ధర్మరాజును రాజ్యానికి ఉత్తరాధికారిని చేయడం పట్ల సుముఖత్వం వహించలేదు. పాండవుల ఉన్నతిని సహించలేని ధృతరాష్ట్రుడు-కణికుడనే వృద్ధమంత్రిని పిలిచి పాండవుల శౌర్యాన్నీ కీర్తినీ చూచి తనకు అసూయ కలుగుతున్నదనీ, వారితో మైత్రి మంచిదా, వారిని సంహరించడం మంచిదా-తగిన సలహా చెప్పమని కోరాడు, ఈ విషయం వ్యాసభారతంలో స్పష్టంగా ఉంది. ఇదీ ధృతరాష్ట్రుని అంతర్యం.

పాండవులను కుంతీదేవితో సహా కొన్నాళ్ళు వారణావతంలో నివసించి రమ్మని ధృతరాష్ట్రుడు దుర్యోధనుని ప్రేరేపణతో ధర్మరాజును ఆదేశించాడు. అంతకుముందు-వారణావత నగరసౌందర్యాన్ని పాండవుల ఎదురుగా ప్రశంసించమని-ధృతరాష్ట్రుడు తనకు ఆప్తులైన మంత్రులను రహస్యంగా ఆదేశించినట్లుగా వ్యాసభారతంలో స్పష్టంగా ఉంది. ఆ మంత్రులు-వారణావతాన్నీ, అక్కడ జరిగే శివునిఉత్సవాలనూ పాండవులకు వర్ణించి చెప్పారు. అనంతరం

ధృతరాష్ట్రుడు పాండవులను పిలిచి, వారిని వారితల్లితో కలసి కొన్నాళ్ళు వారణావతంలో ఉండిరమ్మని ఆదేశించాడు. దుర్యోధనుడు-తనకు అప్తుడైన పురోచనుడనే శిల్పిద్వారా-వారణావతంలో-లక్క-మొదలైన సులభంగా తగులబడే వస్తువులతో ఇల్లుకట్టించి-దానిలో పాండవులు ఉండేలాచేశాడు పాండవులు ఆదమరచి ఉన్నప్పుడు రహస్యంగా దానిని తగులబెట్టమని పురోచనుని ఆదేశించాడు.

ఈవిధమైన దుర్యోధనుని కుత్సితపు ఆలోచనకు (లాక్షాగృహ నిర్మాణం దాని దహనం) ధృతరాష్ట్రుని అంగీకారం పూర్తిగా ఉందనేది-వ్యాసభారతం చదివినవారికి అవగతమవుతుంది- ఈవిషయాన్ని గ్రహించిన విదురుని రహస్యమైన హెచ్చరికవల్ల-పాంతవులు లక్క-ఇంటి అపాయం నుంచి క్షేమంగా బయటపడి-కొన్నాళ్ళు ఏకచక్రపురంలో అజ్ఞాతంగా ఉన్నారు.

లక్క-ఇంట్లో కాలిపోయారనుకున్న పాండవులు-ద్రౌపదిని వివాహం చేసుకోవడం ద్వారా ద్రుపదమహారాజు అండ పొందగలిగారు, లక్క-ఇంటినుంచి తప్పించుకున్న తర్వాత అన్నాళ్లూ ఏకచక్రపురంలో అజ్ఞాతంగా జీవించిన పాండవుల ఉనికి-ద్రౌపదీ వివాహంతో లోకానికి వెల్లడి అయింది.

పాండవులు జీవించి ఉండడమే కాకుండా, బలవంతుడైన ద్రుపదుని బాంధవ్యాన్ని కూడా సంపాదించారని తెలిసిన ధృతరాష్ట్రుడు-వారిని పిలిపించి ఖాండవ ప్రస్థాన్ని ఏలుకొమ్మని ఇచ్చి పంపాడు.

లక్క-ఇంటి సంఘటనతో తన పట్ల ఏర్పడిన ప్రజావైముఖ్యాన్నీ, భీష్మ విదురాదుల ఎదుట తనకు కలిగిన సంకటస్థితినీ తొలగించుకోవడానికి-పూర్తి రాజ్యం కాకపోయినా- కొంత ప్రదేశమైనా పాండవులకు ఇవ్వక తప్పనిపరిస్థితి ధృతరాష్ట్రునికి ఏర్పడింది. ఇంకా తాను ఉదాసీనత వహిస్తే సర్వులూ తనను ఛీత్కరిస్తారనే భయంతో-పాండవులకు ఖాండవప్రస్థాన్ని ఇచ్చాడు ధృతరాష్ట్రుడు. అంతేగాక లాక్షాగృహనిర్మాణం-దహనం ఎంతో పటిష్ఠమైన

వ్యూహంగా జరగడంతో, ధార్తరాష్ట్రులకూ పాండవులకూ మధ్యనున్న వైమనస్యాలు లోకానికి వెల్లడి అయ్యాయి. అటువంటి పరిస్థితిలో ఇరువంకలవారూ కలసి ఒకేచోట కాలం గడిపే అవకాశం పూర్తిగా అంతరించింది.

రాజ్యానికి నిజమైన అధికారి అయిన పాండురాజు మరణిస్తే-తండ్రిలేని పిల్లలను నిరాదరణకు గురిచేసి, తండ్రి రాజ్యం ఇవ్వకుండా అన్యాయంచేసి కడకు అంతం చేయడానికి కూడా ప్రయత్నించాడనే అపప్రథను తప్పించుకోవలసి ఉంది-ధృతరాష్ట్రునికి. అదీగాక, తక్షణమే తాను రాజ్యత్యాగం చేసి సర్వరాజ్యాన్నీ ధర్మరాజుకు ఒప్పగించనవసరం లేకుండానూ, పూర్తిరాజ్యంపై వారి హక్కును అంగీకరించి, తన హక్కును సమూలంగా వదులుకోనవసరం లేకుండానూ-మధ్యేమార్గంగా ఈ విధమైన ఏర్పాటు పనికి వస్తుందనేదే-ఖాండవప్రస్థాన్ని ధృతరాష్ట్రుడు పాండవులకియడంలోని ఆలోచన.

తమకిచ్చిన ప్రదేశమేదో మారు మాట్లాడకుండా స్వీకరించి, తల్లితో, భార్యతో తరలివెళ్ళి ఖాండవప్రస్థంలో రాజ్యాన్ని ఏర్పాటు చేసుకున్నారు పాండవులు.

ఈవిధంగా హస్తినాపురంలో ధృతరాష్ట్రుని అధికారం, రాజపదవి చెక్కుచెదరకుండా ఉండగా, పాండవులు వేరొక చోట రాజ్యం ఏర్పరుచుకొన్న సందర్భంలో దుర్యోధనుడు తృప్తిపడి ఉండవలసింది. కానీ, పాండవులను ఆమాత్రంగా కూడా ఉండనీయరాదన్న అసూయతో-ద్యూతమూ, ద్రౌపదీ వస్త్రాపహరణమూ, అరణ్యాజ్ఞాతవాసాలూ, ఘోషయాత్ర-వంటి దుశ్చేష్టలన్నీ తలపెట్టి దుర్యోధనుడు పాండవులను పూర్తిగా నాశనం చేయ నడుకట్టాడు, ధృతరాష్ట్రుని మౌనాంగీకారం ఉండనే ఉన్నది-దుర్యోధనుని ప్రతి దుశ్చర్యకూ. కాబట్టి యుద్ధానికి పూర్తి బాధ్యులు ధృతరాష్ట్ర దుర్యోధనులే.

**46 ప్రశ్న : రావణునికి ఆ పేరు ఎలా వచ్చింది?**

**సమాధానం :**

రావణునికి ఆ పేరు జన్మతః ఉన్నది కాదు అతడు దశ శిరస్సులతో జన్మించడం వల్ల. అతనితండ్రి అతనికి తొలుత పెట్టిన పేరు- 'దశగ్రీవుడు' అని ఈ విషయం వాల్మీకి రామాయణంలోనూ, వ్యాస భారతంలోనూ చెప్పబడింది.

ఒకప్పుడు దశగ్రీవుడు కుబేరుని జయించి - అతని వద్ద ఉన్న మహత్తర మైన పుష్పక విమానాన్ని తన స్వాధీనం చేసికొన్నాడు. మంత్రి సేనాని బంధు మిత్ర సైన్య సహితుడై పుష్పక విమానాన్ని అధిరోహించి ప్రయాణిస్తు ఉన్నాడు. పుష్పక విమానం కొద్దిదూరం ప్రయాణించి ఆగిపోయింది. కామ గమనం కలిగిన పుష్పకం ఆగడానికి కారణమేమని ప్రశ్న తలయెత్తింది ప్రహస్త మారీచాది మంత్రులు పరిపరి విధాలుగా ఆలోచన సాగించారు.

అప్పుడు నందీశ్వరుడు వచ్చి శివపార్వతుల కేళికా పర్వతమైన ఆ ప్రదేశంసర్వులకూ ప్రవేశించరానిదనీ, ఆ తావును వీడి పొమ్మనీ దశముఖుని హెచ్చరించారు.

నందీశ్వరుని హెచ్చరికను పెడచెవిన పెట్టి-దశకంఠుడు-కైలాస పర్వ తాన్ని తన ఇరవై చేతులతోనూ పట్టి పైకెత్తేప్రయత్నం చేశాడు. అతని ఆర్భాటం గమనించి-శివుడు తన పాదంతో కైలాస పర్వతాన్ని నొక్కిపట్టి అక్కడి వారి భయాన్ని తొలగించాడు.

కైలాస పర్వతం క్రింద చేతులు నలిగిపోవడం వల్ల బాధతో దశగ్రీవుడు ఘోషిస్తు శివుని స్తోత్రం చేసి మెప్పించాడు. శివుడు అతని చేతులను విడి పించాడు.

మహా ఘోరమైన రావాన్ని (శబ్దాన్ని) చేసిన కారణంగా దశముఖుడు రావణుడనే నామంతో పిలవబడుతాడని శివుడు సెలవిచ్చి-అతని కోరికపై చంద్రహాసమనే ఖడ్గాన్నిచ్చాడు ఆనాటి నుండి శంకరుడు చెప్పినట్లుగా దశ గ్రీవుడు రావణుడుగా ప్రాచుర్యం పొందారు

శివానుగ్రహంవల్ల రావణుడు ఖడ్గరావణ మంత్రాధిదేవతగా పూజనీయు డయ్యాడు.

47 ప్రశ్న ; భారతంలో చాలామంది వికర్ణులు ఉన్నారు. చాల తిక మకగా ఉంది. దీనిని వివరించాలి.

సమాధానం :

వ్యాసభారతాన్ని అనుసరించి భారతగాధలో ఉన్న వికర్ణుడు ఒక్కడే. ఆ వికర్ణుడు-దుర్యోధన సోదర శతంలోనివాడు అతడినే కర్ణుని పుత్రునిగా పొరబడుతూ ఉంటారు ఆ విధమైన అభిప్రాయంవల్లనే ఈ ప్రశ్న వచ్చిందని భావిస్తున్నాను.

కర్ణ-వికర్ణ శబ్దాల మధ్య ఉన్న పోలికవల్లనే అటువంటి అభిప్రాయం లోకంలో ఏర్పడింది. కానీ వికర్ణుడు కర్ణుని పుత్రుడుకాడు. గాంధారీ, ధృత రాష్ట్రుల నూరుగురు పుత్రులలోని వాడు దుర్యోధనుని తమ్ములలో ఒకడు. ఆ నూరుగురి పేర్లూ వ్యాసభారతం సంస్కృత మూలంలో ఇవ్వబడినాయి. ఆ నూరుగురు సోదరుల పేర్లనూ- ఇదే గ్రంథంలో మరో చోట ఇచ్చాను. పరిశీలించమనవి.

ఆ నూరుగురిలో తప్ప భారతంలో మరెక్కడా వికర్ణుడనే పేరు కని పించదు.

వికర్ణుడు కర్ణపుత్రుడని పొరబడడానికి గల కారణాలలో ఒకటి వారి పేర్లు ఒకేలా ఉండడం అది ఒక్కటే కాక దీనికి మరొక కారణం కూడా ఉంది. అదేమంటే - ద్రౌపదీదేవిని దుశ్శాసనుడు సభలోనికి బలవంతంగా ఈడ్చుకొని వచ్చినప్పుడు ద్రౌపది-తాను ధర్మ విజితవా, లేదా అధర్మ విజితవా తెల్పి చెప్పమని సభాసదులను ప్రశ్నించింది. ఆ సమయంలో ఎవ్వరూ నోరు విప్పకపోగా, ఒక్క వికర్ణుడు మాత్రంలేచి, ధర్మరాజు ద్యూతంలో తన్ను తాను ఓడిపోయిన తర్వాత ఆమెను ఓడినాడు కనుక తనను తాను ఓడిన వాడిక మరె వ్వరిపైనా, తనపైనా కూడా అధికారం ఉండదు అంతేగాక - ద్రౌపదీదేవి పాండవులైదుగురికీ భార్య ఐన ద్రౌపదిని పందెం పెట్టే హక్కు ధర్మరాజుకు లేదనీ ద్రౌపదీదేవి ధర్మ విజిత కాదనీ స్పష్టం చేశాడు. అప్పుడు కర్ణుడు- ''బాలుడవైన నీకీ ధర్మచర్చ లెందుకు? అదీగాక ఈ బందకి విష

యంలో ధర్మాధర్మ చర్చలు అనవసరం" అని దుర్యోధనుని మెప్పుకోసం పలికాడు. రాజకుమారుడైన వికర్ణుని - కర్ణుడు ఆ విధంగా మందలించడం అనేది - దుర్యోధనాదులతో అతనికి గల చనువువల్లనే కాని - వికర్ణుడు తన పుత్రుడు కావడంవల్ల కాదని కర్ణుని ఆ పలుకులు దుర్యోధనునికి ప్రియం కలిగించడం కొరకేననీ గ్రహించాలి. సారాంశంగా - భారతంలో వికర్ణుడనేవాడు దుర్యోధనుని తమ్ముడైన వాడొక్కడే.

## 45 ప్రశ్న: రామాయణంలో మంథర, రావణుల పాత్రలు లేకపోతే ఎలా ఉండేది?

సమాధానం :

రామాయణంలో అతి కీలకమైనవి మంథర, రావణుల పాత్రలు.

రావణ ప్రముఖులైన రాక్షసుల బాధ భరించలేక, దేవతలు శరణు వేడగా, వారి అభ్యర్థన మేరకు రాక్షస సంహారార్థం రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగా నాలుగు రూపాలలో అవతరించాడు శ్రీమహావిష్ణువు. ఈ విషయం వాల్మీకంలో స్పష్టంగా చెప్పబడి ఉంది.

రామావతారం రాక్షస సంహార నిమిత్తమే అయినప్పుడు - రాక్షస ముఖ్యుడైన రావణుడే లేకపోతే శ్రీ మహావిష్ణువుకు రామావతారం ఎత్తవలసిన పనే లేదు.

శ్రీ మహావిష్ణువు దేవతల పక్షాన రాక్షసులపైన అనేకసార్లు యుద్ధం చేశాడు. ఆయన ధాటికి తట్టుకోలేకనే మాల్యవంతాది ప్రముఖులైన రాక్షస నాయకులందరూ పాతాళానికి వెళ్ళి దాగి ఉన్నారు. రావణుడు విజృంభించిన తర్వాతనే వారంతా భూమిపై యథేచ్ఛగా సంచరించడం ప్రారంభించారు. అట్టి రావణునికున్న బ్రహ్మ వరాల వల్లనే మహావిష్ణువు మానవరూపం ధరించవలసి వచ్చింది.

మరొక ముఖ్యవిషయం - రావణుడు బ్రహ్మను కోరిన వరాలలో నర వానరులను ఉపేక్షించి, తక్కిన వారందరివల్లనూ తనకు మరణం లేకుండా

కోరి ఉన్నాడు. ఆ కారణం వల్లనే శ్రీ మహావిష్ణువు, దేవతలు - నర వానర రూపాలను ధరించారని రామాయణం తెలుపుతున్నది.

కాబట్టి రామావతారమెత్తి విష్ణుమూర్తి మానవుడై జన్మించడానికీ; దేవతలు వానరులై జన్మించడానికీ - మూల కారకుడు రావణుడే.

ఇక మంథర విషయం.

మంథరే గనక లేకపోతే, రామ వనవాసం అనే అధ్యాయం ఉండేది కాదు. దశరథుడు ముందు వెనుక లాలోచించి, అతి జాగ్రత్తగా, అవ్యవధానంగా తలపెట్టిన శ్రీరామ యౌవ రాజ్య పట్టాభిషేకాన్ని, తన కుయుక్తితో భగ్నం చేసిన వ్యక్తి మంథర. అలా జరగకపోతే, మహారాజుగా ఏ రాజసూయ, అశ్వమేధ యాగ సందర్భాలలోనో రావణాసురుని ఎదుర్కొనే వాడేమో శ్రీరాముడు; అది కేవలం ఊహించదగిన విషయం.

అనాలోచితంగా చెప్పుడు మాటలకు మోసపోయే కైకమ్మలను లొంగ దీసుకొనే మంథరలు ఆనాడే కాదు, ఈనాడూ ఉన్నారు; ఏనాడూ ఉంటారు. వారు స్వకార్యపరులు, ఐతక నేర్చిన జాణలు, నిలువునా కాపురాలు కూల్చగల దిట్టలు.

మంథర మాటలు విని కైక అటు భర్తనూ కోల్పోయింది; ఇటు కొడుకు దృష్టిలో చులకనైంది; సర్వులచేతనూ ఛీత్కరించుకోబడింది. ఒక్క మంథర కారణంగా అయోధ్యా రాజకుటుంబీకులందరూ నానాక్లేశాలనూ అనుభవించారు. ఇంత చేసినప్పటికీ మంథర నష్టపోయిందేమీలేదు.

**46 ప్రశ్న :** రావణుని వంటి దుష్టునికి మండోదరి వంటి సాధ్వి-భార్య కావడం ఎలా సంభవించింది?

**సమాధానం :**

"అహో రూప మహో ధైర్య మహో సత్త్వమహోద్యుతిః

అహెూ రాక్షస రాజస్య సర్వలక్షణ యుక్తతా"॥

—అని హనుమంతుని చేతనే ప్రశంసించబడినవాడు రావణుడు. ప్రపంచ సాహిత్యంలోనే-వాల్మీకి సృష్టించిన ఈ విశిష్ట ప్రతినాయకునికి సాటిలేదు.

వీరుడు, తేజస్వి, అమేయ పరాక్రమశాలి అయిన రావణుని-ఒక్క-మండోదరే గాక, అనేక మంది స్త్రీలు వలచి వరించారు. వారిలో దేవ, రాక్షస, యక్ష, గంధర్వ, నాగాది అనేక జాతుల వారున్నారు. వారంతా రావణుని పట్ల పరమ అనురక్తులుగా ఉన్నారు. ఈ విషయాలన్నీ వాల్మీకి రామాయణంలో మహర్షి వాల్మీకి చేత స్పష్టంగా చెప్పబడ్డాయి.

ఏ స్త్రీకైనా సర్వవిధాలా కోరదగినవాడైన రావణునికి-మండోదరిని ఆమె తండ్రియైన మయుడే ఇచ్చి వివాహంచేశాడు. రావణుని వంశగౌరవాన్నీ, పౌరుష బలపరాక్రమాలనూ, అతడు సాధించిన విజయాలనూ చూచి మెచ్చి - రాక్షస శిల్పియైన మయుడు అతనిని తన అల్లునిగా అంగీకరించాడు.

## 47 ప్రశ్న : శివాలయంలో నంది కొమ్ముల మధ్యనుంచి ఈశ్వరుని దర్శించాలంటారు, ఎందువల్ల?

సమాధానం :

రాశి చక్రంలోని మిధునరాశి గౌరీశంకర స్వరూపం. వృషభరాశి నందీశ్వరునికి ప్రతీక రాశిచక్రం ఉదయించే సమయంలో వృషభరాశి, మిధునరాశికి కిందుగాను; అస్తమించే సమయంలో మిధునరాశి, వృషభరాశికి కిందుగాను ఉంటుంది. ఆ కారణంవల్లనే శివుడు వృషభవాహనుడూ, వృషభ ధ్వజుడూ అయ్యాడు. నంది కొమ్ముల మీది నుంచి శివదర్శనం చేయడంలోని అంతరార్థమదే. మిధునరాశిలోని ఆర్ద్రా నక్షత్రం రుద్రునికి సంకేతం.

శివుడు లయకారుడు. అగ్నినే మూడవ నేత్రంగా కలవాడు. అటువంటి ముక్కంటి కంటికెదురుగా వెళ్ళడం, తీక్షణమైన శివతేజస్సుకు ఎదురుగా వెళ్ళడం-మంచిది కాదని, అందునా శివునికి, నందికి మధ్యగా వెళ్ళడం పనికిరాదని

నిషేధించారు. శివునికి అత్యంత ప్రీతిపాత్రుడైన నందీశ్వరుని దర్శించి, ఆయన అనుమతితో శివుని అనుగ్రహాన్ని పొందవలసిందని ఆదేశించారు.

"వృషస్య వృషణం స్పృష్ట్వా శంకర స్యావలోకనమ్‌॥
శృంగ మధ్యే శివం దృష్ట్వా కైలాసం భవతి ధ్రువమ్' ॥

భావం:- వృషభము (నందీశ్వరుని) యొక్క వృష్ఠభాగాన్ని స్పృశిస్తూ శంకరుని దర్శించడం విధివిహితం. నందీశ్వరుని కొమ్ముల మధ్యనుంచి శివుని చూచిన వారికి నిశ్చయంగా కైలాసప్రాప్తి కలుగుతుంది-అని చెప్పబడింది. అందువల్లనే,

"నందీశ్వర నమస్తుభ్యం సాంబానంద ప్రదాయక॥
మహాదేవస్య సేవార్థం అనుజ్ఞాం దాతు మర్హసి॥"

"సాంబశివునికి ఆనంద ప్రదుడవైన ఓ నందీశ్వరా॥ నీకు నమస్కారం మహాదేవుని సేవించడానికై నాకు అనుజ్ఞ ప్రసాదించు"

—అని నందీశ్వరుని ప్రార్థించి-అనంతరమే పార్వతీ పరమేశ్వరులను సేవించవలసి ఉంది.

## 48 ప్రశ్న : వివిధ దేవతలకు ప్రదక్షిణం ఎన్నిమార్లు చేయాలి?

**సమాధానం :-**

పాంచరాత్ర ఆగమంలోని పుష్కరసంహితలో ప్రదక్షిణ విధిని గూర్చి ఈ క్రింది విధంగా చెప్పబడింది:

"ఏకం గణాధిపే కుర్యాత్ ద్వే సూర్యే త్రీణి శంకరే
చత్వారి కేశవే దేవే సప్తాశ్వత్థే ప్రదక్షిణమ్॥"

గణాధిపతికి ఒక మారు, సూర్యునికి రెండుమార్లు, శివునికి మూడు మార్లు, విష్ణువుకు నాలుగు మార్లు, అశ్వత్థ వృక్షానికి ఏడు మార్లు ప్రదక్షిణం చేయవలసిందని భావం.

ఇదిగాక - శివ ప్రదక్షిణ విశేష విధానం వేరుగా చెప్పబడి ఉంది. అది ఏమంటే-

శివాలయంలో వాయువ్య దిగ్భాగం చండీశ్వర స్థానం. అక్కడ చండీశ్వరుని ప్రతిష్ఠించినా, లేకున్నా - అది చండీశ్వర నివాసంగానే భావించవలసి ఉన్నది. ఇక - శివాభిషేకం చేసిన జలం ప్రవహించి బయటకు వచ్చే జలమార్గాన్ని సోమసూత్రమని వ్యవహరిస్తారు శివాలయం ఏ దిక్కుకు అభిముఖంగా ఉన్నప్పటికీ - సోమసూత్రం ఉత్తర దిశలోనే ఉంటుంది; చండీశ్వరుడు వాయువ్యమందే ఉంటాడు శివలింగానికి ఎదురుగా నంది, అతని వెనుక ధ్వజస్థంభం ఉంటాయి.

ఇతర దేవాలయాలలో వలె శివాలయం చుట్టూ ఒక సాధారణ ప్రదక్షిణం చేసినట్లయితే - ఒక్క ప్రదక్షిణ ఫలం మాత్రమే లభిస్తుంది. కానీ ప్రత్యేకంగా శివాలయంలో విశేష విధి ప్రకారం చేసే ప్రదక్షిణం ఒక్కటి చేసినంతనే అనేక ప్రదక్షిణ ఫలం లభిస్తుందని శివ పురాణమందు చెప్పబడి ఉంది. ఆ విశేష విధి విధానం ఇది:

"వృషం చండం వృషం చైవ సోమసూత్రం పునర్వృషం
చండంచ సోమసూత్రం చ పునశ్చండం పునర్వృషం॥"

వృషభం - అనగా నందీశ్వరుని వద్ద నుండి ప్రదక్షిణంగా చండీశ్వరుని వద్దకు వచ్చి - అక్కడి నుండి అప్రదక్షిణంగా తిరిగి నందీశ్వరుని వద్దకు వెళ్ళి - అక్కడి నుండి సోమ సూత్రం మీదుగా వృషభాన్ని చుట్టి ప్రదక్షిణంగా చండీశ్వరుని వద్దకు వెళ్ళి, సోమ సూత్రాన్ని కూడా దర్శించి - మళ్ళీ అప్రదక్షిణంగా వెనుకకు చండీశ్వరుని మీదుగా వృషభము వద్దకు తిరిగి రావాలి, ఇది ఒక విశేష ప్రదక్షిణం, ఇది విధి విహితం. అనేక సామాన్య ప్రదక్షిణాల ఫలాన్ని ఒక్క విశేష ప్రదక్షిణం ఈయగలదు.

గృహస్థులు సవ్యాపసవ్యమైన ఈ ప్రదక్షిణాన్ని చేయడంవల్ల విశేష ఫలాన్ని పొందగలరు. బ్రహ్మచారులు సవ్య ప్రదక్షిణాన్ని, సన్యాసులు అపసవ్య ప్రదక్షిణాన్ని చేయాలని చెప్పబడింది.

'సోమసూత్రం న లంఘయేత్' - అనే సూత్రం ప్రకారం శివప్రదక్షిణంలో సోమ సూత్రాన్ని దాటరాదు.

**49 ప్రశ్న : లంకేశ్వరునికి పదితలలుండడంలోని ఆంతర్యమేమిటి?**

**సమాధానం :**

విశ్రవసు బ్రహ్మపుత్రుడు, లంకేశ్వరుడూ ఐన రావణుడు - పదితలలు, ఇరవై చేతులతో జన్మించినట్లుగా వాల్మీకరామాయణంలో స్పష్టంగా చెప్పబడింది. దీని ఆంతర్యం ఏమిటని ప్రశ్నించారు దీనిని వివరిస్తాను.

శిరస్సు ఆలోచనాస్థానం. ముఖం-విద్యకు, వాక్కుకు నెలవు. సర్వ జ్ఞానేంద్రియాలూ కూడా ముఖంలోనే ఉంటాయి.

ఇక చేతులు కర్మణ్యత్వానికి, క్రియా శీలతకూ ప్రతీకలు.

సారాంశంగా-శిరస్సులు (లేదా ముఖాలు),-అధిక సంఖ్యలో ఉండడమనేది-అతనిలో హెంగి పొరలుతున్న సర్వ విద్యా సమగ్రతకూ, బుద్ధికుశలతకూ, మేధాశక్తికీ, పాండితీ వైభవానికీ (Qualities ot Head) చిహ్నం.

పలు చేతులు కలిగి ఉడడం-క్రియా కౌశలానికి, క్రియాశీలతకు చిహ్నం.

మరొక అంశం-

ప్రజాపతి బ్రహ్మయొక్క ముఖం నుండి బ్రాహ్మణులు, భుజాల నుండి క్షత్రియులు-జన్మించారని చెప్పబడింది. తన భుజశక్తితో ప్రజారక్షణం చేయడం క్షత్రియుని కర్తవ్యమని చెప్పబడింది. బుద్ధిశక్తియే బ్రాహ్మణశక్తి, భుజశక్తియే క్షత్రియశక్తి.

రావణుడు బ్రాహ్మణుడై జన్మించి-క్షత్రియ ధర్మాన్ని స్వీకరించినవాడు బ్రాహ్మణ లక్షణమైన బుద్ధిశక్తి, క్షత్రియ లక్షణమైన భుజశక్తి-రావణునియందు అపారంగా ఉన్నాయని చెప్పడానికి సంకేతమే రావణుని పదితలలూ; ఇరవై చేతులూనూ.

తన భుజశక్తితో ప్రజాపాలనం చేసే క్షత్రియునికి-బుద్ధిశక్తితో మార్గ నిర్దేశనం చేసేవాడు బ్రాహ్మణుడు. ఈ బ్రహ్మ-క్షత్రియశక్తులు అత్యధికంగా రావణునియందు మూర్తీభవించాయనేదే-రావణుని పదితలలూ ఇరవై చేతుల అంతరార్థం. ఆ కారణంగానే అతడు సర్వలోక విజేత కాగలిగాడు.

రావణుడు సర్వవిద్యా పరిశోభితుడు, పాండితీ మండనుడు, బుద్ధి సంపన్నుడు, మహావిక్రమశాలి, మేధావి, బాహుబలదర్పితుడు, సర్వక్రియా కుశలుడు కనుకనే-పదితలలవాడు, ఇరవై చేతులవాడుగా వర్ణింతబడ్డాడు.

ఉత్తమ, ఆదర్శ పరిపాలకుడు, శత్రువిజేత, సర్వగుణ పరిశోభితుడు-రావణుడు. అతని పాలనలో ప్రజలు సర్వ సంపదలతో, సర్వసుఖ సౌభాగ్యలతో తుల తూగినట్లుగా చెప్పబడింది-వాల్మీకంలో.

50 ప్రశ్న : సీతారాములు అరణ్యవాసంలో ఏకాంతంలో ఉన్నప్పుడు ఇంద్రపుత్రుడైన కాకాసురుడు సీతను బాధించాడు కదా? దేవరాజైన ఇంద్రునికి ఈ కాకాసురుడు పుత్రుడు కావటమేమిటి?

సమాధానం :-

దేవరాజైన ఇంద్రునికి రాక్షసుడు పుత్రుడు కావడం అంత అసంగత మైన విషయమేమీ కాదు. దేవరాక్షసులు పరాయివారు కాదు. ఒకే తండ్రి బిడ్డలు.

కశ్యప ప్రజాపతి భార్యలైన అదితి సంతానం దేవతలు; దితి సంతానం దైత్యులు; దనువు అనే భార్యకు దానవులూ సంతానంగా కలిగారు.

వీరిలో దనువు అనే కశ్యప పత్నికి జన్మించిన 'పులోముడు' అనే దానవుని పుత్రిక శచీదేవి - ఇంద్రునికి భార్య అయింది.

ఇంద్రుని సంతానం - జయంతి, జయంతుడు. ఈ జయంతి - రాక్షస గురువైన శుక్రాచార్యుని భార్య. జయంతి శుక్రుల పుత్రికయే - దేవయాని.

పులస్త్యుడనే బ్రహ్మ మానస పుత్రునికి అనేక మంది రాక్షసులు జన్మించారు.

కనుక - దేవ రాక్షసుల బాంధవ్యాన్ని గురించి సందేహించవలసిన పని లేదు. ఈ రెండు వర్గాలవారూ అతి సన్నిహిత సంబంధాలు కలిగినవారు. వారి బంధుత్వాలను గురించిన విశేషాలు ఇంకా ఉన్నవి కానీ గ్రంథ విస్తర భీతి చేత విడిచిపెట్టడమైంది. అంతేగాక, సీతాదేవిని బాధించిన కాకి ఇంద్ర పుత్రుడని వాల్మీకంలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. ఆ అంశాన్ని కూడా శంకించవలసిన అవసరం లేదు.

**51 ప్రశ్న :** "చంద్రుకొక నూలుపోగు" అంటే ఏమిటి? చంద్రునికి ఇవ్వవలసినది నూలు పోగేనా?

సమాధానం :

ప్రతి మాసమూ వృద్ధి క్షయాలు పొందేవాడు చంద్రుడు. స్త్రీలలో చంద్రుడే ఋతు చక్ర భ్రమణానికీ, సంతానోత్పత్తికి ప్రతి మాసమూ జరిగే అండోత్పత్తికీ కారకుడు. చంద్రుడు దాంపత్యంలో భార్యా భర్తృ సంబంధాల అనుకూలతకూ, సౌభాగ్యానికీ కూడా కారకుడు. చంద్రునికి అధిదేవత గౌరీదేవి. ఆ దేవత-మాంగల్య సౌభాగ్యానికీ, అన్యోన్య దాంపత్యానికీ, సంతాన సౌభాగ్యానికి అధిదేవత. ఈ విషయాలు ధర్మ స్మృతులచేతనూ, జ్యోతిశ్శాస్త్రంచేతనూ అంగీకరించబడినాయి. గ్రహాలను తృప్తిపరచే విధానంలో - ఏయే గ్రహాలకు ప్రీతికరమైన ద్రవ్య ధాన్యాదులచేత- ఆయా గ్రహాలను తృప్తిపరచే విధానం ఉన్నది.

వానిలో చంద్ర గ్రహానికి ప్రీతికరమైనదీ, చంద్రుని కారకత్వంలోనిదీ అయిన ధాన్యం - బియ్యం. ఆ బియ్యపు పిండిలో తయారుచేసిన తీపి వంటకమైన చలిమిడిని - చంద్రుని ఆరాధనలో గాని, గౌరీపూజలో గాని అర్పిస్తారు. అది విధానం. ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళే సమయంలో కూడా, చంద్రునికీ, గౌరిదేవికి ప్రీతిపాత్రమైన ఈ చలిమిడినే ఆయా దేవతలకు నైవేద్యం చేసి- సుముహూర్తపు సౌభాగ్యమూ, కడుపు పలువా కలగాలని- ఆమెకు ఆ చలిమిడిని

ఇచ్చి పంపే ఆచారం ఉంది. ఆ విధంగానే చంద్రుడు వస్త్రకారకుడు కనుక - కుమార్తెకు కొత్తబట్ట కట్టబెట్టి పంపుతారు.

వస్త్రం అనేది చంద్రుని కారకత్వాలలోనిది.

మానవ జీవితానికి అభిలషణీయములైన అనేక ముఖ్య ప్రాథమిక అంశాలు చంద్రుని ఆధిపత్యంలో ఉండడం వల్ల - ఆ చంద్రుని అర్చించడం, చంద్రునికి ప్రీతికరాలైన వస్తు విశేషాలను అర్పించడం శుభప్రదమవుతుందనే విశ్వాసానికి అనుగుణంగా ఈ విధంగా ఆచరిస్తాము. ఏదైనా ఒక శుభకార్యం కాని, అశుభకార్యం కాని జరిగినప్పుడు - ఆయా కర్తలకు - వారి తల్లి వైపు బంధువులు - నూతన వస్త్రాలను బహూకరించే ఆచారం మనకుంది. దానికి కారణం - మాతృ కారకుడు కూడా చంద్రుడే కావడం గమనార్హం. ఆయా శుభాశుభ కార్యాలను నిర్వర్తించే స్త్రీ పురుషులకు - అశుభాలు తొలగిపోయి శుభం కలగాలనే శుభాశంసలతోను, చంద్రభగవానుని ఆశీస్సులు వారికి కలగాలని, చంద్ర గ్రహ సంబంధమైన శుభఫలాలను వారు పొందాలని - ఇటువంటి సందర్భాలలోని భావన. ఇదే విధంగా - వ్యాధిగ్రస్తులై, తిరిగి ఆరోగ్యాన్ని పొందిన వారికి కూడా తల్లి లేదా తల్లికి సంబంధించిన వారు (అన్న దమ్ములు మేనమామలు ఇత్యాదులు) ఎవరు జీవించి ఉంటే వారు - నూతన వస్త్రాలను బహూకరిస్తారు. ఈ సందర్భంలో కూడా ఇదే విధమైన శుభ కామనకు కారణం - చంద్రుడు ఓషధీ కారకుడు, మనః కారకుడు, మాతృ కారకుడు - కూడా కావడమే.

ఇత్యాదిగా ఇంకా ఈ సందర్భంలో అనుప్రసక్తంగా చెప్పదగినవెన్నో ఉన్నాయి. ప్రతిమాసారంభంతోనూ ప్రథమ చంద్ర దర్శనం (పాడ్యమి/విదియ) రోజున - చంద్రారాధనోమ్ముఖంగా, ఒక వస్త్ర ఖండాన్ని చంద్ర దేవతా ప్రీత్యర్థంగా అర్పించడమే చంద్రునికొక నూలుపోగు నీయడం. దాని ద్వారా చంద్రగ్రహంయొక్క అనుగ్రహాన్ని, చంద్రగ్రహ కారకత్వంలో ఉన్న శుభఫలాలనూ పొందగోరడమే ఆ చర్యకులక్ష్యం. ఆ సందర్భంలో "కొత్తన్నం, పాతవస్త్రం నువ్వు తీసుకొని; పాతన్నం, కొత్త వస్త్రం మాకిచ్చి చల్లగా చూడు

ంద్రి" - అని జానపదులు అనూదానంగా పలికే పలుకులు కూడా నేను పైన పరిపాదించిన అంశాలకు ఉపబలకాలు కాగలవు.

చంద్రునికొక నూలుపోగు అనేది - మరొక అర్థంలో కూడా ఉప యోగిస్తారు.

అదేమంటే - కొండంత దేవునికి కొండంత పత్రి ఇచ్చుకోలేము. జగచ్చక్షువు, కర్మసాక్షి అయిన చంద్రునికి స్వల్పమైన - నూలుపోగునివ్వడం అల్పాతి అల్పమైన కానుక. స్వీకరించేవాని అర్హతనుబట్టి కాక - ఇచ్చేవాని శక్తినిబట్టి అధికునికి స్వల్పమైన కానుక ఇచ్చినప్పుడు చంద్రునికొక నూలు పోగుగా ఇస్తున్నామని చెప్పడంగా పరిపాటి.

52 ప్రశ్న : హస్తినాపుర రాజ్యాధికారం భీష్మునిదే. అతడి శపథం వల్ల ఆ అధికారం ధృతరాష్ట్రునికి చెందుతుంది. ధృతరాష్ట్రుని తరువాత సుయోధనునికే ఆ అధికారం సంక్రమించాలి. పాండురాజపుత్రులకు రాజ్యాన్ని ఇవ్వాల్సిన అవసరం ఏమిటి?

సమాధానం :-

భీష్ముడు తన ప్రతిజ్ఞ ద్వారా వదలుకొన్న రాజ్యాధికారం - సత్యవతీదేవి సంతానానికి సంక్రమించింది. ఆ తర్వాత జ్యేష్ఠ పుత్రునిదే ధర్మానుసారంగా రాజ్యాధికారమైనా-ధృతరాష్ట్రుడు నేత్రహీనుడుగా జన్మించాడు. అంగవైకల్యం కలవానికి రాజ్యార్హత లేదు. అందువల్ల పాండురాజుకే రాజ్యార్హత ఉన్న దని అనాటి పెద్దలు నిర్ణయించారు.

పాండురాజు - ధర్మరాజుల మధ్యకాలంలో ధృతరాష్ట్రుడు తాత్కాలికంగా అధికారాన్ని నిర్వహించాడే తప్ప, అతడు శాస్త్రసమ్మత ప్రభువుకాడు. అతనికే లేని రాజ్యార్హత - అతని సంతానానికి సంక్రమించే ప్రసక్తిలేదు.

ఈ రీత్యా - ధర్మశాస్త్ర సమ్మతంగా రాజ్యాధికారియైన పాండురాజు యొక్క జ్యేష్ఠ సంతానానిదే రాజ్యాధికారమనేది స్పష్టమైన విషయం.

వ్యాస భారతాన్ని అనుసరించి- పాండురాజుకే పట్టాభిషేకం జరిగింది.

పట్టాభిషేకానంతరం పాండురాజు దిగ్విజయయాత్ర చేసి, రాజ్యాన్ని విస్తరింపజేశాడు. రాజ్యానికి వచ్చిన కొద్దికాలానికే పాండురాజు తన భార్య లిరువురితో వనవిహారానికి వెళ్ళడమూ, అక్కడ మృగాల రూపంలో క్రీడి స్తున్న కిందమ ముని దంపతులపై బాణప్రయోగం చేసి, కిందమ ముని శాపా నికి గురికావడమూ జరిగాయి.

శాపోపహతుడైన పాండురాజు ఇక తిరిగి నగరానికి వెళ్ళలేదు. అక్కడనే తపోవృత్తిలో ఉండిపోయాడు. పాండురాజు పత్నులు పాండురాజుతోనే ఉన్నారు. పాండురాజే రాజ్యాధికారి కావడంచేత, అతని అనంతరం పాండు రాజు జ్యేష్ఠపుత్రుడికే రాజ్యాధికారం అవుతుంది. పాండురాజు మరణానంతరం కుంతి పాండవులను వెంటబెట్టుకొని హస్తినాపురానికి చేరింది. కౌరవ సామ్రా జ్యానికి ధర్మరాజే ఉత్తరాధికారి అని కురువృద్ధులందరి నిర్ణయం.

దానికి తోడు ధర్మరాజు ప్రజారంజకుడుగా వాసికెక్కాడు. పూర్తి రాజ్యం కాకపోయినా - ఖాండవ ప్రస్థాన్ని ఇచ్చి పంపినా పాండవులు మారు మాట్లాడ కుండా స్వీకరించి - రాజ్య నిర్మాణం చేసుకొన్నారు. అయినా తృప్తిలేని ధృతరాష్ట్ర దుర్యోధనులే యుద్ధాన్ని ఆహ్వానించే చేష్టలు చేసి - ముప్పు తెచ్చారు.

రాజ్యాధికారం ఎవరిదన్న ప్రసక్తి అలా ఉంచి - పాండవులకు ధృతరాష్ట్రదుర్యోధనులు ద్రోహం తలపెట్టకుండా ఉండి ఉంటే యుద్ధం వచ్చి ఉండేది కాదు. ధృతరాష్ట్రుడు పాండవులకు ఖాండవ ప్రస్థమనే ఒక పనికి రాని భూభాగాన్ని ఇచ్చి పంపాడు. అప్పుడు పాండవులు - రాజ్యాధికారమూ వారసత్వాల ప్రసక్తి తేలేదు మారు మాట్లాడకుండా పెదతండ్రి ఇచ్చిన దానిని స్వీకరించి వెళ్ళారు. అక్కడనే రాజ్య నిర్మాణం చేసుకొన్నారు. తమ భుజబల పరాక్రమాలతో, శ్రీకృష్ణుని కృపతో - దిగ్విజయ యాత్రచేసి - రాజ్యాభివృద్ధి చేసుకొని, రాజసూయయాగం చేయగలిగారు పాండవులు. ఆ దశలో - బలవంతులైన పాండవులతో కౌరవులు - స్నేహాన్ని, బంధుధర్మాన్ని పాటించి ఉండే - వారసత్వాధికారాల ప్రస్తావన తల ఎత్తి ఉండేది కాదు.

పాండవులు తమ రాజసూయానికి ధృతరాష్ట్రునీ, అతని వారినీ ఆహ్వానించి - వచ్చిన దుర్యోధనాదులతో బంధు ధర్మాన్నే పాటించారు. అదే మైత్రిని దుర్యోధనాదులు కూడా పాండవులపట్ల పాటించి ఉంటే - వారసత్వ రాజ్యాధికారాల ప్రసక్తిని పాండవులు తెచ్చి ఉండేవారుకాదు. ధృతరాష్ట్రుని అనంతరం దుర్యోధనుడే కౌరవ సామ్రాజ్యానికి రాజైనా - పాండవులు వారితో సఖ్యాన్నే పాటించి ఉండేవారు కాదు. ఎవరి రాజ్యాన్ని వారేలుకొంటూ రెండు కుటుంబాలూ స్నేహంతో వర్ధిల్లి ఉండేవి. పాండవులను తమంతటాముగా కూడా బతకనీయడం ఇష్టంలేక - రాజసూయంలో వారి వైభవాన్ని చూచి అసూయతో, ఓర్వలేనితనంతో దుర్యోధనుడు పాండవులకు అపకారం తలపెట్టాడు.

దుర్యోధనుడు పాండవుల ఉన్నతిని చూడలేని తన దుఃఖాన్ని - ధృతరాష్ట్రునివద్ద వెళ్ళబోసుకొన్నాడు. బుద్ధిచెప్పవలసిన వృద్ధరాజు కూడా బుద్ధిమాలి- కొడుకు దుశ్చేష్టలకు సహకరించాడు. ధృతరాష్ట్రదుర్యోధనులు పాండవులను నాశనం చేయదలచిన పథకంలో భాగాలే - రెండుమార్లు ద్యూతం, ఘోషయాత్ర, ఉత్తరగోగ్రహణం - ఇత్యాదులు. ద్యూతంలో ఏర్పరచిన నియమాలకు బద్ధులై - తాము స్వయంగా సంపాదించుకొన్న రాజ్యాన్ని కూడా కౌరవుల పరం చేసి - అడవులపాలైన పాండవులను - అక్కడ కూడా బతకనీయడం ఇష్టంలేక - ఘోషయాత్ర తలపెట్టాడు దుర్యోధనుడు. గంధర్వుల చేతిలో మరణించవలసిన దుర్యోధనుని - ఆ స్థితిలో కూడా కాపాడిన ఉదారులు పాండవులు. తమకు నిష్కారణంగా అంతటి అపకారాలను చేసిన దుర్యోధనుని - పాండవులు దయతలచి రక్షించినా, దుర్యోధనునికి అప్పటికీ మంచి బుద్ధి కలగలేదు. ఇంకా ఇంకా పాండవులను నాశనం చేయాలనే ప్రయత్నాలను సాగిస్తూనే ఉన్నాడు. దుర్యోధనుని ప్రయత్నాలను వమ్ముచేసి - పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలను పూర్తిచేసి వచ్చారు. అప్పుడు పాండవులకు భాగం పంచకపోయినా, కనీసం వారడిగిన ఐదు ఊళ్ళనైనా ఇచ్చి ఉంటే - యుద్ధం తప్పేది. అదికూడా ధృతరాష్ట్రదుర్యోధనులకు అంగీకారం కాలేదు.

**53 ప్రశ్న :** "తిలకధారణం" ఎందుకు? నుదుట ఎర్రని బొట్టును దేనికి ధరిస్తారు?

సమాధానం :

జ్యోతిశ్శాస్త్రంలో- "ధనే వ్యయే చ పాతాళే జామిత్రే చాష్టమే కుజౌ।
స్త్రీణాం భర్తృ వినాశయ పుంసాం భార్యా వినాశనమ్॥"

-అని చెప్పబడి ఉంది. అనగా వ్యక్తియొక్క జాతక కుండలిలో - అంగారక గ్రహం - 2, 12, 4, 7, 8- ఈ స్థానాలలో ఉండడం దోషం. దానివలన - అనగా ఈ చెప్పబడిన స్థానాలలో ఏదో ఒక దానిలో అంగారకుడు ఉన్నట్లయితే- ఆయా స్త్రీ పురుషులకు పతి, లేదా పత్ని వియోగం కలుగుతుందని భావం.

ఈ అంగారక దోషనివృత్తి కొరకై తిలక ధారణం కూడా ఒకమార్గం. ఏ విధంగా అంటే-

మానవ శరీరంలో వివిధ భాగాలకు గ్రహాలు కారకత్వం వహిస్తాయి. వానిలో ముఖానికి చంద్రుడు కారకుడు కుజ దోషాన్ని లగ్నంనుండే కాక, చంద్ర లగ్నాత్, శుక్రాత్ కూడా పరిగణించడం ఉంది. కుజునికి సంబంధించిన దోషాలు ఎన్నో జాతకులకు కలుగుతాయి. దానివల్ల భార్యా, లేదా భర్తృ వియోగం, తల్లికి వైధవ్యం (తండ్రి మరణం) వంటి ఎన్నో దుష్ఫలితాలు కలుగుతాయి. చంద్ర స్థానమైన ముఖమధ్యంలో నుదుటిపై ఈ దోషాలకు నివారణగా తిలకాన్ని ధరించాలి.

రక్తవర్ణం కుజుని ఆధిపత్యంలోనిది. ముఖంపై రక్తవర్ణ తిలకాన్ని ధరించడం వలన కుజ దోషాలకు ప్రతిక్రియగా ఈ విధమైన ఏర్పాటు చేయడం జరిగింది.

జాతకంలో ఉన్న కుజ దోషాలన్నిటినీ నివారించడానికి - ఇంకా అనేక మార్గాలూ, విధానాలూ ఉన్నాయి. వానిలో తిలక ధారణం కూడా ఒక విధానం. ఈ దోషాల నివృత్తికి - ఆ వ్యక్తుల జాతక లక్షణాలను బట్టి - అనేక విధాలుగా నివారణ మార్గాలను నిర్ణయించవలసి ఉంది గ్రహ దోష నివారణ మార్గాలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

పై దోషాలవల్ల - వ్యక్తులకు అనేక దుష్ఫలితాలు కలుగుతూ ఉంటాయి. భార్య కానీ భర్తకానీ మరణించడం, లేదా వారితో ఎడబాటు కలగడం,

సంతానం కలగక పోవడం, సంతానం కలిగి మరణించడం, గర్భస్రావాలు, ఋతుచక్రానికి సంబంధించిన (గైనిక్) వ్యాధులు, తండ్రి మరణించడం వంటివి ఇంకా ఎన్నో కలుగుతాయి. తిలక ధారణం ఈ విషయంలో చిన్న ఉపశమన ప్రక్రియ మాత్రమే. పైన చెప్పినవే కాక ఇంకా ఎన్నో గ్రహదోష సంబంధమైన దుష్ఫలితాలు మానవులకు కలుగుతూ ఉంటాయి. వాటి తీవ్రతను బట్టి ఇంకా అధికమైన ప్రక్రియలు చేయవలసి ఉంటుంది. వాటిని చేసే విధానాలు శాస్త్రాలలో చెప్పబడ్డాయి.

**54 ప్రశ్న :** రాహుకాలం అంటే ఏమిటి? జనబాహుళ్యం ఎక్కువగా రాహుకాలాన్ని పరిహరించి కార్యానికి పూనుకోవాలని చూస్తారు. ఎందుకు?

సమాధానం :

ఏదైనా ఒక కార్యం తలపెట్టినప్పుడు అది మంచి ఫలాలను ఇవ్వడం కోసం - ఆ కార్యనిర్వహణకు శుభసమయాన్ని ఎంచుకోవడం జరుగుతుంది. కార్యహాని, కార్యవిలంబన, చోర, శస్త్ర, అగ్ని, మృత్యు, రోగ, రాజభయాది దుష్ఫలితాలు కలుగకుండా ఉండే నిమిత్తమై - అశుభ సమయాలనూ, పాప గ్రహస్థితి, దృష్టి - కలిగిన లగ్నాలనూ విడిచి పెట్టాలి. వర్జ్య, దుర్ముహూర్త, రాహుకాల, గుళిక కాల, యమ ఘంటికాది దుష్ట సమయాలను పరిహరించడం అవసరం. ఎవరైనా ఏ కార్యమైనా శుభ ఫలాలను కోరి మాత్రమే ఆచరిస్తారు. కనుక, ఇది వ్యక్తులకైనా, సంస్థలకైనా, ప్రభుత్వాలకైనా వర్తిస్తుంది.

వ్యక్తికి జాతకం ఎట్టిదో, ఏ ప్రయత్నానికైనా దాని ప్రారంభ ముహూర్తం అట్టిది. ఆ ప్రారంభ సమయానికి చెందిన గ్రహస్థితి, తత్కాల ముహూర్త శుభాశుభాలు-ఆ కార్యఫలాన్ని నిర్ణయిస్తాయనడంలో సందేహం లేదు.

ముహూర్త విషయంలో విడిచి పెట్ట దగినవి ఏ వింశతి - అనగా 24 మహాదోషాలు-జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడ్డాయి. లగ్నంబలం కలిగినదైనా, శాస్త్రంలో చెప్పబడిన శుభలక్షణాలన్నీ కలిగినదైనా కూడా- ఈ మహా దోషాలలో ఏ ఒక్కటి ఉన్నా అది చాలా దుష్ఫలితాలను కలిగిస్తుందని కాళిదాసు,

వరాహమిహిర, జైమిని, పరాశరాది జ్యోతిశ్శాస్త్ర ఋషులు స్పష్టంచేశారు.

మహా దోషాలుగా చెప్పబడినవి 24 మాత్రమే కాక, స్వల్పదోషాలు కూడా కొన్ని ఉన్నాయి. వానిని కూడా సాధ్యమైనంతవరకు విడిచిపెట్టి ముహూర్తం నిర్ణయించాలని ఋషి వాక్యం స్వల్పదోషాలకు తగిన పరిహారాలు జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడ్డాయి. కాని మహాదోషాలకు పరిహారాలు లేవనీ, ఆ దోషాలు లేకుండా మాత్రమే ముహూర్తాలను నిర్ణయించాలని జ్యోతిశ్శాస్త్ర ఋషులు స్పష్టం చేశారు. మహాదోషాలుగా చెప్పిన 24 దోషాలను మరొక సందర్భంలో వివరించగలను.

## 55 ప్రశ్న : గృహ దేవతార్చనలో సాలగ్రామం తప్పక ఉండాలా ?

సమాధానం :

శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, సౌరమతాల మధ్య ఆనాటికి ఉండిన సంఘర్షణనూ, సాంఘిక కల్లోలాన్నీ రూపుమాపడానికి, వైదిక ధర్మంలో ఇవన్నీ అంతర్భాగాలేనని వివరించడానికీ, సమన్వయం సాధించడానికి - శంకరాచార్యుల వారు - భారతీయుల నిత్య పూజావిధానంలో పంచాయతన దేవతార్చన పద్ధతిని ప్రవేశపెట్టారు.

ఈ పంచాయతన విధానంలో - గణపతి, సాలగ్రామం (విష్ణురూపం), శివలింగం, శక్తి (దేవి), సూర్యుడు - ఉంటారు. వైదికధర్మంలోని సర్వ మతాల వారికీ అంగీకార్యమైన ఈ విధానం వేదమతంలో ఉన్న అనైక్యాన్ని తొలగించడానికీ; ఆనాడు ప్రబలంగా ఉన్న నాస్తిక (బౌద్ధ, జైన, చార్వాకాది) మతాల ప్రభావాన్ని తప్పించడానికి ఉపయోగించింది.

క్షీణ దశలో ఉన్న హిందూ ధర్మం, వైదిక ధర్మం - శంకరాచార్యుల వారి రాకతో - పునరుజ్జీవనాన్ని పొందింది. ఆ సేతుహిమాచలం పర్యటించి, నాస్తిక మతాలను ఖండించి, వేద ధర్మానికి ప్రాణం పోసి, ఉజ్జ్వలంగా వెలిగింప జేశారు శంకరులు.

ఆదిశంకరులు ఏర్పరచిన ఈ పంచాయతన విధానమే ఈనాటికీ

సంప్రదాయంగా నిలిచి ఉన్నది అందువల్ల గృహ దేవతార్చనలో సాలగ్రామం ఉంచవలసిందే.

సాలగ్రామం అనేది - పంచాయతన పూజలోని విష్ణుస్వరూపం. ఈ సాల గ్రామాన్ని గురించిన విశేషాలు, సాలగ్రామము యొక్క ఉత్పత్తికి సంబంధించిన గాథ, సాలగ్రామ లక్షణాలు - ఇదే గ్రంథంలో మరొకచోట ఇచ్చాను.

**56 ప్రశ్న :** కొందరు పురోహితులు సాలగ్రామం దగ్గరుంచుకొంటారు - కదా! ఎందుకు?

**సమాధానం :-**

విధి విహితంగా ఏదైనా దానం చేసే సందర్భంలో, ఆ దానంతో పాటు సాలగ్రామాన్ని కూడా దానం చేయాలని శాస్త్రవాక్య ప్రమాణం.

దానంతో పాటు దక్షిణనూ, సాలగ్రామాన్నీ ఈయవలసి ఉంది. అయితే, దానమీయదలచిన ప్రతివారూ, అందునా ఈ ఆధునిక కాలంలో - సాలగ్రామాన్ని సిద్ధం చేసుకొని ఉంచుకోవడం జరగదు. కనుక, పురోహితు లలో శాస్త్రం క్షుణ్ణంగా తెలిసినవారు ఆ విధంగా సాలగ్రామాన్ని దగ్గర ఉంచుకుంటారు.

ఏదైనా స్వల్పదానం నుంచి కన్యాదానం వరకూ, శాస్త్రోక్తమైన ప్రతి వైదిక కార్యక్రమానికి సాలగ్రామం అవసరం ఉంటుంది.

అంతేగాక, ఏవిధమైన పూజా కార్యక్రమాలు చేయించవలసి వచ్చినా పూజాపీఠంలో సాలగ్రామాన్ని ఉంచవలసి ఉంటుంది.

ఈ దృష్టితో పురోహితులే సాలగ్రామాన్ని ఆయా గృహస్థుల అవ సరాల నిమిత్తం తామే దగ్గర ఉంచుకొని వాడుతూ ఉంటారు.

**57 ప్రశ్న :** విష్ణువు ఆలయాలలో ధ్వజస్తంభానికి వరి వెన్నులను కట్టడం ఎందుకు?

సమాధానం :-

పశువులకు ఆహారంగా ఉండటం కోసం ఆ విధంగా చేస్తారు. ఆలయాల్లోనే గాక, చాలా ఇళ్ళల్లో కూడా, ఇంటి ముందు వరివెన్నులను కడతారు. మనకున్నది పరులకు పెట్టడం, మానవులకే గాక పశుపక్ష్యాదులకు కూడా ఆహారాన్ని ఈయడం-భారతీయ సంస్కృతిలోని మహోన్నత ఆదర్శం.

మానవుడు ప్రతినిత్యమూ పంచయజ్ఞాలు చేయవలెనని ఉంది. వానిలో అందులో భూతయజ్ఞం ఒకటి. సర్వజీవులకూ ఆహారాన్ని సమర్పించిన తర్వాత తనే గృహస్థుడు ఆహారాన్ని స్వీకరించాలి. అప్పుడు ఆ అన్నం హవిస్సుగా, అమృతంగా మారుతుందని చెప్పబడింది.

విష్ణువు స్థితి కారకుడు కనుక, సర్వజీవుల సుస్థితినీ ఆయన కనిపెట్టి ఉంటాడనే దానికి కూడా ఇది సంకేతం

తమకున్న దానిని ఇతరులతో పంచుకోవడం, తనకు కలిగిన దానిలో కొంత భాగాన్ని దానం చేయడమనేది భారతీయ ధర్మం బోధించిన సదాచారం. మానవులకే కాకుండా పశుపక్ష్యాదులకు కూడా ఆహారాన్నివ్వడం, 'పిపీలికా గణార్చనం' అనే పేరుతో చీమలకు కూడా ఆహారాన్ని ఇవ్వడం అనే మహోన్నత ఆదర్శాన్ని భారతీయ ధర్మం బోధించింది.

తాను బ్రతుకుతూ ఇతరులను బ్రతికించడం, సమాజంలో వ్యక్తులు ఒకరు బ్రతికితే - వారివల్ల ఎందరో బ్రతకడం, అనే ఏర్పాటు ప్రాచీన భారతీయ వ్యవస్థలో ఉండేవి. 'యస్మిన్ జీవతి జీవంతి తతు జీవతు జీవనం' ఎవనివల్ల ఇతరులు జీవిస్తారో - అతని జీవనమే జీవనం - అన్నదే భారతీయ మహోజ్వల ఆదర్శం.

కానీ ప్రస్తుతం పాశ్చాత్య జీవిత విధానం యొక్క ప్రభావం వల్ల - ఒకరి జీవితాన్ని భంగపర్చితే కానీ మరొకరు బ్రతకలేని పరిస్థితి ఏర్పడింది.

58 ప్రశ్న : దేవతలకు అనేకులకు ఇద్దరు భార్యలున్నారు. ఎందుకు?

సమాధానం :

దేవత-అనేది ప్రతీకాత్మకమైన (సింబాలిక్) ఒక తేజస్సు. నిర్దేశించ బడినట్టి కొన్ని శక్తులకు సంకేతమే దేవత. దేవతలు తేజోరూపులు, పిశాచాలు ఛాయారూపులు.

ఆయా దేవతల భార్యలు, అలంకారాలు, ఆయుధాలు-అన్నీ కూడా ప్రతీకలే. (సింబాలిక్.)

ఉదాహరణకు-స్థితికారకుడై, సర్వసృష్టి యొక్క పాలన పోషణలను నిర్వహించే విష్ణుమూర్తి యొక్క భార్యలు-శ్రీదేవి, భూదేవి. సర్వ సంపత్స మృద్ధి యొక్క స్వరూపమే లక్ష్మీదేవి. భూదేవి-అనగా భూమి, భూసంబంధమైన సర్వ భూ, జల, ఖనిజ, వనాది సహజ సంపదల యొక్క సాకారమే భూదేవి, లక్ష్మీదేవి - అనగా సర్వ ఐశ్వర్యమూ, సర్వ వస్తు - ధన సంపదలన్నూ ఆయా సంపదలన్నీ విష్ణుదేవుని ఆధీనంలో ఉన్నాయనే విషయానికి సంకేతమే - లక్ష్మీదేవి, భూదేవి - విష్ణుమూర్తి భార్యలని చెప్పడంలో అంతరార్థం.

ఆ విధంగానే - విఘ్నేశ్వరుని భార్యలు సిద్ధి, బుద్ధి, ఆ వినాయకుని పుత్రులు - క్షేముడు, లాభుడు. అనగా విఘ్ననాయకుడైన గణపతి - విఘ్నా లను అదుపు చేసేవాడనీ; బుద్ధి కుశలతనూ; ధన సిద్ధి, విద్యాసిద్ధి, కార్యసిద్ధి - ఇత్యాది సర్వసిద్ధులనూ; క్షేమలాభాలనూ కలిగించే దైవం - అని సాంకేతి తికంగా తెలియజేయడమే.

దైవాలకు సంబంధించిన అంశాలను ఇదే మార్గంలో అర్థం చేసుకోవాలి. వివిధ దైవాలు - వివిధాలైన భావాలకు ప్రతీకలు.

**59 ప్రశ్న :** కొత్తకోడలు అత్తింట ముందుగా కుడికాలు మోపాలం టారు. దేనికి?

**సమాధానం :-**

శరీరంలోని భాగాలన్నిటికీ గ్రహాలు కారకత్వం వహిస్తాయి. శిరస్సుకు సూర్యుడు, ముఖానికి చంద్రుడు, కంఠానికి కుజుడు, శరీరపు ఎడమ భాగానికి

బుధుడు, కుడి భాగానికి బృహస్పతి, హృదయానికి శుక్రుడు, మోకాళ్ళకు శని, పాదాలకు రాహుకేతువులు - అధిపత్యం వహించి ఉన్నారు. ఈ విధంగా బాహ్య భాగాలకే కాక, శరీరాంతర్భాగాలకు సంబంధించి కూడా గ్రహ కార కత్వ విషయిక మైన విభాగం ఉంది. మానవులకు వారి జాతకంలో గ్రహ దోషాలు ఏర్పడినప్పుడు - ఆయా శరీర భాగాలు రోగగ్రస్తాలు కావడం గురించి కూడా వాటి నివారణకు గురించీ జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడింది. కానీ ప్రస్తుత ప్రశ్నకు సంబంధించినది కాకపోవడం వల్ల విడిచి పెట్టడమైంది. జాతకాలలో ఏర్పడిన గ్రహదోషాలను అనుసరించి - ఆయా శరీర భాగాలకు నష్టం జరుగుతుంది.

బృహస్పతి సర్వ శుభకారకుడు కావడం వలన, ఆయన కారకత్వం కలిగిన కుడిపాదాన్ని ముందుగా ఉంచడం శుభం. శుభ గ్రహ సంబంధం శుభావహం కనుకనే ఆ విధంగా చేయడం. అంతేగాక, వివాహ, దాంపత్యం, సంతానం - వంటి అంశాలన్నిటికీ బృహస్పతియే కారకుడు. కాబట్టి ఆయా విషయాలన్నిటిలో ఆ దంపతులకు శుభం కలగాలనే ఉద్దేశంతో ఆ విధంగా చెప్పడం జరిగింది. క్రొత్తగా ఆ ఇంట ప్రవేశిస్తున్న ఆ వధువుకు ఆ గృహ ప్రవేశమూ, ఆ గృహంలో జీవితమూ సుఖదాయకం కావాలనీ, శుభ ప్రారంభం నిమిత్తమై, ఆమె భావి జీవితం ఆ గృహంతో సవ్యంగా సాగా లన్న ఆకాంక్షతోనూ ఏర్పరచబడిన ఆచారం ఇది. ఇతరుల పట్ల మంచి హృదయమూ, మంచి వాక్కూనూ మంచినడవడినీ, ఇచ్చే బృహస్పతి యొక్క కారకత్వం వల్ల - దాంపత్యాలకు ఏ విధమైన ఇబ్బందులూ, కలహాలూ, అశాంతులూ, ఎదురుకాకుండా ఉండాలనే సదాశయంతో ఈ ఆచారం ఏర్పరచ బడింది. అది ప్రవేశించేవారికీ, ఆ ఇంటికీ కూడా శుభం. ఇరుపక్షాల వారికీ శుభ ప్రారంభం. (గుడ్ బిగినింగ్)

క్రొత్తకోడలే కాదు - ఏ వ్యక్తి కానీ - ఏ పని నిమిత్తంగా బయలు దేరినా, ఏ మంచి పని చేసినా, ఎక్కడ మొదటగా ప్రవేశిస్తున్నా - కుడి చేతితో చేయడం, కుడికాలిని ముందుగా ఉంచి ప్రవేశించడం - సంప్రదాయం, శాస్త్ర విహితం.

ఎవరు ఏ కొత్తవని ప్రారంభించినా - కుడిచేతితోనే చేయాలి. ఏ కొత్త ప్రదేశంతో ప్రవేశించినా కుడికాలుంచి ప్రవేశించాలి.

మిత్రుల ఇంట కుడికాలు పెట్టి, సింహద్వారంనుంచి ప్రవేశించాలనీ, శత్రువుల ఇంట ఎడమకాలు పెట్టి - సింహద్వారంనుంచి కాకుండా పాణిద్వారం (పెరటి గుమ్మం)నుంచి ప్రవేశించాలనీ - శాస్త్ర ప్రమాణం. లంకలో రావణుని ఇంట హనుమంతుడూ; మగధలో జరాసంధుని ఇంట శ్రీకృష్ణ భీమార్జునులూ ఆ విధంగానే ప్రవేశించారని రామాయణమూ, భాగవతమూ, హరివంశమూ తెలుపుతున్నాయి.

**60 ప్రశ్న :** శివ ధనువును విరిచిన వానికి సీత నిస్తానని జనకుడు ప్రకటించడమేమిటి? అంత గొప్ప ధనువును విరవమనడం అనుచితంగా లేదా?

సమాధానం :

జనక మహారాజు - శివ ధనువును విరిచిన వానికి సీతనిస్తానని అనలేదు జనకుడు ఆ విధంగా ప్రకటించాడని భావిస్తే - ఆ అభిప్రాయం తప్పు. ఇది వాల్మీకంలో లేనిది. పూర్తిగా అవాల్మీకం.

శివ ధనువును ఎక్కుపెట్టిన వానికి సీత నిస్తానని మాత్రమే జనకుడు ప్రకటించాడు తప్ప దానిని విరిచిన వానికి ఇస్తాననలేదు - శివ ధనువును విరవడమే సీతను చేపట్టడానికి కావలసిన అర్హత - అని జనకుడు ప్రకటించలేదు.

ఎందరో బలశాలులు ప్రయత్నించి కూడా లేవనెత్తలేని శివ ధనువును శ్రీరాముడు లేవనెత్తి - ఆ వింటిని వంచి అల్లెతాడు ఎక్కించాడు. బాణాన్ని కూర్చాడు. బాణాన్ని వదలే ప్రయత్నంలో అల్లెతాటిని ఆకర్ణాంతం లాగాడు. అప్పుడు శివ ధనువు ఫెళ్ళున విరిగింది. ఇదీ జరిగిన విషయం.

సీతను వివాహం చేసుకోతలచిన వానికి జనకుడు నిర్ణయించిన అర్హత - శివ ధనువును ఎక్కుపెట్టడం మాత్రమే. రాముడు ఆ నియమాన్ని నెరవేర్చాడు. ఎక్కుపెట్టిన వింటికి బాణాన్ని సంధించి వింటి నారిని లాగగా - అనుకోకుండా విరిగిపోయిందే తప్ప - శివ ధనువును విరవాలని జనకుడు ప్రకటించనూ లేదు; రాముడు అనుకోనూ లేదు.

**61 ప్రశ్న : వరునికి ఉండవలసిన అర్హతలను త్రోసిపుచ్చి, శివ ధనుస్సు విరిచిన భుజ శాలికే సీతాదేవిని ఇస్తానని జనకుడు చాటించడంలోని ఔచిత్యమేమిటి?**

**సమాధానం :**

శివ ధనుస్సును విరిచిన వానికి సీత నిస్తానని నిజానికి ఆ ధనుస్సును విరిచి తీరాలని జనకుడు అనలేదు. శివ ధనుస్సును ఎక్కుపెట్టిన పరాక్రమ వంతునికి తన కన్యనిస్తానని మాత్రమే ఆయన ప్రతిజ్ఞ చేశాడు.

అట్టి వీరత్వ పరీక్ష నిర్ణయించడానికి కారణాలు :-

(1) శివ ధనుస్సు యొక్క మహత్త్వం

(2) సీతాదేవి అయోనిజ కావడం.

దక్షయజ్ఞ సమయంలో శివుడు ఆగ్రహంతో ఎత్తిన విల్లు అది. త్రిలోక ప్రళయంకరమైన ఆ మహాదేవుని దేవతలు స్తోత్రం చేయగా ఆయన ప్రసన్నుడై ఆ ధనువును దేవతలకు ఇచ్చివేశాడు దేవతలు ఆ విల్లును దేవరాత మహారాజుకు న్యాసంగా ఇచ్చారు ఈ దేవరాతుడు జనక మహారాజు పూర్వీకుడు. నిమి చక్రవర్తి తర్వాత ఆరవ తరంవాడు. ఆ నాటినుండీ ఆ విల్లు వారి యింటనే ఉంది. ఈ గాథను వాల్మీకంలో బాలకాండ 66వ సర్గలో రామ లక్ష్మణుల సమక్షంలో జనక మహారాజు స్వయంగా విశ్వామిత్రునికి చెప్పాడు.

సాధారణంగా కారణ జన్ములైన మహనీయ వ్యక్తులు అయోనిజులుగా జన్మిస్తూ ఉంటారు. అగస్త్యుడు, వశిష్ఠుడు - వంటి అయోనిజులెందరో లోక కళ్యాణ కారకులై విలసిల్లారు. సీతాదేవి జన్మక్రమం కూడా అటువంటిదే.

అట్టి అయోనిజయైన సీతాదేవికి తగిన వరుని నిర్ణయించే భారం తాను వహించలేనని భావించాడు - జనక రాజర్షి. అంతేగాక, అతిలోక జన్మం కలిగిన సీతకు లోక సాధారణమైన ఏ ప్రమాణాల ఆధారంగానూ ఆమెకు వరుని ఎన్నిక చేయడం సరికాదనుకొన్నాడు.

కారణ జన్మురాలైన సీతకు తగిన వరుడు కూడా ఈ వృధ్విపై జన్మించే ఉంటాడని ఆ రాజయోగి విశ్వసించాడు పవిత్రమైన యాగ భూమిని

దన్నే సమయంలో లభించిన సీత దైవాంశనంభూతురాలు, వృద్ధిశక్తి. శ్రీ భూదే వుల అంశ గంది. మహిమాన్వితమైనదీ, సాక్షాత్తూ పరమేశ్వరుడు తన చేత ధరించినదీ అయిన శివ ధనువు - ఆ కారణ జన్ముడాలికి పరానేష్యణలో ఉపక రించ గలదని నమ్మిన జనకుని విశ్వాసం అక్షర సత్యమని ఋజువైంది.

62 ప్రశ్న : దశావతారాల్లో ఆరవది పరశురామావతారం. రామావ తారంలో పరశురామ గర్వభంగం ఉంది. ద్వాపర యుగంలో భీష్మ కర్ణులకు విలువిద్యలు నేర్పిన గురువు పరశురాముడే. ఈ ఇద్దరూ ఒకరేనా, ఇద్దరా?

63 ప్రశ్న : ఆంజనేయస్వామి త్రేతాయుగం, రామాయణానికి చెం దిన వాడు. మరి ద్వాపరంలో భారతంలోకూడా ఆయన ఉనికి ఎలాసాధ్యం?

సమాధానం :

"అశ్వత్థామా బలిర్వ్యాసో హనూమాంశ్చ విభీషణః।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః॥

సప్తైతాన్ సంస్మరేన్నిత్యం మార్కండేయ మధాష్టమమ్।
జీవేద్వర్ష శతం సాగ్ర మపమృత్యు వివర్జితః॥"

ఈ శ్లోక భావాన్ని అనుసరించి-అశ్వత్థామ, బలిచక్రవర్తి, వ్యాసమహర్షి, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు, పరశురాముడు మార్కండే యుడు వీరు ఎనమండుగురూ చిరంజీవులని చెప్పబడింది. ఆ కారణంగా-ఈ చిరంజీవులలోని వారైన పరశురాముడు, హనుమంతుడు-వివిధ యుగలకు చెందిన ఇతిహాసాలలో, గాధలలో దర్శనమీయడం విపరీతం ఏమీ లేదు. రామావతారంలో ఎదురైన పరశురాముడూ, ద్వాపర యుగంలో భీష్మకర్ణు లకు ధనుర్విద్యా గురువైన పరశురాముడూ-ఒక్కరే. దశావతారాలలోని పరశు రాముడే అతడు.

చిరంజీవిగా వరసిద్ధి పొందిన ఆంజనేయుడు-రామావతార కాలం తర్వాత గంధమాదన పర్వత గుహలలో తపస్సు చేసుకొంటూ మునివృత్తితో ఈనాటికీ ఉన్నాడనీ, ఆయన ఆవిధంగా కల్పాంతం వరకూ ఉండగలడని కంఠోక్తిగా వివిధ పురాణాలలో చెప్పబడి ఉంది.

ఆవిధంగా ఆంజనేయుడు గంధమాదన పర్వత ప్రాంతంలో ఉంటూ ఉండగానే-భీముడు సౌగంధికాపుష్పాలకోసం ఆ ప్రాంతం మీదుగా వెడుతూ దారిలో ఆయనను కలుసుకోగలిగాడు.

## 64 ప్రశ్న : పొట్టివానికి పుట్టెడు బుద్ధులు అంటారు అంటే ఏమిటి?

**సమాధానం :-**

పుట్టెడు బుద్ధులు - అనగా అపారమైన తెలివితేటలు కలిగిన జగత్ప్రసిద్ధులైన పొట్టివారు ముగ్గురున్నారు. వారు - విఘ్నేశ్వరుడు, అగస్త్యుడు, వామనుడు.

వీరు ముగ్గురూ—పొట్టి వారే అయినా—తాము సాధించిన ఘనవిజయాలతో లోక ప్రసిద్ధులు కాగలిగారు. వారి గాథలలో కొన్ని మాత్రం ఈ క్రింద ఇచ్చాను.

గౌరీశంకరుల ముద్దు బిడ్డలయిన గజాననుడు, కుమారస్వామి-ఒకప్పుడు విఘ్నాధిపత్యం కొరకు, ప్రమధ గణాధిపత్యం కొరకూ— పోటీపడ్డారు. వారి తగవును పరిష్కరించడం కొరకు ఆది దంపతులు— ఇరువురిలో ఎవరు ముందుగా— ప్రపంచ ప్రదక్షిణమూ, అందు గల సర్వ తీర్థాలలోనూ స్నానమూ— చేసి వస్తారో, వారే— విఘ్నాధిపత్యానికీ, ప్రమధగణాధిపత్యానికీ అర్హులని ప్రకటించారు. ఆ మాట వినడం తడవే మయూర వాహనుడైన కుమారస్వామి తన నెమలిపై ఎక్కి ఎగిరిపోయాడు. లంబోదరుడూ, స్థూలాతి స్థూలకాయుడూ అయిన గజాననుడు— తన శరీరంతో, ఎలుక వాహనంతో— శీఘ్ర గమనం ఎలా సాధ్యమని క్షణకాలం చింతించాడు. అతని సూక్ష్మ బుద్ధికి ఉపాయం స్ఫురించింది జగత్పితరులైన తన మాతాపితరులను

ముక్కోటి భక్తితో ప్రదక్షిణంచేసి-ప్రపంచ ప్రదక్షిణమూ, సర్వతీర్థస్నానమూ చేసిన ఫలాన్ని పొందగలిగాడు. అష్టాక్షరీమంత్రాన్ని జపించాడని పాఠాంతరం.

పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షిణం చేసి గజాననుడు పొందిన పుణ్య ఫలం వలన— ప్రతి తీర్థం వద్దనూ స్నానమాడబోయిన కుమారస్వామికి— ఆయా తీర్థాలలో గజాననుడు ముందుగానే స్నానం చేసి ఎదురుగా వస్తున్నట్లు తోచిందట. గజ వదనుడు ఆ విధంగా తన కుశాగ్ర బుద్ధితో తాను తలచిన కార్యాన్ని సాధించి— కోరిన ఫలాన్ని, పదవులనూ పొందగలిగాడు. గౌరీ శంకరులూ కుమారస్వామీ, సర్వదేవతా ప్రముఖులూ, లోక పాలకులూ కూడా అతనికి ఆమోద ముద్ర వేశారు. గజాననుడు— విఘ్నేశ్వరుడుగా, గణాధిపతిగా ప్రసిద్ధుడయ్యాడు.

ఆ తర్వాత కూడా గణపతి తన సూక్ష్మబుద్ధితో సాధించిన కార్యాలు అనేకం ఉన్నాయి.

అగస్త్యుడు సాధించిన ఘన కార్యాలు అనేకం. పూర్వం కాలకేయులు అనే రాక్షసులు దేవతలను అనేక విధాలుగా బాధించగా— దేవతల ప్రార్థనపై విష్ణుమూర్తి వారిని చంపబోయాడు అప్పుడా రాక్షసులు సముద్ర గర్భంలో దాగారు. అమరులు గత్యంతరం లేనివారై అగస్త్య మహర్షిని వేడగా— అగస్త్యుడు సముద్రాన్ని పుడిసిట పట్టి పానం చేసి— రాక్షసులను బయల్పరిచాడు. రాక్షస సంహారానికి మార్గం ఏర్పరచి— తమకు రాక్షస బాధ తొలగడానికి కారణమైన అగస్త్యుని దేవతలు కీర్తించారు.

మేరు పర్వతానికి నిత్య ప్రదక్షిణం చేసే సూర్యుడు - తన చుట్టూ మాత్రం ఎందుకు తిరగరాదనే అహంకారంతో— వింధ్య పర్వతం ఒకప్పుడు అమితమైన ఎత్తుకు పెరిగిపోయి— సూర్యాది గ్రహాల మార్గానికి అవరోధంగా నిలిచింది. ఆ కారణంగా— ప్రపంచంలోని సగభాగం నిత్య సూర్య కాంతి లోనూ, మిగిలిన అర్ధభాగం సదా అంధకారంలోనూ ఉండి పోవలసి వచ్చింది. దేవతా— ఋషి గణాల అభ్యర్థనపై— ఆ విపర్యయాన్ని తప్పించడానికి అగస్త్యుడు భార్యా సహితుడై వింధ్య పర్వతాన్ని సమీపించాడు. వింధ్యుడు — అగ

స్యుని చూచి నేలకువాలి నమస్కరించాడు. తనను చూచి అవనతుడైన వింధ్యుని— తాను తిరిగి వచ్చే వరకూ అలాగే ఉండమని అనతిచ్చి అగస్త్యుడు దక్షిణ దిక్కుకు తరలి పోయి— మరలి రాకుండా అక్కడే ఉండిపోయాడు. ఫలితంగా వింధ్యం అలాగే ఉండిపోయింది.

వాతాపి-ఇల్వలుడు-అనే రాక్షస సోదరులు-శ్రోత్రియ బ్రాహ్మణ రూపంలో ఉంటూ బ్రాహ్మణులను మోసగించి చంపి తింటుండేవారు. వాతాపికి-ఎన్ని ముక్కలుగా ఖండించి బడనా తిరిగి జీవించే వరం ఉంది. పితృకర్మలలో మేక మాంసాన్ని పెట్టడం ఆరోజులలో ఆచారంగా ఉండేది. పితృకర్మ కని చెప్పి బ్రాహ్మణులను ఆ మంత్రించేసి-మేక రూపం దాల్చిన వాతాపిని వండి పెట్టేవాడు-బ్రాహ్మణరూపధారియైన ఇల్వలుడు. వారు భుజించాక-"వాతాపీ! బయటకురా!" అని పిలిచేవాడు ఇల్వలుడు. ఆ బ్రాహ్మణుల పొట్ట చీల్చుకొని వాతాపి బయటకురాగా రాక్షసులిద్దరూ ఆ విప్రులను భక్షించేవారు.

అట్టి స్థితిలో ఋషులు, దేవతలు ప్రార్థించగాఅగస్త్యుడు ఆ ప్రాంతానికి చేరాడు. ఇల్వలుని ఆహ్వానంపై వానివద్దకువచ్చాడు, ఇల్వలుడు వాతాపిని వండి పెట్టగా తిన్నాడు అగస్త్యుడు. తన ప్రభావంతో వాతాపి శక్తిని నిర్వీర్యం చేసి, వాతాపిని అగస్త్యుడు తన గర్భ కుహరంలోనే జీర్ణించేసుకొన్నాడు, తాను పిలిచినా వాతాపి బయటకు రాకపోగా-అతనిని అగస్త్యుడు జీర్ణం చేసుకొన్నాడని తెలిసి-అగస్త్యుని ఎదుర్కొన్న ఇల్వలుడు-అగస్త్యుని క్రోధ దృష్టిలో భస్మం అయినాడు. వాతాపిని అంతం చేసిన అగస్త్యుని పట్ల భయంతో ఇల్వలుడు ఏమీ చేయడానికి సాహసించలేదని వాత్యాంతరం. అగస్త్యుని ప్రభావంవల్ల దక్షిణ దిక్కు అంటే రాక్షసులకు భయం ఏర్పడటమేగాక-ఆయన నివాసమైన ఆ దిక్కుకు "అగస్త్యదిక్కు" అని పేరు వచ్చింది.

మరొక అంశం— పార్వతీ పరమేశ్వరుల కల్యాణ సమయంలో జగత్తులోని సర్వులూ ఉత్తర దిక్కుకు పోగా— అగస్త్యుడొక్కడూ దక్షిణాన ఉండి భూమి యొక్క సమతూకాన్ని నిలిపాడట. అంతటి ప్రభావశాలి అగస్త్యుడు.

అనంతర కల్పంలో పొందవలసి ఉన్న ఇంద్రత్వాన్ని అప్పుడే పొందా

లని ప్రయత్నించి ముల్లోకాలనూ ఆక్రమించిన బలి చక్రవర్తిని— పాతాళానికి అణచివేశాడు వామనుడు వామనుడుగా యజ్ఞవాటికలో ప్రవేశించి, నేర్పుతో మూడడుగుల దానాన్ని పొంది— త్రివిక్రముడై విక్రమించాడు— "పొట్టివెన్నదు నెఱుగని పొట్టి వడుగు." ఆ వటువు బలి చక్రవర్తి యజ్ఞవాటికలో చూపిన చాతుర్యం అతనికే చెల్లు. ఆ వివరాలు విశదంగా వ్రాయాలంటే చాలా వ్రాయాలి.

ఈ విధంగా— సాన్యతో దర్శనీయమైన ప్రజ్ఞతో, నైపుణ్యంతో, బుద్ధి బలంతో, చాతుర్యంతో— అసాధ్య కార్యాలను చక్కబెట్టిన ఈ ముగ్గురు నేర్పరులూ పొట్టివారు కావడం వల్ల— లోకంలో ఈ సామెత స్థిరపడింది.

జ్యోతిశాస్త్రపరంగా కూడా— పొట్టితనానికి కారణమయే బుధగ్రహమే— బుద్ధి సూక్ష్మతకూ కారణం. ఈ అంశం కూడా ఈ సామెత ఏర్పడడానికి ఒక ఆధారం. ఒక్కొక్క గ్రహానికి కొన్ని కొన్ని కారకత్వాలు— జ్యోతిశాస్త్ర కర్తలైన మహర్షుల చేత ఏర్పరచబడ్డాయి. వానిలో— లోకజ్ఞత, సమయస్ఫూర్తి సూక్ష్మబుద్ధి, లౌకికమైన తెలివితేటలు— బుధగ్రహ కారకత్వాలలోనివి పొట్టితనం కూడా బుధగ్రహానిదే. బుధగ్రహకారకత్వం అధికంగా కలిగి జన్మించిన వారికి పై లక్షణాలన్నీ ఏర్పడుతాయి కనుక— వారు పొట్టివారై, పై లక్షణాలన్నీ కలిగి ఉండడంతో ఈ సామెతకు ప్రాచుర్యం ఏర్పడింది.

ఐతే— శనిగ్రహం వల్ల కూడా పొట్టివారుగా వ్యక్తులు జన్మిస్తారు. కానీ వారికి పైన చెప్పిన తెలివితేటలు ఉండవు. వారి లక్షణాలు మరొక విధంగా ఉంటాయి.

ఆ కారణం వల్ల— మొత్తంమీద లోకంలోని పొట్టివారంతా సూక్ష్మ బుద్ధులని చెప్పడానికి వీలులేదు కాని; ఆ విషయానికి సంబంధించిన సమాచారమూ, ఆ వాడుక ఏర్పడడానికి గల కారణాలూ మాత్రం ఈ పైన చెప్పినవి.

**65 ప్రశ్న :** దేవుని స్తోత్రం, జపం ఉచ్చైస్వరంతో చేయాలా? మనసులో చేస్తే చాలా?

సమాధానం :-

పరా, పశ్యంతీ - మధ్యమా, వైఖరీ - అనే 4 రూపాలలో వాక్కు వ్యక్తమౌతుంది.

అందులో మన వాక్వ్యాపారానికి సంబంధించినవి - మధ్యమా, వైఖరీ రూపాలు. జపం 3 విధాలు. వైఖరీ జపం, ఉపాంశు జపం, మానసిక జపం.

దైవారాధనలో మానసిక జపం, ఉపాంశు జపం, వైఖరీరూప జపం ఈ మూడింటిలో ఏది చేసినా, ఏ విధంగా చేసినా ఫలితం సిద్ధిస్తుంది. కానీ ఆ సిద్ధించే ఫలితంలో హెచ్చుతగ్గులుంటాయి.

వైఖరీరూప వాక్కు అనగా పైకి బిగ్గరగా పలికేది. ఉపాంశుజపం అనగా పెదవులు కదుల్చుతూ శబ్దం బయటికి వినబడకుండా జపించే విధానం. మానసిక జపం అనగా కేవలమూ మనస్సులోనే మననం చేస్తూ బాహ్యేంద్రియాల ప్రమేయం లేని జపం.

ఈ పై మూడు విధాలైన జపాలలో వైఖరీ, ఉపాంశు, మానసిక జప విధానాలు ఉత్తరోత్తర శ్రేష్ఠాలని ధర్మశాస్త్ర నిర్ణయం. అంటే ఇవి ఇదే వరుసలో ఒకదానికంటె ఒకటి ఉత్తమమైనవి.

అనగా వైఖరీ జపంకంటె ఉపాంశు జపమూ, దానికంటె మానసిక జపమూ- శ్రేష్ఠమైనవని చెప్పబడింది. వానివల్ల కలిగే ఫలంకూడా అదే వరుసలో ఉంటుంది, అనగా వైఖరీ జపం కంటె ఉపాంశు జపం వల్ల ఫలం ఎక్కువ. ఉపాంశు జపం కంటె మానసిక జపంవల్ల ఫలం ఎక్కువ.

## 66 ప్రశ్న : నాగపంచమి పర్వదినం ఏ విధంగా ఏర్పడింది?

సమాధానం :

నాగపంచమి పర్వదినం ఏర్పడిన గాథ - వరాహ పురాణం లోనిది.

పూర్వం కశ్యప ప్రజాపతికి - అతని భార్యయైన కద్రువయందు నాలుగు అనంతుడు, తక్షకుడు, వాసుకి, మహాపద్ముడు, మణినాగుడు, కాళీ

యుడు, ఏలాపుత్రుడు, ఉగ్రకుడు, శంఖుడు, కర్కోటకుడు, నహుష
పింగారకుడు, ధృతరాష్ట్రుడు, ఐరావతుడు, - మొదలైనవారు జన్మించారు.

అలా జన్మించిన నాలుగు మహా విషసహితాలై - అడ్డూ అపూ
లోకంలో కనిపించిన ప్రతి జీవిని కరచి చంపసాగాయి. చరాచర జీవులనె
తమ విషాగ్నికి బలిచేస్తూ సృష్టి వినాశకరంగా రూపొందిన నాగుల దుశే
లను గురించి - జనులంతాపోయి బ్రహ్మదేవునికి విన్నవించుకొన్నారు.

ఆగ్రహంతో - వాసుకి మొదలైన నాగులను తన సమ్ముఖానికి
తెప్పించాడు సృష్టికర్త.

ప్రపంచాన్నంతనూ విష కలుషితంచేసి, జగద్ద్రోహ కారకులుగా వ
మించారు కనుక - తల్లి శాపానికి గురై నశిస్తారు" అని శపించాడు - బ్రహ

"తామే మమ్ము విషయుక్తులుగా సృష్టించి - ఇప్పుడీ విధంగా శో
చడం న్యాయమా" - అని విన్నవించారు నాగులు.

"విషసహితంగా పుట్టించినంత మాత్రంచేత - విశ్వాన్ని సమస్త
నాశనం చేస్తారా? కాలం ప్రాప్తించిన వారినీ, మీకు నిష్కారణంగా అపకా
తలపెట్టినవారినీ తప్ప - ఇతరులను మీరు కరవరాదు. గరుడ మంత్ర
లనూ; ఔషధ, మణి సమేతులనూ తప్పుకొని సంచరించండి. సకల దే
విహంగ గణాలకు జ్ఞాతులైన మీరు - మీ అన్వయ స్థాన గౌరవాలను ని
కోండి. వాయు భక్షకులై సాధు జీవనులై మెలగండి. భూలోకాన్ని అ
కుతలం చేసే దుండగాలు మానండి. కరుణారహితాలైన పాపకృత్యా
విడచి గౌరవాన్ని పొందండి. మీకు నివాస స్థానాలుగా అతల వితల పా
లోకాలను ప్రసాదిస్తున్నాను"—అని పరమేష్ఠి శాసించాడు.

విధాత ఆజ్ఞ ప్రకారం చెప్పున సడచుకొన్న నాగులను భూలోకవా
కీర్తించారు. దివ్య ప్రభావ సంపన్నులయిన నాగులపట్ల కృతజ్ఞతా సూచకం
భక్తిపురస్సరంగా—నాగుల జన్మదినమైన నాగపంచమినాడు నాగులను అ
చడం ప్రారంభించారు. నాగపంచమి నాడు ఉప్పు, పులుపు తినడం వ

పెట్టి, నాగులను గోక్షీరంతో అభిషేకించి భక్తితో పూజించే పుణ్యాత్ములకు సర్పభయం ఉండబోదని చెప్పబడింది.

67 ప్రశ్న : కర్ణునికి ఆ పేరు ఎలా వచ్చింది? ఎవరు పెట్టారు?

సమాధానం :

సూర్యుని వరం వల్ల కుంతీదేవికి కన్యాత్వంలో జన్మించిన పుత్రుని, ఆమె ఆ వెంటనే ఒక మందసంలో ఉంచి, గంగానదిలో వదలివేసింది. ఆ బిడ్డకు జాతకర్మ నామకరణాదులు అక్కడ జరిగే అవకాశం లేదు. అతనసికి నామకరణం చేసినవారు అధిరథుడు, రాధ అనే సూత దంపతులు. (రథం తోలే వాళ్ని సూతులని పిలిచేవారు )

అనర్ఘరత్న, స్వర్ణమయమైన మందసంలో దొరికినందువల్ల - అబాలునికి 'వసుషేణుడు'-అని వారు నామకరణం చేశారు. ఈ వసుషేణుడనేదే కర్ణుని మొదటి పేరు.

రాధ బిడ్డగా పెరగడంవల్ల "రాధేయుడు"గా వ్యవహరించబడ్డాడు. (ఈ రాధ-శ్రీకృష్ణుని ప్రేయసియైన రాధకాదు. ఆమె వేరు.)

సహజ కవచకుండలాలతో జన్మించడం వల్లనూ, ఇంద్రుడు మాయా బ్రాహ్మణ వేషధారియై వచ్చి అర్థించినపుడు శరీరాన్ని చీల్చి ఆ కవచాన్నీ కర్ణకుండలాలనూ తీసి ఇచ్చినందువల్లనూ "కర్ణుడు" అని లోకులు పిలిచారు, ఇతనికి "వృషాకపి" అనే మరొక నామాంతరం కూడా ఉంది.

68 ప్రశ్న : ఋష్యశృంగుని తండ్రి స్త్రీని కన్నెత్తి చూడని వాడని అంటారు. మరి అతనికి ఋష్యశృంగుడెలా కుమారుడయ్యాడు?

సమాధానం :-

స్త్రీని కన్నెత్తి చూడని పరమ బ్రహ్మచారిగా ఋష్యశృంగుడే పేరొందాడు కాని, అతని తండ్రి కాదు. ఆయన తండ్రియైన విభాండక మహర్షికూడా

తీవ్ర నియమ నిష్ఠాయుత తపో గరిష్ఠుడైనాడు— ఆయనకు అయోనిజుడుగా ఋష్యశృంగుడు జన్మించినట్లుగా మహర్షి వాక్యం ఈ గాథ వ్యాస ప్రోక్తమైన భారతంలోనూ, వాల్మీకి రామాయణంలోనూ చెప్పబడింది.

ఆ విధంగా విభాండకునికి అయోనిజుడుగా జన్మించిన ఋష్యశృంగుని- ఆయన తండ్రి- ఋష్యాశ్రమంలో- వేరే ప్రపంచం తెలియకుండా పెంచాడు. ఋష్యశృంగుడు మహా తపస్విగా, పరమ నిష్ఠాగరిష్ఠుడుగా పేరు పొందాడు.

అనంతరకాలంలో అంగదేశంలో కరువు సంభవించింది. ఋష్యశృంగుడు ప్రవేశించిన రాజ్యంలో కరువుకాటకాలుండవని పండితులు- అంగ దేశాధిపతియైన రోమపాదునికి చెప్పారు.

ఋష్యాశ్రమం తప్ప మరొక ప్రపంచం తెలియని ఋష్యశృంగుని— పరివారాన్ని పంపించి రోమపాదుడు తన దేశానికి రప్పించుకొన్నాడు. తన కుమార్తెయైన శాంతను ఋష్యశృంగునికిచ్చి వివాహంచేసి— ఋష్యశృంగుని తన ఇంటనే నిలుపుకొన్నాడు రోమపాదుడు.

అనంతరకాలంలో దశరథుడు— ఈ ఋష్యశృంగుని ఆధ్వర్యంలోనే అశ్వమేధాన్ని పుత్రకామేష్టినీ చేసి సంతానాన్ని పొందాడు.

69 ప్రశ్న : వివాహానంతరం వధూవరులకు అరుంధతీ నక్షత్రాన్ని ఎందుకు చూపిస్తారు?

సమాధానం :-

పురాణాల్లో అరుంధతీ ప్రభావాన్ని ఎంతగానో ప్రస్తుతిస్తున్నాయి. ఆ గాథలివి:

ఒకప్పుడు— సప్తమహర్షులు యజ్ఞం చేస్తూ ఉండగా— ఆ ఋషుల భార్యలను చూచి అగ్నిదేవుడు మోహపరవశుడైనాడు. కానీ శాపభయంచేత తన అభిప్రాయాన్ని వెల్లడించలేక కృశించసాగాడు. అగ్ని అప్పుడు విచారంతో

విచారంతో వెళ్ళి అరణ్యంలో ఉండగా- అగ్ని భార్య అయిన స్వాహాదేవి అగ్ని మనస్సులోని ఉద్దేశాన్ని తెలుసుకొంది. స్వాహాదేవి తానే ఒక్కొక్క ఋషి పత్ని యొక్క రూపాన్ని ధరించి ఒక్కొక్కమారు వచ్చి-భర్తకు మనఃప్రియాన్ని చేకూర్చింది సప్తర్షుల భార్యలైన మిగిలిన ఆరుగురి రూపాలనూ స్వాహాదేవి ధరించగలిగింది. కానీ అరుంధతి రూపాన్ని స్వాహాదేవి ధరించలేకపోయింది. అరుంధతీదేవి అంతటి ప్రభావసంపన్న.

బ్రహ్మపుత్రికయైన సంధ్యాదేవి- శివుని అనుజ్ఞ స్వీకరించి- తనకు ఉపదేశం చేయగల బ్రహ్మచారి కొరకు అన్వేషిస్తూ- వశిష్ఠుని వద్దకు వచ్చి- ఆయన వల్ల ఉపదేశాన్ని స్వీకరించింది. ఆమె తన శరీరాన్నే అగ్నిహోత్రంలో హోమంచేయగా. ఆ అగ్నినుంచి ఉదయ సంధ్య, సాయంసంధ్య, వీరుగాక ఒక స్త్రీ- ఈ ముగ్గురూ జన్మించారు. ఆ స్త్రీయే అరుంధతి.

మరొక కల్పంలో కర్దమ ప్రజాపతికి, ఆయన భార్యయైన దేవహూతి యందు అరుంధతి జన్మించింది, కర్దమప్రజాపతికి, దేవహూతికి-జన్మించినవిష్ణవతారమైన కపిలుడు ఈమెకు సోదరుడు. కపిలుడు సాంఖ్యయోగ ప్రవర్తకుడు.

వశిష్ఠుడు వివాహమాడే ఉద్దేశంతో-తనకు తగిన కన్యను వెదుకుతూ ఇసుకను వండిపెట్ట గలిగిన వారెవరని ప్రశ్నిస్తూ సంచరిస్తుండగా-అరుంధతి తానాపని చేయగలనన్నది. ఆ ఇసుకను గిన్నెలోపోసి పరమేశ్వరుని ప్రార్థించింది ఆమె నిశ్చల భక్తి ఆ ఇసుక అన్నమయింది. వశిష్ఠుడు ఆమెను వివాహమాడాడు.

వశిష్ఠుడు తన కమండలాన్ని అరుంధతికి ఇచ్చి- తాను తిరిగివచ్చే వరకు దానిని చూస్తూ ఉండమని చెప్పి వెళ్ళాడు. అరుంధతి ఆ కమండలాన్నే స్థిరదీక్షతో చూస్తూ ఉండిపోయింది. సంవత్సరాల తరబడి వశిష్ఠుడు రానూ లేదు; అరుంధతి కమండలంనుండి దృష్టి మరల్చనూలేదు. అరుంధతి దీక్షా తీవ్రతకు విశ్వమంతా చలించింది. సృష్టికర్తయైన బ్రహ్మ, దేవతలతో కూడి వచ్చి అరుంధతి దృష్టిని మరలించే ప్రయత్నం చేశాడు. కాని అరుంధతి దృష్టిని ఎవ్వరూ మరలించలేకపోయారు. వశిష్ఠుడు వచ్చాకనే ఈమె తన దృష్టిని మరలించింది. అంతటి దృఢదీక్ష కలిగిన తపస్విని అరుంధతి.

వధూవరులకు అరుంధతీ నక్షత్ర దర్శనం చేయించే సమయంలో ఈ క్రింది మంత్రాన్ని చెబుతారు :

"సప్తర్షయః ప్రధమా కృత్తికానాం
అరుంధతీం యత్ ధ్రువతాం
"హావిమ్యః షట్కృత్తికా
ముఖ్య యోగం వహంతీయం"

షట్ కృత్తికలకు అధ్యూరాలిగా సప్తమహర్షులు ఈమెను సంభావించుట చేత ఆ మిగిలిన షట్కృత్తికలకు ప్రధానమైనదైన కలయికను — ఈ అరుంధతి నిర్వహిస్తున్నది — అని దీని భావం.

సౌభాగ్యానికి, మాంగళ్యానికి అధిదేవతయైన గౌరీదేవిని వధువుచేత వివాహానికి ముందుగా పూజింపజేయడం జరుగుతోంది.

సౌభాగ్యానికి గౌరీదేవిలాగానే, వధూవరులు దంపతులుగా ఏకమయే యోగానికి కారకురాలు, ఆ ఏకతా భావనకు అధిదేవత — అరుంధతి.

వశిష్ఠుడు ఎన్ని జన్మలు పొందినప్పటికీ, ప్రతిజన్మలోనూ ఆయనకు భార్య అయింది అరుంధతి నిత్యానపాయినిగా భర్తను వెన్నంటి ఉన్న అటువంటి అరుంధతీదేవికి వధూవరులచేత మ్రొక్కించడం సముచితం.

ఈ భార్యా భర్తలు కూడా ఆ విధంగానే జంట బాయక, అన్యోన్యానురాగంతో కలకాలం ఉండాలనే ఉద్దేశంతో ఆ విధంగా చేస్తారు.

యుగయుగాలకూ విడివడక, నక్షత్ర మండలంలో స్థానం పొందిన పునీతులు, ఋషి దంపతులు అరుంధతీ వశిష్ఠులు. సీతారాముల నమస్సులు సైతం అందుకున్నవారు. దంపతు లందరికీ పూజనీయులు.

మరణం ఆసన్నమైన వానికి అరుంధతి కనిపించదని చెప్పబడింది. దీనికి ప్రమాణం ఉంది.

ఐతే - నూతన వరునికి గాని, వధువుకుగాని అరుంధతి కనిపిస్తున్నదా లేదా అని ప్రశ్నించి - ఆ రీత్యా 1. వారు ఆసన్న మరణులు కాదని, 2. వారి

ంటిచూపు బాగున్నదనీ - పరీక్షించి తెలుసుకొనడానికేనని కొందరు చెబుతారు. నీ ఇది సత్యం కావడానికి అవకాశంలేదు. ఎందువల్లనంటే - అరుంధతి వారికి నిపిస్తున్నదా లేదా - అనే విషయం - వారు చెబితేనే కాని ఇతరులు తెలుసుకో నిది. కనుక ఆ విషయంలో వారు చెప్పిన దానిని నమ్మడం తప్ప - కాదని రూపించే మార్గం ఏదీలేదు. మరొక విషయం - ఇటువంటి పరీక్షలు వివాహ ర్యానికిముందుగా చేయవలసినదే తప్ప, వివాహ విధి సంపూర్ణమైనాక ఇట్టి రీక్షలు చేసినా వినియోగం లేదు.

కనుక - వివాహానంతరం అరుంధతిని చూపడం - ఆ పూజ్యురాలికి దూవరులచేత నమస్కరింపజేయడానికి, నూతన వధూవరులకు అరుంధతీ శిష్ఠులను ఆదర్శంగా చూపి, వారిమధ్య స్థిరమైన అనురాగాన్ని కలిగించ ానికే నన్నది నిశ్చయం.

0 ప్రశ్న : పురాణ పురుషులు కూడా కొన్ని సందర్భాలలో శత్రువు లను మాయోపాయంతో జయించినట్లు, వధించినట్లు కన బడుతుంది కదా? ఇది సమర్థనీయమేనా?

మాధానం :

పరిశుభ్రమైన తెల్లని వస్త్రంపై ఒక చిన్న మరకపడినా, అది అందరికి ్పష్టంగా కనిపిస్తుంది. నల్లని వస్త్రంపై ఎన్ని మరకలున్నా ఎవరికీ కనిపిం దు. ఎవరూ దానిని ప్రత్యేకంగా పట్టించుకోరు కూడా. తెల్లని వస్త్రంపై ఉన్న మరకనే ప్రత్యేకించి పట్టించుకుంటారు. వెంటనే గుర్తించి వ్యాఖ్యానిస్తారు.

ఆ విధంగానే దుర్మార్గుల యొక్క అసంఖ్యాకాలైన దుశ్చేష్టితాలను వరూ పట్టించుకోరు. సహజంగా సజ్జనులైన వ్యక్తులు - పొరపాటు వల్లనో, ్యంతరం లేని పరిస్థితులలోనో చేసిన ఏ ఒక్క చర్యనో పదే పదే ఎత్తి ూపుతుంటారు. అది మినహా వారి యొక్క వ్యక్తిత్వం ఎటువంటిదని పరిశీ ంచరు. అంతేకాదు, అది నిజంగా తప్పిదమా, తప్పిదంలాగా పైకి కనిపించే ర్మ బద్ధమైన చర్యేనా - అని కూడా యోచించరు. తోచుగా పరిశీలించకన్నే ్యాఖ్యానిస్తారు.

వధూవరులకు అరుంధతీ నక్షత్ర దర్శనం చేయించే సమయంలో ఈ క్రింది మంత్రాన్ని చెబుతారు :

"సప్తర్షయః ప్రధమా కృత్తికానాం
అరుంధతీం యత్ ధ్రువతాం
"హావిమ్యః షట్కృత్తికా
ముఖ్య యోగం వహంతీయం"

షట్ కృత్తికలకు ఆద్యులుగా సప్తమహర్షులు ఈమెను సంభావించుట చేత ఆ మిగిలిన షట్కృత్తికలకు ప్రధానమైనదైన కలయికను — ఈ అరుంధతి నిత్యహిస్తున్నది — అని దీని భావం.

సౌభాగ్యానికి, మాంగళ్యానికి అధిదేవతయైన గౌరీదేవిని వధువుచేత వివాహానికి ముందుగా పూజింపజేయడం జరుగుతోంది.

సౌభాగ్యానికి గౌరీదేవిలాగానే, వధూవరులు దంపతులుగా ఏకమయే యోగానికి కారకులాలు, ఆ ఏకతా భావనకు అధిదేవత — అరుంధతి.

వశిష్ఠుడు ఎన్ని జన్మలు పొందినప్పటికీ, ప్రతిజన్మలోనూ అతనకు భార్య అయింది అరుంధతి నిత్యానపాయినిగా భర్తను వెన్నంటి ఉన్న అటువంటి అరుంధతీదేవికి వధూవరులచేత మ్రొక్కించడం సముచితం.

ఈ భార్యా భర్తలు కూడా ఆ విధంగానే జంట బాయక, అన్యోన్యాను రాగంతో కలకాలం ఉండాలనే ఉద్దేశంతో ఆ విధంగా చేస్తారు.

యుగయుగాలకూ విడివడక, నక్షత్ర మండలంలో స్థానం పొందిన పునీతులు, ఋషి దంపతులు అరుంధతీ వశిష్ఠులు. సీతారాములు నమస్సులు సైతం అందుకున్నవారు. దంపతు లందరికీ పూజనీయులు.

మరణం ఆసన్నమైన వానికి అరుంధతి కనిపించదని చెప్పబడింది. దీనికి ప్రమాణం ఉంది.

ఐతే - నూతన వరునికి గాని, వధువుకుగాని అరుంధతి కనిపిస్తున్నదా లేదా అని ప్రశ్నించి - ఆ రీత్యా 1. వారు ఆసన్న మరణులు కాదనీ, 2. వారి

కంటిచూపు బాగున్నదనీ - పరీక్షించి తెలుసుకొనడానికేనని కొందరు చెబుతారు. కానీ ఇది సత్యం కావడానికి అవకాశంలేదు. ఎందువల్లనంటే - అరుంధతి వారికి కనిపిస్తున్నదా లేదా - అనే విషయం - వారు చెబితేనే కాని ఇతరులు తెలుసుకో లేనిది. కనుక ఆ విషయంలో వారు చెప్పిన దానిని నమ్మడం తప్ప - కాదని నిరూపించే మార్గం ఏదీలేదు. మరొక విషయం - ఇటువంటి పరీక్షలు వివాహ నిర్ణయానికిముందుగా చేయవలసినదే తప్ప, వివాహ విధి సంపూర్ణమైనాక ఇట్టి పరీక్షలు చేసినా వినియోగం లేదు.

కనుక - వివాహానంతరం అరుంధతిని చూపడం - ఆ పూజ్యురాలికి వధూవరులచేత నమస్కరింపజేయడానికి, నూతన వధూవరులకు అరుంధతీ వశిష్ఠులను ఆదర్శంగా చూపి, వారిమధ్య స్థిరమైన అనురాగాన్ని కలిగించడానికే నన్నది నిశ్చయం.

**70 ప్రశ్న :** పురాణ పురుషులు కూడా కొన్ని సందర్భాలలో శత్రువులను మాయోపాయంతో జయించినట్లు, వధించినట్లు కనబడుతుంది కదా? ఇది సమర్థనీయమేనా?

**సమాధానం :**

పరిశుభ్రమైన తెల్లని వస్త్రంపై ఒక చిన్న మరకపడినా, అది అందరికి స్పష్టంగా కనిపిస్తుంది. నల్లని వస్త్రంపై ఎన్ని మరకలున్నా ఎవరికీ కనిపించదు. ఎవరూ దానిని ప్రత్యేకంగా పట్టించుకోరు కూడా. తెల్లని వస్త్రంపై ఉన్న మరకనే ప్రత్యేకించి పట్టించుకుంటారు. వెంటనే గుర్తించి వ్యాఖ్యానిస్తారు.

ఆ విధంగానే దుర్మార్గుల యొక్క అసంఖ్యాకాలైన దుశ్చేష్టితాలను ఎవరూ పట్టించుకోరు. సహజంగా సజ్జనులైన వ్యక్తులు - పొరపాటు వల్లనో, గత్యంతరం లేని పరిస్థితులలోనో చేసిన ఏ ఒక్క చర్యనో పదే పదే ఎత్తి చూపుతుంటారు. అది మినహా వారి యొక్క వ్యక్తిత్వం ఎటువంటిదని పరిశీలించరు. అంతేకాదు, అది నిజంగా తప్పిదమూ, తప్పిదంలాగా పైకి కనిపించే - ధర్మ బద్ధమైన చర్యేనా - అని కూడా యోచించరు. లోతుగా పరిశీలించకన్నే వ్యాఖ్యానిస్తారు.

రామాయణంలో కైక- దురాలోచనతో, చెప్పుడు మాటలకు లోనై కోరిన వరాల వల్ల- దశరథుడు చనిపోయాడు. అది అన్యాయం కాదా? అంతే కాదు. ఆ వరాల దుష్పరిణామంగా దశరథరాజ సంతానమైన రామ లక్ష్మణులే గాక- జనక చక్రవర్తి కూతురైన సీత కూడా అడవుల పాలైంది. వారి జీవితాలలో ముఖ్యమైన యౌవన దశ అంతా అరణ్యాలలోనే గడిచింది. భోగ భాగ్యాలతో తులతూగవలసిన వారు అడవులలో క్రూరమృగాల మధ్య దుర్భర జీవితాన్ని గడిపారు. వారికి జరిగిన ఆ నష్టానికి పరిహారం ఏమిటని ఎవరూ ప్రశ్నించరు. అడవిలో రక్షణ లేకుండా ఉండడం చేతనే సీత రావణుని చేత చిక్కడం, ఆ సంఘటన ఆమె జీవితం పైన చెరగని ముద్ర వేయడం, అగ్ని ప్రవేశం చేసి కూడా ఆమె ఆ కళంకం నుంచి విముక్తురాలు కాలేకపోవడం, ఆ కారణంగానే మరొకమారు కూడా పుట్టెడు నింద నెత్తిన వేసుకొని- పూర్ణ గర్భిణిగా ఉన్న సీత అడవిపాలు కావడం- ఇలా ఇవన్నీ కేవలం కైక కోరిక మూలంగానే జరిగాయి. ఈ విధంగా నష్టం జరిగిన వారికి ఎవరు పరిహారం చెల్లిస్తారు?

ఇక భారతంలో పాండవులు నిజమైన రాజ్యాధికారం కలిగి ఉండికూడా- ధార్తరాష్ట్రుల ఓర్వలేనితనంవల్ల ఎన్నో కష్టాలు అనుభవించారు. దుర్యోధనుని అసూయ కారణంగా వారుపడరాని పాట్లు పడ్డారు. నష్టపోయిన కాలాన్ని వారికి ఎవరు పరిపూర్తి, పరిహారం చేస్తారు- అని ఎవరూ అడగరు. ఎవరికీ అపకారం చేయని సీతారాములు, ఊర్మిళా లక్ష్మణులు, పాండవులు, ద్రౌపది- ఇట్టివారంతా తాము చేయని తప్పులకు బలై, వారి జీవితాలు జీవితకాలం కష్టమయం కావడం అన్యాయం కాదా?- అని ఎవరూ ఆలోచించరు. (ఇక్కడ అవతార ప్రయోజనం, దివ్యత్వం- మొదలైన అంశాలను విడిచిపెట్టే ఇటువంటి చర్చలోకి దిగడం జరుగుతుంది కనుక - వాటి ప్రసక్తి ఇక్కడ అనవసరం.)

దీనికి కారణం - ఈనాటి సినిమాలు దొంగలను, హంతకులను, సంఘ వ్యతిరేక శక్తులనూ గ్లోరిఫై చేయడమే. అటువంటి భావాలు మనసులో హత్తుకు

పోయిన జనులకు- దుర్యోధనాదులు ఆరాధ్యులుగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు.

జీవితమంతా దుష్టభావాలలో, దుష్ట చింతనతో, పరపీడన పరాయణులై గడిపిన వారిని ఉత్తములుగా కీర్తించడం; సహజంగా సజ్జనులై ఉండి, సత్ప్రవరన కలిగి ఉండిన ఉత్తమ జీవితాలలోని ఏ ఒక్క విషయాన్నో పట్టుకొని తూర్పార పట్టడం- ఈనాటి నాగరికతగా మారింది. దీనినే రంధ్రాన్వేషణం అని అంటారు.

71 ప్రశ్న: భోజనం చేసే సమయంలో బిచ్చగాళ్ళు వస్తే- తప్పకుండా భిక్ష వేయాలంటారు. పితృతిథి రోజున భిక్ష వేయరు. వీటికి కారణాలు ఏమిటి?

సమాధానం :-

"అభ్యాగతః స్వయం విష్ణుః" అనేది సనాతన భారతీయ విశ్వాసం. తమంత తాముగా ఇంటికి వచ్చిన వారైనా ఆహ్వానించగా వచ్చినవారైనా - ఆ అతిథి అభ్యాగతులను సాక్షాత్ భగవత్ స్వరూపులుగా భావించి అర్చించడమే మన సంప్రదాయం. ఆ సత్సంప్రదాయం అంతవరకే పరిమితంకాలేదు. భోజన సమయాన వాకిటిలో ఏ బిచ్చగాడో వచ్చినాసరే ఆ భిక్షకుని ఆదరించి భోజనం పెట్టవలసినదే.

"అతిథౌ తిష్ఠతి ద్వారే హ్యాపో గృహ్ణాతియోనరః।
ఆపోశనం సురాపాన మన్నం గోమాంస భక్షణం॥"

అని ఆర్యోక్తి.

భావం :- "అతిథి వాకిట నుండగా గృహస్థుడు ఉదకమైనా స్వీకరించరాదు. అట్లు స్వీకరించిన జలము సురాపానంగానూ అన్నం తిన్నట్లయితే అది గోమాంస భక్షణంగానూ అవుతుంది - అని పై శ్లోక భావం

శిష్టాచారవంతుల గృహాలలో ఒక సంప్రదాయముంది. భోజనవేళ వీథి వాకిలి తలుపు వేసేముందు అటూ ఇటూ కలయ చూచి మరీ తలుపులు మూయాలి. కారణం అక్కడ ఎవరైనా అన్నార్తులు ఉన్నట్లయితే వారిని ఉపేక్షించరాదనీ తప్పక వారికి ఆహారం ఇవ్వాలనీ ఉద్దేశం. మానవులకే కాక

ప్రతి దినమూ గృహస్థుడు కాకబలి, శ్వానబలి ఇత్యాది వంబలులను ఇచ్చి భూత యజ్ఞాన్ని నిర్వహించిన అనంతరం మాత్రమే భుజించాలని స్మృతులు నిర్దేశించాయి.

అయితే పితృ తిథినాడు మాత్రం - పితృకార్యం అయేంత వరకూ ఆ గృహంనుండి ఎవరికీ ఏమీ ఇవ్వరాదు. మనకు ఒక సంవత్సర కాలం పితరులకు ఒకరోజు అవుతుందని చెప్పబడింది. ప్రతిసంవత్సరం పితృకార్యం చేయడం - వారికి అనుదినమూ భోజనం పెట్టడమే. ఆనాడు తమవారిని చూడ గోరిన పితరులు ఏదో ఒకరూపంలో వస్తారనే నమ్మకం ఉంది. కాబట్టి వారిని సమగ్రంగా అర్చించకుండా ఏ తృణమో ఇచ్చి పంపడం అవుతుందనే అభి ప్రాయం ఒకటి. రెండవది - పితృ తిథినాడు పితృదేవతార్చనమే ముఖ్యం గనుక - అంతకంటే ముందుగా ఎవరికి ఏమీ ఇవ్వరాదనే సాధారణ ధర్మాలు ప్రత్యేక సందర్భాలలో పట్టవు. కనుకనే పితృ తిథినాడు పితృదేవతార్చనం కాకముందు ఇతరులెవ్వరికీ ఆ గృహంనుంచి ఏమీ ఇవ్వరాదని నిర్దేశించ బడింది. సాధారణ ధర్మమైన అతిథిపూజ- ఆనాడు పితృదేవతార్చనం బిన తర్వాతనే చేయాలి.

**72 ప్రశ్న : బ్రహ్మర్షులు, మహర్షులు, రాజర్షులు అని అంటూ ఉంటారు. ఇవి ఋషులలోని భేదాలా ?**

సమాధానం :

అవును. అవి ఋషులలోని భేదాలే. ఋషులు ఏడు విధాలు. తపస్వు లంతా ఋషులు కారు. వేదఋక్కులను దర్శించినవారే ఋషు లనబడతారు. ఆ ఋషులలోని భేదాలు ఈ క్రిందివి.

1. మహర్షులు : వ్యాస మహర్షి మొదలైనవారు.
2. పరమర్షులు : భేలర్షి మొదలైనవారు.
3. దేవర్షులు : కణ్వుడు మొదలైనవారు.
4. బ్రహ్మర్షులు : వశిష్ఠుడు మొదలైనవారు.
5. శ్రుతర్షులు : సుశ్రుతుడు మొదలైనవారు.

6. రాజర్షులు : ఋతుపర్ణుడు, అంబరీషుడు, జనకుడు- మొదలైనవారు.

7. కాండర్షులు : జైమిని మొదలైనవారు.

ఋషి, ముని, తపస్వి - ఇత్యాది పదాలను ఒకే అర్థంలో పర్యాయ పదాలుగా వాడుతుంటారు. కానీ ఈ పదాలకు వేర్వేరు అర్థాలున్నాయి. తపస్వు లందరూ ఋషులు కారు కారు. తపోవృత్తిలో ఉన్న వ్యక్తి తపస్వి. మౌన నియమం కలిగినవాడు ముని. వేద ఋక్కులను దర్శించినవాడు ఋషి.

73 ప్రశ్న : సప్త మహర్షులెవరు? ఎవరు, ఏ విధంగా- వీరిని నిర్ణయిస్తారు?

సమాధానం :-

సప్తమహర్షుల మండలి- ఒక పదవికి సంబంధించినది. ఈ పదవులతో ఎల్లప్పుడూ ఒక్కరే స్థిరంగా ఉండడం జరగదు.

మన్వంతరానికొక మారు సప్త మహర్షి మండలి మారుతూ ఉంటుంది. విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు- ఇత్యాది లోక పాలకులు- ప్రతి మన్వం తరం లోనూ ఉండవలసిన సప్తమహర్షి మండలిని నిర్ణయం చేస్తారు.

ఈ క్రింది వారు ఒక్కొక్క మన్వంతరంలోనూ సప్త మహర్షులుగా ఉండే వారు.

స్వాయంభువ మన్వంతరంలోని సప్త మహర్షులు :- మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు.

స్వారోచిష మన్వంతరంలోని మహర్షులు :- ఔర్వుడు, వశిష్ఠ పుత్రుడు, స్తంభుడు, కశ్యపుడు, ప్రాణుడు, బృహస్పతి, దత్తాత్రేయుడు, చ్యవనుడు, అత్రి. (ఒక్కొక్కప్పుడు వీరి సంఖ్య పెరగనూ వచ్చును, తగ్గనూ వచ్చును )

ఉత్తమ మనువు కాలంలో మహర్షులు :- వశిష్ఠ మహర్షి భార్యయైన ఊర్జయందు జన్మించిన ఏడుగురు వాసిష్ఠులు. (వీరికి పారబ్యగత్పులనే నామాంతరం కూడా ఉంది.)

తామస మనువు కాలంలోని మహర్షులు :- వృదుడు, కావ్యుడు, అగ్ని, జహ్నుడు? ధాత, కపీవంసుడు, అకపీవంసుడు.

రైవత మన్వంతరంలోని సప్త మహర్షులు :- యదుధ్రుడు, వేదశిరుడు, హిరణ్యరోముడు, పర్జన్యుడు, ఊర్ధ్వబాహుడు, సత్యనేత్రుడు, దేవబాహుడు.

చాక్షుష మన్వంతరంలోని సప్త మహర్షులు :- భృగుడు, నభుడు, వివస్వంతుడు, సుధాముడు, విరజుడు, అతినాముడు, సహిష్ణుకు

వైవస్వత మన్వంతరంలోని సప్తమహర్షులు :- కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వసిష్ఠుకు, జమదగ్ని,

సూర్యసావర్ణిక మనువుకాలంలోని మహర్షులు:-పరశురాముడు, వ్యాసుడు, ఆత్రేయుడు, దీప్తిమంతుడు, ఋష్యశృంగుడు, భరద్వాజుడు, అశ్వత్థామ.

బ్రహ్మసావర్ణిక మన్వంతరంలోని మహర్షులు :- గౌతముడు, అజరుడు, శరద్వంతుడు, కౌశికుడు, కాశ్యపుడు, ఔర్వుడు.

దక్షసావర్ణిక మన్వంతరంలోని మహర్షులు :- మేధా తిథి, వసువు, సత్యుడు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, హవ్యవాహనుడు.

రుద్రసావర్ణిక మన్వంతరంలోని మహర్షులు :- ద్యుతి, తపస్వి, సుతపుడు, తపోమూర్తి, తపోధనుడు, తపోనిధి, తపోధృతి.

'మహర్షి'-అనేది ఒక పదవి. ప్రతి మన్వంతరంలోనూ - కొంతమంది మహర్షులుగా నిర్ణయించబడి - మహర్షులనే ఆ పదవులలో నియమించబడతారు. సాధారణంగా వీరు ఏడుగురుగా ఉండడం జరుగుతుంది. కానీ ఈ సంఖ్య ఒక్కొక్కప్పుడు మారవచ్చు. వీరి సంఖ్య కొంత పెరగడం, లేదా తగ్గడం జరుగవచ్చు.

ప్రస్తుతం వైవస్వతమన్వంతరం నడుస్తున్నది.

**74 ప్రశ్న : తన యాగరక్షణకుగాను తీసుకొని వెళ్ళిన రామలక్ష్మణులను విశ్వామిత్రుడు తిరిగి అయోధ్యకు తీసుకొని రాకుండా మిథిలకు తీసుకొని వెళ్ళడంలో, విశ్వామిత్రునికి ప్రత్యేకంగా ఏమైనా అభిప్రాయం ఉండి ఉంటుందా?**

సమాధానం :

తన యజ్ఞ రక్షణకుగాను రామలక్ష్మణులను తెచ్చిన విశ్వామిత్రుడు - తన యజ్ఞం పూర్తికాగానే - జనక చక్రవర్తియొక్క యజ్ఞం చూడదానికనే కారణంతో రామలక్ష్మణులను వెంటపెట్టుకొని మిథిలకు బయలుదేరాడు. వాచ్యంగా చెప్పకపోయినా - ఆ చర్యలో విశ్వామిత్రునికి గూఢమైన ఒక ఉద్దేశం ఉన్నదని చెప్పడానికి తగిన ఆధారాలు వాల్మీకంలో కనిపిస్తాయి.

సిద్ధాశ్రమంలో బయలుదేరుతూ రామునితో "జనకుని గృహంలో ఒక ధనస్సు ఉన్నది. దానిని నీవు చూడవచ్చును" - అని విశ్వామిత్రుని అనుమతితో ఆయన వెంట ఉన్న తాపసులలో ఒకరు అన్నారట. ఇది సాభిప్రాయమయి నట్లూ విశ్వామిత్రుని సంకల్పరూపమైనట్లూ - స్ఫురిస్తుంది.

మిథిలలో తనకు స్వాగత సత్కారాలు చేయవచ్చిన జనక చక్రవర్తితో విశ్వామిత్రుడు ఇలా అన్నాడు "జనక మహారాజా! వీరిద్దరూ దశరథ రాజ పుత్రులు. నీ ఇంట ఉన్న శివధనువును చూడవలెననే కుతూహలంతో వీరు నా వెంట వచ్చారు. నీవు ఆ ధనువును వీరికి చూపించు. నీకు శుభం కలుగు తుంది. వీరన్నా కృతకాములై యథేచ్ఛగా వారి నగరానికి వెళ్ళిపోతారు." - అని పలికిన విశ్వామిత్రుని ఈ మాటలు భావగర్భితాలుగా కనబడతాయి.

విశ్వామిత్రుని ఈ చర్యలన్నిటికీ వెనక ఉన్న ఉద్దేశం సీతారామ కల్యాణం చేయించడమే.

75 ప్రశ్న : బమ్మెర పోతన్నకు ప్రత్యక్షమైన శ్రీరాముడు, రామాయ ణాన్ని కాకుండా, భాగవతాన్ని అనువదించమని ఆదేశించ డమేమిటి?

సమాధానం :

శ్రీమదాంధ్రమహాభాగవత ప్రారంభంలోనే పోతన్నగారు-తన నివాసం స్వయంభూలింగేశ్వరుని నివాసమైన ఏకశిలానగరమనీ, తన తండ్రియైన కేసనమంత్రి "శైవాచార సంపన్ను"డనీ, తన తల్లియైన లక్కమాంబ "సదా

శివ పాదయుగార్చనా సక్తు"రాలనీ, తన అన్నగారైన తిప్పన్నగారు "ఈశ్వర సేవా పరాయణు"డనీ, వివరించి ఉన్నారు. అంతేగాక, తానుసైతం "పరమే శ్వర కరుణా కలిత కవితా విచిత్రుడ"నని కూడా స్పష్టంగాచెప్పారు. అటువంటి పరమ మహేశ్వర గృహంలో పుట్టిన పోతన్నగారు శ్రీరామభక్తులు కావడమే ఒక విచిత్రం.

అంతేగాక, శ్రీరాముడు పోతనను భాగవత రచన కాదేశించిన సన్ని వేశం మరింత వింత. "శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలు" డైన తాను, "మహనీయ మంజుల పులినతల మండపంబున," "మహేశ్వర ధ్యానతత్పరుడై" యుండగా, "మెరుగు చెంగటనున్న మేఘంబు కైవడి, ఉవిద చెంగటనుండ నొప్పువాడు"- ఆ సీతా సహితుడైన శ్రీరామభద్రుడు పోతన్న గారికి ప్రత్యక్షమైనాట. పోతన్నగారు వ్రాయదలచుకొన్నది శ్రీమన్నారాయణ కథలను: ఆయన ధ్యానించినది మహేశ్వరుని: ఆయనకు దర్శన మిచ్చినది - శ్రీరామచంద్రుడు: అట్టి సీతారాముడు - "మన్నామాంకితంబుగా భాగవతంబు తెనుంగు సేయుమని" పోతన్నగారికి ఆనతిచ్చాడు. ఆ రాముడు - తనకు కృతి నీయమన్న భాగవత గ్రంధాన్ని షష్ఠ్యంతాలలో పోతన్నగారు -

'హారికి నందగోకుల విహారికి.... ఘోషకుటీవయోఘృతాహారికి.... "గోపాల కృష్ణునికి"సమర్పితంబుగా శ్రీ మహాభాగవత పురాణంబును నేనాం ధ్రంబున రచియింపంబూని"నట్లుగా తామే చెప్పుకొనియున్నారు.

ఈ విషయాలన్నిటి సారాంశం ఏమంటే - పోతన్నగారు - శ్రీమన్నా రాయణునికి, మహేశ్వరునికి; శ్రీరామునికి, శ్రీకృష్ణునికి - ఈ మూర్తులకు ఎవ్వరికీ భేదంలేదనే పరమ అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించదలచుకొన్నారు.

"శివాయ విష్ణు రూపాయ"- అనే ఆర్ష దృష్టి పోతన్నగారిది. "విష్ణు రూపాయ నమశ్శివాయ" యను వైదిక ధ్యాయితను భక్త జన హృదయాలలో పొందుపరచదలచుకొన్న భక్తకవి ఆయన.

"చేతులారంగ శివుని పూజింపడేని
"నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని...."

అని అనడంలో కూడా ఆ శివకేశవా భేద భావమే పోతన్నగారు ధ్వనింప జేశారు. అది సహృదయ హృదయైక వేద్యం.

శివకేశవులకు భేదం లేదనే తన అభిప్రాయాన్ని ప్రత్యక్షంగా చెప్ప కుండా- పాఠకజనులకు ధ్వనింపజేశారు పోతన్నగారు. పోతన్నగారికి పూర్వీకు లైన నన్నయ తిక్కనాదులచే భాగవతం ఆంధ్రీకరింప బడక- ప్రతి పద్యాన్నీ భక్తి పీయూష మాధుర్యంలో ఓలాలాడించిన పోతన గారి చేత పడటం ఆంధ్రుల పూర్వకృత సుకృత విశేషం.

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్ తెనుగుం జేయుచ మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం తెనిగించి నా జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్." -అన్న పోతన్నగారి పలుకులు- సర్వులూ అంగీకరించ వలసినవి.

## 76 ప్రశ్న: శ్రీరాముడు దేవుడని కొందరూ, మానవుడే అని కొందరూ అంటారు. ఇంతకూ ఏది నిజం?

సమాధానం:

"వేద వేద్యే పరేపుంసి జాతే జాతే దశరధాత్మజే।
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా॥"

వేదవేద్యుడైన పరమ పురుషుడే దశరధాత్మజుడుగా అవతరించాడు. వేదమే సాక్షాత్తు రామాయణంగా ఆవిర్భవించింది-అని భావం.

"సహి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః।
అర్థితో మానుషేలోకే జజ్ఞే విష్ణు స్సనాతనః॥-"

రావణవధార్థమై, దేవతలు ప్రార్థించగా, భూమిపై అవతరించిన సనాతనుడైన విష్ణువే శ్రీరాముడు-అని అయోధ్యకాండలో చెప్పబడింది.

ఈ విధంగా రాముడు సాక్షాత్ విష్ణ్వవతారమే నని నిస్సందేహంగా చెప్పబడినప్పటికీ, తాను దైవమనే స్పృహ లేని వాడు రాముడు.

రామాయణ కావ్యమంతటిలోనూ ఆయన మానవుడుగానే దర్శన మిస్తాడు.

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం-"అని తనంత తానే చెప్పుకొన్నాడు.

రావణ సంహారానంతరం దేవతలంతా దిగి వచ్చి, ఆయనను పరమ పురుషుడవని ప్రశంసించగా ఆయన ఇచ్చిన సమాధానమది.

దైవంగా కంటె, మానవునిగా ప్రజాహృదయాలకు దగ్గరైన వాడు శ్రీరాముడు.

అతడు ఉత్తమపుత్రుడుగా తండ్రిమాటను పరిపాలించినవాడు. మంచి అన్నగా తమ్ములను ప్రేమించేవాడు. హృదయాన్ని ఇచ్చి పుచ్చుకొనే ప్రియ భర్త. భార్యా విరహంలో ఆవేదనతో అల్లాడిపోయే విరహి. ఆదర్శమిత్రుడు. అయా కఠిన సన్నివేశాలలో క్రుంగిపోతాడు; తిరిగి ధైర్యం వహించి పరిస్థితులను ఎదుర్కొంటాడు; విజయాన్ని సాధిస్తాడు.

"పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః" అని భవభూతి మహాకవి రాముడిని గూర్చి అభివర్ణిస్తాడు. దుఃఖాన్ని దిగమ్రింగుకొని తమబాధలను తామే అనుభవిస్తూ పుటపాకమువలె లోకానికి సుఖాన్నే పంచడం రాముని వంటి మహాత్ములకే సాధ్యం.

సర్వదా మానవలక్షణాలనే కలిగి ఉంటూ, మానవ సహజమైన దౌర్బల్యాలను ప్రదర్శిస్తూ, తిరిగి వాటిని అతిక్రమిస్తూ, విజయాన్ని సాధిస్తాడు.

ఉత్తమ మానవ లక్షణాలను తన జీవితం ద్వారా మానవులకు ఆచరించి చూపినవాడు శ్రీరాముడు. మానవజాతి కంతటికీ ఆదర్శప్రాయుడైన మానవోత్త ముడు రాముడు.

77 ప్రశ్న : శిష్టులైనవారు ఉల్లి, వెల్లుల్లి వంటి వాటిని ఎందుకు పరిహరి స్తారు?

సమాధానం :

లోకంలో మానవ స్వభావాన్ని మూడు విధాలుగా విభజించవచ్చును.

ఎటువంటి క్లిష్టమైన మనస్తత్వాలైనా, ఏకాలంలోనైనా, సర్వమానవులూ ఈ మూడువిధాలైన విభాగంలోనికే విభజింపబడుతారు. ఆ విభాగమే-సత్త్వ రజ స్తమోగుణాలు.

ఇందు సత్త్వగుణం జ్ఞానాన్ని, కాంతిని కలిగిస్తుంది. వేదపఠనం, జ్ఞానమూ, తపస్సూ, దానమూ, అహింసా, శుచిత్వమూ-వంటి గుణాలను అభివృద్ధి చేసుకోవలసినవారు సత్త్వగుణాన్ని అభివృద్ధి చేసుకోవాలి.

యజన-యాజన, అధ్యయన-అధ్యాపన, దాన-ప్రతిగ్రహణములనే ఈ షట్కర్మలను నిర్వర్తించవలసిన శ్రోత్రియులు-ఆహారనియమాన్ని పాటించ వలసిఉంది.

'అన్నాద్భవంతి భూతాని'

ప్రాణులన్నీ ఆహారం నుంచే జన్మిస్తున్నాయని చెప్పబడింది. అందువల్ల ఆహారం ఎటువంటిదైతే, అదే స్వభావం జీవులకు కలుగుతుంది. అందువల్ల- సత్త్వ గుణాభివర్ధికరమైన ఆహారాన్నే శిష్యులు స్వీకరించడం ఉచితం. విప్రులే గాక, జ్ఞానాభివృద్ధిని కోరేవారెవరైనా, ఆ విధమైన ఆహారాన్నే స్వీకరించాలి.

హృద్యమైనవీ రసవంతమైనవీ, స్నిగ్ధాలైనవీ, జిడ్డుకలవీ, అధికకాలం ఆకలిని అదుపుచేయగలిగినవి అయిన ఆహారపదార్థాలు సత్త్వగుణాన్ని వృద్ధి చేస్తాయనీ, అవి ఆయువునూ, బుద్ధిబలాన్ని, శరీరబలాన్ని, ఆరోగ్యాన్ని, సుఖ సంతోషాలనూ కలిగిస్తాయనీ భగవద్గీత చెప్పబడింది. పరికించండి.

"ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనా।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాః ఆహారా స్సాత్త్విక ప్రియాః॥"
"కట్వామ్ల లవణా త్యుష్ణా తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజస స్యేష్టాః దుఃఖ శోకా మయప్రదాః॥"
"యాత యామం గత రసం పూతి పర్యుషితం చయత్।
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్॥"

సాత్త్విక, రాజసిక, తామసిక ఆహారాలను గురించి భగవద్గీతలో పై

విధంగా వివరించబడింది. సాత్త్విక, రాజసిక, తామసులకు ప్రీతికరములైన ఆహారాలను గురించి వరుసగా చెప్పబడిన పై శ్లోకాలను పరిశీలిస్తే ఆహారానికీ స్వభావానికీ ఉన్న సంబంధం అవగతమవుతుంది.

నిత్యనైమిత్తికాది కర్మాచారణ పరాయణులు, యజ్ఞయాగక్రతు దీక్షా దురంధరులైనవారు-సాత్త్వికాహారాన్నే స్వీకరించాలనే సదాశయంతో - ఉల్లి వెల్లుల్లి వంటి వాటిని పరిహరిస్తారు.

రాజస, తామసాహార భక్షణంవలన శరీరం స్వాధీనమై ఉండదు. నియమ పాలన పరులకు దేహాన్ని స్వాధీనంలో ఉంచుకోవడం ఎంతో అవసరం. కర్మిష్ఠులకూ, యోగసాధకులకు ఇది మరింత అవసరం.

వారికేగాక, ఏవిధమైన లక్ష్యంతో కృషిచేసేవారికైనా- ఆహారనియమం వారి లక్ష్యసాధనకు ఉపకరిస్తుంది.

ఆ కారణంవల్లనే- ఎటువంటి వ్రతాచరణానికైనా ఆహారనియమం ప్రధానంగా చెప్పబడింది.

## 78 ప్రశ్న : వివాహిత స్త్రీలు మట్టెలు, పుస్తెలు మొదలైన వాటిని ఎందుకు ధరిస్తారు?

సమాధానం :

ఆయా అలంకారాలు మంగళ ప్రదమైనవీ, సౌభాగ్యదాయకమైనవీ కావడం వలన ధరిస్తారు. అవి - సౌభాగ్యవతులకు మంగళ ప్రదాయిని అయిన గౌరీదేవియొక్క అలంకారాలు. అందువల్ల - ఆ దేవియొక్క అలంకార విధానంగా వానిని ధరిస్తే సౌభాగ్యవృద్ధి జరుగుతుందనే నమ్మకం దీనికి కారణం.

అయితే ఇలా దైవాల అలంకారాలన్నిటినీ భక్తులు ధరిస్తారా? - అని ప్రశ్నించవచ్చును. లోకంలో తమ ఆరాధ్య దైవాల చిహ్నాలను భక్తులు ధరించడ మనేది సంప్రదాయమే.

విష్ణుభక్తులు త్రిపుండ్రాలనూ, శివభక్తులు విభూతి రేఖలనూ ధరించడం ఆచరణలో ఉంది. ఆ విధంగానే సౌభాగ్యం కోరే స్త్రీలందరూ గౌరీ భక్తులే

కనుక ఆ దేవియొక్క అలంకారాలను ధరించడం జరుగుతుంది.

శివుడు, విష్ణువు, దేవి - ఇత్యాది దేవతల అనుచరులు - తమ ఏలికలైన దేవతలవంటి వేషాన్నే ధరిస్తారని పురాణోక్తి.

అంతేగాక శారీరక శాస్త్రరీత్యా ఆ యా శరీర భాగాలలో ఆయా అలంకారాలు ఉంచడం వల్ల కొన్ని వ్యాధుల నివారణకు ఉపకరిస్తుంది. వీటికి ఋజువు లున్నాయి.

వివాహితగా ఒక సామాజిక గౌరవాన్ని, భద్రతను ఆపాదించడానికి కూడా ఇవి పనికి వస్తాయి.

**79 ప్రశ్న :** "తాతాచార్య ముద్ర భుజం తప్పినా పీపు తప్పదు." వివరించండి?

**సమాధానం :**

శ్రీకృష్ణదేవరాయలకు వైష్ణవమతదీక్ష ఇచ్చిన వైష్ణవ గురువుల నామధేయం తాతాచార్యులు. అదేవిధంగా తంజావూరు నాయకరాజు విజయ రాఘవ నాయకుని దీక్షాగురువులు శ్రీనివాస తాతాచార్యులని రంగాజమ్మ వ్రాసిన 'మన్నారుదాసవిలాస' ప్రబంధమూ, 'మన్నారుదాసవిలాస' యక్షగానాలవల్ల తెలుస్తున్నది. ఈ తాతాచార్యుల వంశంవారు తెలుగు, తమిళ, కన్నడ దేశాలలోని పెక్కు రాజులకు, ఇతరులకు గురువులు.

వైష్ణవులు కావడానికి పంచసంస్కారదీక్ష స్వీకరించాలి.

పంచసంస్కారమంటే ఊర్ధ్వపుండ్ర ధారణం, పేరుతో దాసపదం చేర్చడం, తప్తచక్రాంకనం, అష్టాక్షర్యాది మంత్రజపం, దేవపూజనం ఆచార్యుని వద్ద తప్తచక్రాంకనం పొంది, మంత్రోపదేశం పొందాలి. ఇది శ్రీవైష్ణవుని కనీసపు ధర్మం.

తప్త చక్రాంకనం భుజాలపైన జరుగుతుంది. కుడిభుజం మీద చక్రం, ఎడమభుజం మీద శంఖం కాల్చి పెడతారు. ఒకటి రెండు రోజులకు ఆ

కాల్చిన పుండు మాని-శంఖచక్రాల గుర్తులు మిగులుతాయి.

శ్రీతాతాచార్యులవారు వైష్ణవ మతాచారాల విషయంలో చాలా పట్టుదల కలవారు. వైష్ణవ మతదీక్ష స్వీకరించవలసిన శిష్యులు-తీరా ఆ సమయంలో ముద్రల సంగతి తెలిసి భయంతో వెనుకంజ వేయబోయినా, తాతాచార్యుల వారు వారిని వదలక ముద్రలు వేసేవారట. గింజుకుంటున్న వారిని పట్టుకొని ముద్ర వేయడంలో ఒకప్పుడు ఆ ముద్ర భుజాలమీద పడవలసినది వీపుమీద పడుతూ ఉండేదట. మొత్తం మీద ఎక్కడో ఒకచోట ముద్రవేసి తీరవలసిందే తాతాచార్యులవారి పట్టుదల అటువంటిది. అందుకే-'తాతాచార్యుల వారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు-అనే సామెత వాడుకలోకి వచ్చింది. తప్పించుకు పోలేని తప్పనిసరి పరిస్థితిని వర్ణించే సందర్భంలో ఈ సామెత చెప్పడం అలవాటయింది.

80 ప్రశ్న : భారతీయ సంప్రదాయంలో సాలగ్రామానికి ఎంతో ప్రాధాన్యం ఉన్నట్లుగా కనబడుతుంది ఈ సాలగ్రామం యొక్క చరిత్ర ఏమిటి? సాలగ్రామ ప్రాధాన్యం ఏమిటి? సాలగ్రామాలలో రకాలు ఏవి? వానిని ఎలాగుర్తించాలి?

సమాధానం :

సాలగ్రామం పుట్టుకకు సంబంధించిన గాథలు బ్రహ్మవైవర్త పురాణం లోనూ, శివపురాణంలోనూ, విష్ణుపురాణంలోనూ ఉన్నాయి.

పూర్వం కాలనేమి పుత్రుడైన శంఖచూడుడనే రాక్షసుడు - లోకకంటకుడై, ఋషి దేవతాదులను బాధిస్తూ సాధుజన హింసకుడై ఉండేవాడు. శంఖచూడుడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి - కృష్ణకవచాన్ని పొంది ఉన్నాడు. ఆ కవచం అభేద్యం. ఆ కవచమూ అతని భార్య, పాతివ్రత్యమూ సురక్షితంగా ఉన్నంతవరకూ శంఖచూడునికి ప్రాణభయం లేదు. కానీ లోకకంటకుడైన శంఖచూడుని సంహరించి. లోకాలను రక్షించ వలసిన అవసరం కలిగింది. ఆ బాధ్యతను లోకపాలకులైన శివకేశవులు స్వీక

తించక తప్పలేదు. శంఖచూడుని దుర్మార్గాలను నివారించి ప్రజల కష్టాలను తీర్చవలసి వచ్చింది.

లక్ష్మి అంశతో జన్మించిన బృంద (తులసి)-బ్రహ్మ ఆజ్ఞానుసారం శంఖచూడుని భార్య అయిఉంది. ఆమె పాతివ్రత్యం భంగపరచబడితేనేగాని శంఖచూడుడు సంహరించబడడు. యుద్ధానికి రావద్దని దేవతలు శంఖచూడుని వద్దకు పుష్పదంతుడనే దూతను పంపించారు. ఎవరెన్ని విధాల చెప్పినా శంఖచూడుడు వినక-దేవతలతో పోరుకు దిగాడు. దేవతల పక్షాన శివుడు శంఖచూడునితో యుద్ధం చేస్తూ ఉన్నాడు. శంఖచూడునితో యుద్ధం చేస్తున్న శివుడు-శంఖచూడుని ఎంతప్రయత్నించినా జయించలేకపోయాడు. శివుడు విష్ణువును ప్రార్థించి, రప్పించాడు మాయోపాయంతోనైనా ఈ దుష్టుని సంహరించాలనీ శంఖచూడుని కవచాన్ని తీసుకొని అతని భార్య పాతివ్రత్యాన్ని భంగపరచమనీ విష్ణుమూర్తిని శివుడు కోరాడు. విష్ణుమూర్తి మారువేషంతో వెళ్ళి-శంఖచూడుని నుండి అతని కవచాన్ని దానంగా పొందాడు. ఆ కవచాన్ని ధరించి విష్ణుమూర్తి శంఖచూడుని రూపంలో తులసివద్దకు వెళ్ళి, ఆమె పాతివ్రతాన్ని భంగ పరచాడు. శంఖచూడుడు మరణించాడు.

తనను భంగపరచిన విష్ణువును-రాయివికమ్మని తులసి(బృంద)శపించింది. తులసిని సమాధానపరచడంకోసం విష్ణుమూర్తి శివుని రప్పించాడు. తులసి - విష్ణుసాంగత్యాన్ని కోరి తపస్సు చేయడంవల్లనే తులసికి విష్ణుసాంగత్యం కలిగిందని శివుడు తెలిపాడు తులసి పూర్వజన్మంలో గోలోకంలో శ్రీకృష్ణుని ప్రేయసియైన విరజ అనీ, శాపంవల్ల బృదంగా జన్మించి విష్ణుసాంగత్యాన్ని పొందిందనీ శివుడు తెలిపాడు. శంఖచూడుడు-గోలోకంలో శ్రీకృష్ణుని అనుచరుడైన సుదాముడనీ, అతడు కూడా శాపకారణంగా శంఖచూడునిగా జన్మించాడనీ, అతడు పూర్వం తులసిని వివాహం కాదలచి తపస్సు చేసినకారణంగా తులసిని వివాహమైనాడనీ శివుడు తులసికి వివరించాడు. తులసి శరీరం గండకీనదిగానూ, ఆమె కేశాలు తులసీ వృక్షాలుగానూ ఏర్పడగలవనీ, విష్ణువు సాలగ్రామ శిలారూపుడై-గండకీనదిగా మారిన బృందయందే ఉండగలడనీ శివుడు తెలిపాడు. బృందయొక్క స్వరూపమైన తులసి - విష్ణువుకు అత్యంత ప్రీతిపాత్రం

కాగలదనీ, తులసీవనంలో విష్ణువు నిత్యసన్నిహితుడై ఉంటాడనీ చెప్పబడింది.

బృంద శాపం వల్ల విష్ణువు సాలగ్రామ రూపాన్ని పొందాడు. తులసి అగ్ని ప్రవేశంచేసిన చోట తులసి, ఉసిరి, మాలతి- ఈ మూడు వృక్షాలూ మొలకెత్తాయి. బృంద తులసీవృక్షంగానూ, గండకీ నదిగనూ మారగా, గండకీనదియందు విష్ణువు సాలగ్రామ రూపంతో జన్మించాడు. శంఖచూడుని ఎముకల నుండి శంఖాలు ఏర్పడ్డాయి.

కనుక సాలగ్రామం సాక్షాత్ విష్ణుస్వరూపం దానిని పూజించడం మహా ఫలప్రదం సాలగ్రామాన్ని పూజిస్తే కోరినవన్నీ లభించడమేగాక, మోక్షం కూడా సిద్ధిస్తుందని చెప్పబడింది.

సాలగ్రామాలలో వివిధ రకాలున్నాయి. నాల్గు చక్రాలూ, ఒక రంధ్రమూ, వనమాలతో ఉండేది లక్ష్మీనారాయణం. ఒక చక్రంతో ఉండేది లక్ష్మీజనార్దనం. రెండు రంధ్రాలూ, ఒక చక్రమూ, వనమాల, గోష్పాదమూ కలిగినది రఘునాథుడు. ఒక రంధ్రమూ, రెండు చక్రాలూ, పైన చిత్రవర్ణమూ గలది దధివామనుడు. రెండు రంధ్రాలూ, ఒక చక్రమూ, వనమాలా కలిగినది శ్రీధరుడు గుండ్రంగా, స్థూలంగా ఉండి - రెండు చక్రాలు కలిగినది దామోదరుడు. రెండు చక్రాలు, బాణ తూణీరాలూ కలిగి వర్తులాకారంతో ఉన్నది బలరాముడు. ఏడు చక్రాలూ ఛత్రబాణతూణీర చిహ్నాలు కలిగి, కొంత గుండ్రంగా ఉండేది రాజరాజేశ్వరుడు నీలవర్ణంతో, 14 చక్రాలు కలిగి ఉన్నది అనంతుడు. రెండు చక్రాలూ, గోష్పాదమూ కలిగినదీ వర్తులదీ శ్రీ మధుసూదనం సుదర్శన, గదా చిహ్నాలతో - చంద్రుని పోలి ఉండేది గదాధరుడు. రెండు రంధ్రాలూ, చక్రమూ, గద, సుదర్శనమూ కలిగినది హయగ్రీవుడు. రెండు చక్రాలు కలిగి భయంకరంగా ఉండేది నారసింహం దీనిని ప్రవ్రాజకులు పూజిస్తారు. ఇది వికృతరూపాన్ని కలిగి ఉంటుంది. రెండుచక్రాలూ, వనమాలా కలిగి వికృత రూపంతో ఉన్నది లక్ష్మీనృసింహం. ఇది ఐశ్వర్యప్రదం. రెండు చక్రాలూ, పురుష చిహ్నమూ కలిగినది వాసుదేవుడు ఇది శత్రురక్షణ పరం. చిన్న చక్రం కలిగి, అనేక రంధ్రాలున్నది ప్రద్యుమ్నం. దీనిని గృహంలో అర్చిస్తే సుఖం కలుగుతుంది. రెండు చక్రాలు, కుడి భాగాన రంధ్రమూ కలిగినది సుదర్శనం.

గృహంలో దీని అర్చన వల్ల ధన ధాన్యాభివృద్ధీ, సుఖమూ కలుగుతాయి. చక్రాకారం కలిగిన సాలగ్రామాన్ని గృహంలో అర్చిస్తే లక్ష్మి స్థిరంగా ఉంటుంది. గోళాకారం కలిగిన సాలగ్రామాన్ని ఇంట పూజిస్తే రాజ్యప్రాప్తి కలుగుతుంది.

సాలగ్రామరహితంగా చేసే దేవతారాధనలూ, యజ్ఞ యాగవ్రతాదులు నిష్ఫలాలు, సాలగ్రామ తీర్థపానం చేసిన వారికి మరణానంతరం గోలోకం ప్రాప్తిస్తుంది. వారికి జన్మరాహిత్యం కలుగుతుంది. సాలగ్రామాన్ని స్పృశించి ప్రమాణం చేసినవారికి నరకప్రాప్తి కలుగుతుంది. సాలగ్రామదానం మహా ఫలప్రదం.

సాలగ్రామార్చనలో తులసి చాలా ప్రధానమైనది. తులసీ దళాలతో సాలగ్రామార్చన చేసి, ఆ తులసిని ప్రసాదంగా స్వీకరించాలి. ఏ దానం చేసినా దానితోపాటు సాలగ్రామాన్ని దానం చేయాలి,

బృందయొక్క దేహం గండకీ నదిగానూ, ఆమె కేశాలు తులసీ వృక్షాలుగానూ విష్ణుమూర్తి ఆనతి ప్రకారం జన్మించి పూజలందుకొంటున్నాయి.

సాలగ్రామార్చనలో తులసికి, శంఖానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. ఈ మూడూ మహాపవిత్రమైనవని విష్ణుదేవుడు తెలిపాడు.

దేహం వీడిన తులసికి దివ్య శరీరాన్ని ఇచ్చి, ఆమెను తన వెంట వైకుంఠ నగరానికి తీసుకొనిపోయేముందు విష్ణుమూర్తియే స్వయంగా ఆమెకు సాలగ్రామ మాహాత్మ్యమూ, సాలగ్రామాలను గుర్తించే విధానమూ, వాని లక్షణాలూ మొదలైన పై విషయాలన్నిటినీ చెప్పినట్లుగా బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పబడింది.

**81 ప్రశ్న : హనుమద్రామాయణం హనుమంతుడు వ్రాసినదా? దానిని అతడు దేనిపై వ్రాశాడు?**

**సమాధాన :**

భోజ మహారాజు కాలంలో హనుమద్రామాయణ ప్రస్తావన వచ్చింది.

భోజుడు రాజ్యంచేస్తూ ఉన్న రోజులలో ఒకనాడు మత్స్యకారులు నర్మదా నదిలో వల వేయగా - హనుమద్రామాయణంలోని ఒక శ్లోకపు సగ భాగం లిఖించబడి ఉన్న రాతి పలక వారి వలలో చిక్కుకొంది.

ఆ శిలాఫలకాన్ని మత్స్యకారులు తెచ్చి రాజాస్థానంలో సమర్పించారు. ఆ సమయంలో భోజరాజు కవి పండిత పరివేష్టితుడై కొలువుతీరి ఉన్నాడు. సముద్రంలో లభించిన శిలాఫలకాన్ని శుభ్రంచేయించి, ఆస్థాన కవిపండితుల చేత పరిశీలింపజేశాడు భోజుడు. ఆ శిలాఫలకం ఎక్కడినుండి వచ్చినదీ, దేనికి సంబంధించినదని భోజుడు ప్రశ్నించాడు. ఆ శిలాఫలకంయొక్క వృత్తాంతాన్ని రాజుకూ ఇతర ఆస్థాన విద్వాంసులకూ కాళిదాసమహాకవి వివరించాడు. కాళిదాసమహాకవి మహాకాళీ ఉపాసకుడు కావడంవల్ల — ఆ వృత్తాంతాన్ని తెలుసుకొని చెప్పగలిగాడు.

హనుమంతుడు రామాయణాన్ని వ్రాశాడనీ, అతడు దానిని రాతి పలకలపై వ్రాశాడనీ, దానిని ఆయన శ్రీరామునికి చూపగా — "ఆంజనేయా! దీనిలో నీ శౌర్యాన్ని చాలా పొగడుకొన్నావే" అని శ్రీరాముడు అన్నాడనీ, శ్రీరామునికి నచ్చని నాకావ్యమెందుకు — అని హనుమంతుడు తన కావ్యమున్న రాతి పలకలను సముద్రంలో పారవేశాడనీ _ కాళిదాసు భోజునికి తెలిపాడు.

ఆ శిలాఫలకం పైన ఉన్న శ్లోకపు అర్థభాగం ఈక్రిందిది -

"అయిఖలు విషమః పురాకృతానాం

భవతిః జంతుషు కర్మణాం విపాకః॥

—అని ఉన్న ఈ శ్లోకార్థానికి భావం ఏమంటే-"పురాకృతమైన కర్మ విపాకం అనుభవింపక తప్పనిదీ, దాటరానిదీ అయి-జీవులను బాధిస్తున్నది కదా—అని. యొక్క ప్రారంభాన్ని చెప్పమని ఈ శ్లోకం భోజుడు తన ఆస్థాన విద్వాంసులను కోరాడు. అప్పుడు భవభూతి మహాకవి ఈక్రింది విధంగా పూరించాడు.-

"క్వనుకుల మకలంక మాయతాక్ష్యాః

క్వచ రజనీచర సంగమాపవాదః"

భావం : "అకళంకమైన జన్మం కలిగిన సీతాదేవి ఎక్కడ! రావణ సంగమాపవాదం ఎక్కడ? -అని భావం

భవభూతి మహాకవి పూరణం భోజరాజుకు సంతృప్తిగా తోచలేదు. శ్రీమహాలక్ష్మి అవతారమైన సీతాదేవివట్ల రజనీచరసంగమ శబ్దాన్ని ఉపయోగించడం ఔచితీభంగమూ అపచారమూ కాగలదని భోజమహారాజు తలచాడు. అప్పుడా రాజు అభ్యర్థనపై దండి మహాకవి ఈక్రింది విధంగా పూరించాడు -

"క్వ జనకతనయా క్వ రామజాయా
క్వచ దశకంధర మందిరే నివాసః"

భావం : "జనకరాజర్షి పుత్రిక, రామచంద్రుని గృహిణి అయిన సీతాదేవి ఎక్కడ! రావణమందిరనివాసమెక్కడ!"- అని భవభూతి కూడా సీతాదేవి పరంగానే పూరించాడు. అప్పుడు భోజుడు కాళిదాసును-కవి హృదయాన్ని వివరించమని కోరగా-కాళిదాసు ఈక్రింది విధంగా పూరించాడు.

"శివ శిరసి శిరాంసి యాని రేజుః
శ్శివశివ తాని లుఠంతి గృధ్రపాదైః"

భావం : శివుని శిరస్సుపైన పూజాపుష్పాలుగా గౌరవించబడిన ఈ శిరస్సులు- (ఈనాడు యుద్ధరంగంలో త్రుంచబడి) గ్రద్దల కాళ్ళచేత తన్నబడుతున్నాయి కదా!"- అని రావణుని పరంగా పూరించాడు కాళిదాస మహాకవి.

శివుని శిరస్సుపై రావణుని తలలు శోభించటం అనగా ఏమంటే- పూర్వం రావణుడు తపస్సు చేసిన కాలంలో జరిగిన సన్నివేశం అది. తీవ్ర ప్రకృతి కలిగిన రావణుడు-శివానుగ్రహం కొరకు తన శిరస్సులను ఖండించుకొనివానిని పూజాకుసుమాలుగా శివుని పూజించాడు ఆనాడు ఆ శిరస్సులు శివు శిరస్సుపై ప్రకాశించాయి. సర్వలోకారాధనీయమైన శివశిరస్సుపై స్థానాన్ని పొందడంద్వారా రావణ శిరస్సులు లోకపూజ్యతను ఆపాదించుకొన్నాయి. అంతటి గౌరవాన్ని పొందిన ఆ శిరస్సులు—నేడు యుద్ధభూమిలో నేలపై పొర్లాడుతూ, గ్రద్దల కాళ్ళచేత తన్నబడుతున్నాయి.

కాళిదాసు ఈ విధంగా హనుమంతుని హృదయాన్ని తెలిపాడు తర్వాత ఆ రాతి పలకను శోధించగా ఇదే శ్లోకభాగం కనిపించింది.

82 ప్రశ్న : "గొంతెమ్మకోరికలు"-అంటే ఏమిటి? ఈ గొంతెమ్మ ఎవరు?

సమాధానం :

ఈ గొంతెమ్మ భారతంలోని కుంతీదేవియే కుంతీ శబ్దానికి వికృతియే గొంతి. ఈ'గొంతి' అనే శబ్దం భారతంలో పలుచోట్ల ప్రయోగించబడింది,

కవిత్రయ కృతమైన శ్రీమదాంధ్ర మహాభారతంలో - కుంతీదేవియే 'గొంతి'గా పేర్కొనబడింది-అనే అంశానికి ఋజువులు ఈక్రిందివి.

1. ఆంధ్రమహాభారతం ఉద్యోగపర్వం తృతీయాశ్వాసంలోని 202వ వచనం —"అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె."

2. ఆంధ్రమహాభారతం ఉద్యోగపర్వం చతుర్థాశ్వాసం-17వ వచనం-"అనియంత నిలువక గొంతి యిట్లనియె."

3. ఆంధ్రమహాభారతం ఉద్యోగపర్వం చతుర్థాశ్వాసం—23వ పద్యం-"పలుకునె యిట్లు గొంతి...."

4. ఆంధ్రమహాభారతం- ఉద్యోగపర్వం చతుర్థాశ్వాసం—29వ పద్యం- "....కన్నియతటి గొంతి కన్నవాడవగుట...."

ఇక దీని అర్థం గురించి. "గొంతెమ్మకోరికలు-"అనే పదబంధాన్ని-అత్యాశతో కూడినవీ, అంతంలేనివీ, హద్దులు మీరినవీ, అసంబద్ధమైనవీ, కోరరానివీ, అసందర్భమైనవీ ఐన కోరికలు-అనే అర్థంలో ప్రయోగించడం వాడుకలో ఉంది.

ఐతే కుంతీదేవి అంతకోకోరరాని కోరిక లేమి కోరిందనే సందేహం సహజంగానే కలుగుతుంది.

భారతగాధ మొత్తంమీద కుంతీదేవి కోరిన కోరికలు రెండే, ఆ రెండు సందర్భాలూ ఏమంటే-

వానిలో మొదటిది కర్ణుని పాండవులతో చేరమని- కురుక్షేత్రయుద్ధారం

కాని! ముందుగా కర్ణుని కోరిన కోరిక. మరొకటి-కురుక్షేత్రయుద్ధానంతరం ధర్మరాజు - యుద్ధంలో కూలిపోయిన బంధువులకు తర్పణాదులు ఇస్తూ ఉండగా కర్ణునికి కూడా తర్పణాదులు ఇమ్మని ధర్మజుని కోరిన కోరిక.

వీనిలో మొదటిదైన కర్ణుని కోరిన కోరిక గురించి:-కర్ణుడు తన పుత్రుడే నని-కుమారాస్త్రవిద్యాప్రదర్శన సమయంలో అతనిని చూచినప్పుడే-అతని కవచకుండలాలను బట్టి కుంతి గుర్తించింది. ధనుర్విద్యాపారంగతుడైన అర్జును నికి పోటీకాగల ఆ వీరుని- తమపక్షాన నిలుపుకొనాలనే ఆతురతతో దుర్యో ధనుడు-కర్ణుని అంగరాజ్యానికి రాజునుచేయడం — కుంతీదేవికి ఆనందాన్ని కలి గించింది. కర్ణుడు తన కుమారుడేనని కుంతి ఆసమయంలోనేకాదు, ఆ తర్వాత కూడా చాలా కాలంవరకూ వెల్లడించలేదు కర్ణునికి కూడా ఆ నిజాన్ని ఎరుక పరచలేదు. శ్రీకృష్ణరాయబారం కూడా విఫలమై, యుద్ధం తప్పదని తెలిసిన తర్వాతనే కుంతి కర్ణుని కలుసుకొనడానికి వెళ్ళింది. ఒకనాటి ఉదయాన-గంగా తీరాన సూర్యుని ఉపాసిస్తున్న కర్ణుని వద్దకు వెళ్ళి-కర్ణునికి అతని జన్మవృత్తాం తాన్ని తెలిపింది కుంతీదేవి. తాను తన బాల్యంలో సూర్యదేవుని అనుగ్రహం వల్ల అతనిని కని, లోకభయంచేత విడిచిపెట్టిన విషయాన్ని దుఃఖంతో కర్ణునికి తెలిపింది.

"నాయనా! నీవు నా బిడ్డవు. తెలియక దుర్యోధనుని సేవిస్తున్నావు. నీవు అన్నవని తెలిస్తే పాండవులే నిన్ను సేవిస్తారు. మహావీరులైన తమ్ము లతో కలసి రాజ్యవైభవాన్ని అనుభవించు నా దుఃఖాన్ని తొలగించు నీతమ్ము లతో కలసి ఉండి, నన్ను సంతోషపెట్టు." అని కోరింది. తన బిడ్డలు ఒకరి నొకరు నరుక్కొనే పరిస్థితిని సహించలేనని కర్ణుని ప్రార్థించింది. కుంతి మాట లకు ఆమోదముద్రగా-సూర్యమండలంనుంచి - కుంతీదేవి తెలిపిన విషయం యదార్థమేననీ, ఆమెమాట పాటించమనే పలుకులు వినవచ్చాయి.

ఇంతజరిగినా కర్ణుడు కుంతీదేవి చెప్పినట్లు వినలేదు. కుంతీదేవి తనను విడిచిపెట్టినందుకు ఆమె స్వార్థాన్ని నిందించాడు. తాను అప్పుడు చిన్నతనం వల్ల-ఏమిచేయాలో తెలియని భీతితో ఆ విధంగా చేశానని చెప్పినా, కుంతిని కర్ణుడు దయతలచలేదు.

అన్నాళ్లూ తనను పెంచిపోషించిన సూతదంపతులను ఈనాడు విడిచి రావడం అధర్మమన్నాడు. తననొక మనిషిగా నిలబెట్టి, తనకు ఒక ఉనికినీ, గౌరవాన్నీ, లోకంలో గుర్తింపునూ ఇచ్చి, తనను నమ్ముకొని ఉన్న దుర్యోధను నికి - యుద్ధానికిముందు ద్రోహం చేయడం కృతఘ్నత కాగలదన్నాడు. ఐతే కుంతీదేవి వచ్చి తనను అర్థించినందుకుగాను-అర్జునుని తప్ప మిగిలిన పాండవులు యుద్ధంలో తన చేత చిక్కినా చంపననీ, అర్జునునికీ తనకూ మధ్యనే స్పర్ధ అనీ, కర్ణార్జునులలో ఎవరో ఒక్కరే మిగులుతారని, ఎటైనా ఆమెకు ఐదుగురు కొడుకులే మిగులుతారని స్పష్టం చేశాడు కర్ణుడు.

ఇక కుంతి ధర్మరాజును కోరినది ఆమె రెండవ కోరిక. ఆ సందర్భం ఏమంటే: - కర్ణుడు తన కుమారుడేనని కుంతిదేవి కురుక్షేత్ర యుద్ధం అంతం అయేవరకూ పాండవులకు చెప్పలేదు. యుద్ధానంతరం ధర్మరాజు-బంధువులకు తర్పణాదులిస్తుండగా కుంతీదేవి వచ్చి, కర్ణుని విషయం తెలిపి, అతనికి కూడా తర్పణాదులు ఇమ్మని కోరింది. కుంతీదేవి ఆ యదార్థాన్ని అంతవరకు తెలియజేయని కారణంగా అన్నను చేతులారా చంపుకున్నందుకు విలపించాడు ధర్మరాజు. ఆ విషయం ముందె తెలిసి ఉంటే యుద్ధం మానుకుని ఉండేవాడనని విచారించాడు. స్త్రీలకు రహస్యాన్ని దాచే శక్తి ఉండరాదని శపించాడు

ఈ పై రెండు సందర్భాలలోనూ కూడా కుంతి కోరిన కోరికలు అంత కోరరానివీ, అసంబద్ధమైనవీ అనడానికి వీలులేదు. రెండు కోరికలూ పుత్రమమ కారంచేత, కన్నకడుపు తీపిచేత కోరినవే. అన్నదమ్ములని తెలియని తన బిడ్డలు - ఒకరి నొకరు చంపుకొనే సన్నివేశాన్ని నివారించాలనే ఆరాటంతో - కర్ణుని పాండవ పక్షానికి రమ్మని కోరిక ఒకటి; కర్ణునికి అంతిమ సంస్కారం నిర్వర్తించమని ధర్మరాజును కోరిన కోరిక మరొకటి. ఈ రెండు కోరికలవల్లనూ కూడా ఎవ్వరికి ఏమి నష్టంలేదు. ఇంతకంటె అసాధ్యాలైనవీ, అన్యాయమైనవీ ఐన కోరికలు కోరిన వారెందరో పురాణ గాథలతో మనకు కనిపిస్తుండగా - వారందరినీ వదలివేసి, సర్వదా దయనీయమైన దుఃఖజీవితాన్నే అనుభవించిన కుంతీదేవి కోరికలను ఆత్మాశలుగా వర్ణించడం అర్థంలేనిది. ఆమె కోరికలూ,

ఆ సన్నివేశాలూ (పైన చెప్పినవి) కూడా - జాలి పడదగినవే కాని, అది ఆమె అత్యాశగా నిరూపించి వేలెత్తి చూపదగినవి కాదు

ఐతే మరి ఈ సామెతకు ఆధారం ఏమిటనేది ప్రశ్న - దానికి సమాధానం భారతంలోనే లభిస్తుంది. అదేమంటే - ఏ మానవ స్త్రీకీ సాధ్యం కాని విధంగా - దేవతల అనుగ్రహంతో - దేవతాంశ సంభూతులైన కుమారులను పొందింది కుంతి, దుర్వాస మహర్షి ఇచ్చిన మంత్ర ప్రభావంవల్ల - దేవతలను ప్రసన్నం చేసుకొని, ఆ దేవతా సమతేజస్కులైన కుమారులను పొందగలిగింది. దేవతలనగా తేజోరూపులు. ఆ దేవతా ప్రసన్నతకై కుంతీ పాండురాజులు నియమ నిష్ఠలతో తపమాచరించారు. తపస్విధురాలైన కుంతి - లోక పాలకులైన యమ వాయు మహేంద్రులను అర్చించి- వారి అంతటి సాహసికులను సంతానంగా పొందింది. దేవేంద్రుని గురించి ఒక సంవత్సరంపాటు తపస్సుచేసి - ప్రసన్నుని చేసుకొన్నారు - కుంతీపాండురాజులు. అంతటి అమరేంద్రుని వలన వరం పొంది - అర్జునునివంటి ఉత్తమ పురుషుని, అఖండ ప్రభావ సంపన్నుని - కుమారునిగా పొందగలిగారు దేవతా సములైన కుమారులను దేవతానుగ్రహం వల్ల పొందాలనుకోవడమే లోకానికి అత్యాశగా కనిపించి - ఆ విషయమే - 'గొంతెమ్మ కోరికలు'గా పేర్కొనబడింది

ఎందువల్లనంటే - పాండవులు ఒక్కొక్కరూ జన్మించినప్పుడు - ఆ బాలకులు భవిష్యత్తులో సాధించబోయే మహత్కార్యాలను ఆకాశవాణి ప్రకటించింది. అప్పుడు శత శృంగ పర్వతారణ్యంలోని తాపసులందరూ అది విని ఆశ్చర్యంతో నివ్వెరపోయారు.

కుంతికివలె - దేవతలవల్ల సంతానాన్ని పొందిన మరొక స్త్రీలు ఎవ్వరూ లేరు. దేవతలద్వారా కుంతీ - మహాపురుషులను సంతానంగా పొందిన విషయాన్నే - సామాన్య పరిభాషలో 'గొంతెమ్మ కోరికలు'గా పేర్కొనడం జరిగింది.

**81వ ప్రశ్న :** హనుమంతుడు సముద్రుని పొగడి సముద్రాన్ని లంఘించాడు. అది పొగడ్త ప్రభావ మంటారా?

సమాధానం :

హనుమంతుడు సముద్రుని పొగడి సముద్రాన్ని లంఘించినట్లుగా రామాయణంలో లేదు ఆయన ప్రత్యేకించి సముద్రుని పొగడినట్లు మహర్షి వాల్మీకి ఎక్కడా వ్రాయలేదు.

హనుమంతుడు యోగప్రభావంతో సముద్రాన్ని లంఘించాడు. ఆయన అణిమా గరిమాది శక్తులు కలిగిన యోగసిద్ధి సంపన్నుడు. సముద్రాన్ని లంఘించేముందు ఆయన ధ్యానించినది శ్రీరామచంద్రునీ, సర్వదేవతలనూ.

హనుమంతుడు సముద్ర లంఘనం చేసేముందే జరిగిన సన్నివేశం ఈ క్రిందిది.

దక్షిణ సముద్రతీరంలో నిలబడి - ఆ సముద్రాన్ని దాటి సీతను చూడ గలవారెవరని ఆలోచిస్తున్నారు. అంగద జాంబవంతాది వానరులు. సీతాన్వేషణార్థం నలుదిక్కులకూ సుగ్రీవుడు పంపిన వానర సమూహాలలో - దక్షిణ దిక్కుకు వచ్చిన సమూహం ఇది. జాంబవంతుడు అడుగగా - ఈ సమూహంలోని వానరులందరూ తమ తమ లంఘన శక్తిని తెలుపుకొన్నారు. వారిలో ఎవ్వరూ సముద్ర లంఘనంచేసి, సీతను చూచి, తిరిగి సముద్రాన్ని లంఘించి రాగలవారు లేరని తేల్చుకొన్నాడు - వృద్ధ కపి వీరుడైన జాంబవంతుడు. అప్పుడు జాంబవంతుడు - ఒక ప్రక్కగా కూర్చొని ఉన్న హనుమంతుని సమీపించి - ఆయనను సముద్ర లంఘనానికి ఉత్సాహ పరచాడు. తన శక్తిని తానెరుగని హనుమంతునికి ఆయనకున్న శక్తిని వివరించి - జాంబవంతుడు అంజనేయుని - సముద్రాన్ని లంఘించి సీతను చూచివచ్చి - వానరుల ప్రాణాలు నిలువమని ఉత్తేజపరచాడు.

అప్పుడు జాంబవంతుడు ప్రేరేపించగా హనుమంతుడు - లేచి, వృద్ధులైన జాంబవంతాదులకు నమస్కరించాడు. సముద్రాన్ని దాటి సీతను తీసుకొని రాగలనని చెప్పి - దీనులై ఉన్న వానరులను తన వీరాలాపంతో సంతోష పరచాడు.

అప్పుడు హనుమంతుడు చేసిన దేవతా ప్రార్థనం ఈ క్రింది శ్లోకంలో వివరించబడింది.

శ్లో॥ నసూర్యాయ మహేంద్రాయ పవనాయి స్వయంభువే।
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్॥

భావం: సూర్యునకు, మహేంద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మదేవునకు, సర్వభూతములకూ నమస్కారం చేసి హనుమంతుడు తన ప్రయాణానికి ఉద్యుక్తుడైనాడు.

ఆ విధంగా సర్వదేవతలకూ నమస్కరించిన హనుమంతుడు - తన తండ్రియైన వాయుదేవునికి పునః ప్రణామం చేశాడని వాల్మీకంలో చెప్పబడింది. తాను వచ్చేవరకూ వానరులను అక్కడే ఉండమని చెప్పి, ప్రదక్షిణంచేసి హనుమంతుడు బయలుదేరాడు.

ఆ హనుమంతుడు అప్పుడు - పర్వకాలాలలో సముద్రునివలె - రామకార్య సిద్ధి కొరకై వృద్ధి పొందాడు.

రామ బాణంవలె వాయువేగంతో దూసుకొని పోయి - లంకలోనే గాక సర్వ లోకాలనూ వెదకి సీతను తెస్తాననీ, సీత కానరాక పోతే రావణునితో సహా లంకను పెల్లగించి తెస్తాననీ హనుమంతుడు చెప్పి బయలుదేరాడు.

ఆ తర్వాత అనేక అవాంతరాలను గడచి, మైనాక, సురసా, సింహికా, లంకిణీ - ఇత్యాది సన్నివేశాల అనంతరం లంకలో ప్రవేశించాడు. (ఆయా సన్నివేశాలను వివరించవచ్చును కాని, గ్రంథవిస్తర భీతివల్ల విడిచి వేస్తున్నాను)

లంకలోని సర్వప్రదేశాలలో సీతకొరకు వెదకి, సీత కనబడకపోవడంతో దుఃఖాన్ని పొందాడు హనుమంతుడు. కొంతసేపు విచారించి - చివరకు ధైర్యాన్ని వహించి- హనుమంతుడు దేవతా నమస్కారం చేశాడు. అప్పుడు తనకు కనబడిన అశోకవనంలో వెదకబోయేముందు-

అష్టవసువులకూ, ఏకాదశ రుద్రులకూ, ద్వాదశాదిత్యులకూ, అశ్వినీ దేవతలకూ, సప్తమరుత్తులకూ హనుమంతుడు అప్పుడు నమస్కరించాడు.

శ్లో॥ "నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ।
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యః।
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥

భావం: లక్ష్మణ సహితుడైన రామునికి, జనకాత్మజయైన సీతాదేవికి వందనం. రుద్ర ఇంద్ర యమ వాయుదేవులకు నమస్కారం. చంద్ర సూర్య మరుద్గణాలకు నమస్కారం.- అని పై శ్లోక భావం.

అనంతరం స్వయంభువైన బ్రహ్మదేవునికీ, సర్వదేవతలకూ, అగ్ని హోత్రునికీ, వాయుదేవునికీ, వజ్రహస్తుడైన దేవేంద్రునికీ, పాశధారి అయిన వరుణదేవునికీ, సూర్యచంద్రులకూ, మహాత్ములైన విశ్వేదేవతలకూ, మరుత్తులకూ, శివునికీ నమస్కరించి-వారు తనకు కార్యసిద్ధిని కలిగించాలని ప్రార్థించాడు హనుమంతుడు సర్వలోకాలకూ అధిపతియైన ఆ సర్వేశ్వరుడున్నూ, మార్గంలో తనకు కంటికి కనిపించేవీ, కనిపించనివీ అయిన సర్వశక్తులూ తనకు సీతాన్వేషణంలో సహకరించి కార్యసిద్ధిని ప్రసాదించాలని ఆ హనుమంతుడు దేవతలను ధ్యానించి నమస్కరించాడు.

హనుమంతుడు సముద్రలంఘన సమయంలోనూ, అనంతరం సీతాన్వేషణ సమయంలోనూ-చేసిన దేవతా ప్రార్థనలు-ఇంతవరకూ చెప్పినవి. ఈ చెప్పబడినవారే ఆయన నమస్కరించిన పూజ్యులూ, దేవతలూన్నూ. ఆయన పంచభూతాలకూ ముందే నమస్కరించాడు-కనుక - జలరాశియైన వరుణాలయానికి (సముద్రానికి) ఆయన నమస్కరించినట్లే అయింది. జలరాశికి అధిపతియైన వరుణునికి నమస్కరించితే జలానికీ, సముద్రునికి నమస్కరించినట్లే.

అంతేగాక, వాల్మీకంలో హనుమంతుని సముద్ర లంఘన సన్నివేశాన్ని పరిశీలించినట్లైతే - అక్కడి వర్ణన మంతటికీ లక్ష్యం - హనుమంతుడు యోగశక్తితో సముద్రాన్ని దాటినట్టుగా చెప్పడమేనని అవగతం కాగలదు.

**84 ప్రశ్న :** వివాహాలలో ఎదుర్కోలు సమయంలో వరుని పక్షంవారికి వధువు పక్షంవారు పానకం బిందెలు ఇచ్చే ఆచారం ఆంధ్ర ప్రదేశ్‌లో ఉంది. వివాహ కార్యక్రమంలో పానకం బిందెల ప్రాముఖ్యం ఏమిటి?

**సమాధానం :**

స్నాతకులైన బ్రహ్మచారి-సమావర్తన వ్రతాన్ని పూర్తిచేసుకొని వచ్చిన తర్వాత-అతని అభ్యర్థనపై అతని పక్షాన యోగ్యులైన వారు ఒక ఉత్తమ కన్యకను ఎన్నిక చేస్తారు. ఆ కన్యయొక్క తండ్రిని-కన్యనిమ్మని అడుగుతారు కన్య తండ్రి అంగీకరించిన తర్వాత, వరుడు, అతనికి పూజ్యులైన బ్రాహ్మణులు, సువాసినులు, జ్ఞాతులు, బంధువులతో కన్యాదాత గృహానికి వెడతారు.

కన్యాదాత తనకుటుంబంతో, పూజ్యులతో, బంధువులతో కూడి మంగళ వాద్య సహితంగా ఎదురువచ్చి - పుష్పమాలికాదులు, చందనాది పరిమళ ద్రవ్యాలు, పూజాయోగ్యవస్తువులతో, అనులేపనాదికాలతో వరపూజ చేస్తాడు.

"నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరు బాహవే।
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటీ యుగధారిణే నమః॥

అని శ్రీమహావిష్ణు స్వరూపుడుగా వరుని సంభావించి పూజిస్తాడు.

నూతన వస్త్రాభరణాలనూ, సుగంధ ద్రవ్యాలను సమర్పించి-వరునికీ, అతని బంధు పరివారానికీ మధురమైన, రుచ్యమైన పానీయాలను ఇచ్చివారందరినీ గౌరవించి-వివాహవేదిక వద్దకు ఆహ్వానిస్తాడు-కన్యాదాత.

గృహ్య సూత్రాలను అనుసరించి వైదికమైన విధి విధానంగా-వరుని గాజించి కన్యను అలంకరించి దానంచేసే కార్యక్రమానికి సంబంధించి-వరునికీ తని బంధువులకు స్వాగతం చెప్పే సన్నివేశంలో ఇచ్చే పానీయమే ఈపానక ంచ్చే ఆచారంగా వస్తున్నది.

### 5 ప్రశ్న : "చుక్కెదురు" అంటే ఏమిటి?

సమాధానం :

ఈ సందర్భంలో చుక్క అనగా శుక్ర గ్రహం. ప్రయాణమై వెళ్ళే సమయంలో, ఆ వెళ్ళవలసిన దిక్కున శుక్రగ్రహం ఉంటే పనికిరాదు. నికే 'చుక్క ఎదురు' అంటారు. ముఖ్యంగా గర్భిణిని ప్రసవానికి సుకువెళ్ళేటప్పుడు, పసిబిడ్డతో తల్లిని తీసుకువెళ్ళేటప్పుడు - శుక్రుడు న్న దిక్కుకు ఎదురుగా వెళ్ళరాదు. దాని వలన అవాంఛనీయ ఫలితాలు సంభవిస్తాయని భావిస్తారు. దీనికే 'ప్రతి శుక్ర బౌమ బుధ దోష'మని జ్యోతి శాస్త్రం పేర్కొన్నది. దీనిని కుజ బుధుల విషయంలో కూడా పాటించడం ంది. 'ప్రతి శుక్ర బౌమ బుధ దోషం' అంటే- శుక్ర, కుజ, బుధులు ఎదు రుగా ఉండే దోషమని అర్థం.

శుక్రుడు భూమికంటె, సూర్యునికి సమీపంగా ఉండే గ్రహం. ఆ కార ణంగా శుక్ర గ్రహం- సూర్యోదయాత్పూర్వం తూర్పు దిక్కునా, సూర్యా స్తమయానంతరం పశ్చిమాకాశంలోనూ కనిపిస్తుంది. సూర్యునికి 16 డిగ్రీల కంటె దగ్గరగా వెళ్ళిన గ్రహం అస్తంగతమవుతుంది. శుక్రుడు కూడా ఆ విధంగానే సూర్యునికి మరీ సమీపంగా వెళ్ళినప్పుడు అస్తంగతుడౌతాడు. అనగా ఆకాశంలో కనిపించడం జరగదు శుక్రుడు తన గమనాన్ని బట్టి 16 డిగ్రీలకంటె సూర్యునినుండి దూరంగా జరిగిన తర్వాత - పశ్చిమానకాని, తూర్పునకాని తిరిగి ఉదయిస్తాడు.

తానున్న దిశనుబట్టి - కొన్ని నెలల పాటు సూర్యోదయానికి ముందు తూర్పు దిక్కునా, మరికొన్ని నెలలపాటు సూర్యాస్తమయం అయిన వెను

వెంటనే పశ్చిమాకాశంలోనూ - శుక్రుడు కనిపిస్తాడు. అందువల్ల శుక్రుని వేగు చుక్క (Morning star) గానూ, రేచుక్క (Euening star) గానూ వ్యవహరిస్తారు. శుక్రుడు కనిపించే కాలంలో ఆకాశంలోని నక్షత్రాలన్నిటికంటె శుక్రుడే అధిక తేజోవంతంగా కనిపిస్తాడు.

జ్యోతిశ్శాస్త్ర రీత్యా శుక్రగ్రహానికి ఉచ్చస్థానం (Exaltation) ఐన మీనరాశిలో శుక్రుడున్నప్పుడు- సంవత్సరం అంతటిలోనూ శుక్రుడు అధిక తేజంతో కనిపిస్తాడు. శత్రు, నీచ రాశులకంటె ఉచ్చరాశి స్వక్షేత్రాలలోనూ మిత్రక్షేత్రాలలోనూ ఉన్నప్పుడు ఏ గ్రహమైనా అధిక తేజంతో కనిపిస్తుంది.

## 86 ప్రశ్న : దక్షిణదిక్కుగా తలపెట్టి నిద్రపోరాదంటారు, ఎందుచేత?

**సమాధానం :**

నిద్రపోరానిది ఉత్తర దిక్కుగా తలపెట్టి మాత్రమే. కాని, దక్షిణ దిక్కుగా కాదు. ఎందువల్లనంటే-ఉత్తరదిక్కుగా తలపెట్టి పరుండినవారు నిద్రలేవగానే దక్షిణ దిక్కును చూస్తారు. దక్షిణం యముని దిక్కు. మిగిలిన ఏ దిక్కులకు అధిపతులెవరో ఇదే గ్రంధంలో మరొకచోట ఇవ్వడమైంది. ఉదయం లేచిన వెంటనే యమస్థానాన్ని చూడరాదని అలా అంటారు యముడు మృత్యువుకు అధిపతికదా! గణేశునికి ఉత్తరదిక్కుగా తల పెట్టి ఉన్న ఏనుగు తలనే తెచ్చి అతికించారు. అప్పటినుంచీ ఇది సంప్రదాయమైంది.

అంతేగాక, దక్షిణదిక్కు యముని దిక్కు కావడానికి మరొక కారణం ఉంది. అదేమంటే-మనది ఉత్తరార్ధగోళం. సూర్యుడు ఉత్తరార్ధగోళంలో-అనగా మనకు సమీపంగా ఉన్నప్పుడు-జీవులకు ఆరోగ్యం, ఆయువు - సమృద్ధిగా ఉంటాయి పాడి,పంట-సుభిక్షంగా ఉంటాయి జీవుల శారీరక, మానసిక ఆరోగ్యాలకు సూర్యదర్శనం అవసరం. సూర్యుడు దక్షిణానికి వెళ్ళినప్పుడు- సూర్యదర్శనం, సూర్యతేజం-అధికంగా ఉండదు. ఆ కారణంగా ఆ సమయంలో వ్యాధులు ప్రబలుతాయి. మరణాలు అధికంగా ఉంటాయి. అందుకే ఆ సమయాన్ని యమదంష్ట్రాకాలమని పేర్కొంటారు. సంవత్సరం అంతటి

లోనూ ఆషాఢశుద్ధ ఏకాదశినుండి కార్తీకశుద్ధ ఏకాదశివరకు ఉన్నకాలమే మరణాలు అధికంగా ఉండేకాలం. యమదంష్ట్రికాలంగా పేర్కొనబడే సమయం అదే. అందుకే అది స్థితికారకుడైన విష్ణుమూర్తి నిద్రించే కాలంగా చెప్పబడింది అది అంటువ్యాధులు అత్యధికంగా ప్రబలేకాలం.

## 87 ప్రశ్న : అర్థం కాని దస్తూరీని బ్రహ్మరాత అంటారు. బ్రహ్మగారి దస్తూరీ అంత గజిబిజిగా ఉంటుందా?

సమాధానం :

అర్థం కాని దస్తూరీని బ్రహ్మవ్రాత అనడంలోని భావం- బ్రహ్మగారి దస్తూరీ గజిబిజిగా ఉంటుందని కాదు కాలగమనంలో - భవిష్యత్తులో రాగల పరిణామాలు, మానవుని జీవిత పథం- వీనినే కదా తలవ్రాత అనీ, బ్రహ్మరాత అనీ వ్యవహ స్తారు? బ్రహ్మవ్రాతను తెలుసుకోవడం అంటే- వాటిని తెలుసుకోవడమే కదా? ఏ క్షణంలో ఏమి జరుగుతుందో తెలుసుకొనడం ఎవరి తరమూ కాదు. అదే విషయాన్ని మరొక మాటలో చెప్పాలంటే- బ్రహ్మవ్రాత ఎవరికీ తెలియదు- అనే కదా?

మన విశ్వాసం- బ్రహ్మ అనగా సృష్టికర్త- మానవుని నుదుటిపై మూడు గీతలలో వాని భవిష్యత్తును లిఖిస్తాడనీ, ఆ లిపిని ఎవ్వరూ చదవలేరనీనూ.

సారాంశంగా- ఏ వ్యక్తి జీవిత గమనం ఎలా ఉండేదీ ఎవ్వరికీ తెలియదు— అనే భావమే దీనిలో కనబడుతుంది ఏ వ్యక్తి జీవితం ఎలా ఉండేదీ' సృష్టికర్త వారి ముఖాన ఏమి వ్రాసినదీ అర్థం చేసుకొనడం సాధ్యంకాదు- అనడమే— బ్రహ్మవ్రాత అర్థంకాదు - అనడంలోని అభిప్రాయం కాలగమనంలో వ్యవహారంలో, అర్థకాని దస్తూరీని బ్రహ్మరాత అనడం అలవాటయింది.

## 88 ప్రశ్న : గుడిలో డబ్బు హుండీలో వేయడం ఎందుకు?

సమాధానం :-

దేవాలయాలు పూర్వం కళలకూ, విద్యలకూ, శాస్త్రాలకూ ఆలవాలమై గొప్ప సాంస్కృతిక కేంద్రాలు విలసిల్లేవి. దేవాలయాలు స్వతంత్ర వ్యవస్థలుగా ఉంటూ, విద్యలనూ, శాస్త్రాలనూ, కళలనూ పోషించేవి. ఎందరో శాస్త్రకారులు, పండితులు, కళాకారులు,— దేవాలయాలచేత పోషింపబడుతూ ఉండేవారు. అట్టి ధార్మిక వ్యవస్థల పోషణ నిమిత్తం సంపన్నులు ఆలయాలకు ఎన్నో మాన్యాలు ఇవ్వడం జరిగేది.

దానికి ప్రతీకగానే గుడిలో డబ్బువేసే ఆచారం మిగిలిపోయింది. ఆలయ నిర్వహణకు, ధూప దీప నైవేద్యాలకు అది ఉపకరిస్తుంది. భగవంతుని పసిపిల్లలను, వృద్ధులను, గర్భిణులను — వట్టిచేతులతో చూడబోరాదనే ఆచారం కూడా మనకున్నది. "రిక్తహస్తేన నోపేయాత్ రాజానాం దైవతమ్ గురుమ్"— అనేదాని భావం రాజు (ఏలిక)నూ, దైవాన్నీ, పెద్దలనూ వట్టి చేతులతో సమీపించరాదని, భగవంతునికి అర్పించదలుచుకున్న ఎన్నో ఉపచారాలకు ప్రతిగానూ, ఆయా సేవలలో మనమూ పాలుపంచుకుంటున్నామనే దానికి నిదర్శనంగానూ ఈ చర్య.

ఈనాడు పెద్ద పెద్ద దేవాలయాలకు వచ్చే ఆదాయం వల్ల— ఆలయ నిర్వహణ జరగడంతోబాటు— ఇంకా ఎన్నో సంస్థలు— విద్యాలయాలు, వైద్యశాలలు వంటివి ఎన్నో స్థాపించబడి పోషించబడుతున్నాయి కదా!

89 ప్రశ్న : శివ పార్వతులు కొలువై ఉన్న కైలాస పర్వతాన్ని అవలీలగా ఎత్తగలిగిన రావణాసురుడు-మిథిలా నగరంలో శివ ధనుస్సును ఎందుకు ఎత్తలేకపోయాడు?

సమాధానం :

రావణాసురుడు సీతా స్వయంవరానికి రానూ లేదు; శివ ధనువును ఎత్తడానికీ, ఎక్కుపెట్టడానికి ప్రయత్నమూ చేయలేదు.

వాల్మీకి రామాయణాన్ని అనుసరించి - రావణుడు సీతా స్వయంవరానికి రానేలేదు.

అవాల్మీకాలైన ఎన్నో కథలు రామాయణానికి చేరాయి. వానిలో ఇదీ ఒకటి. ఇది వాల్మీకంలో లేనిది.

ఇక రావణుని శక్తిసామర్థ్యాలను గురించి ఇదే గ్రంథంలో వివిధ ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలతో ప్రస్తావించాను.

**90 ప్రశ్న :** బ్రహ్మదేవుడు వివాహితుడు కదా? పెళ్ళి కానివారిని బ్రహ్మచారులు అని ఎందుకు అంటారు?

**సమాధానం :**

త్రిమూర్తులలోనివాడూ, సరస్వతీ నాదుడు అయిన బ్రహ్మదేవునికీ బ్రహ్మచారికీ సంబంధంలేదు. వేద, ఉపనిషత్ ప్రతిపాదితమైన - బ్రహ్మ పదార్థమనే మహాశక్త్యానికి సంబంధించి ఈ బ్రహ్మ శబ్దాన్ని వాడకం జరిగింది.

"బ్రహ్మణి చరతీతి ఇతి బ్రహ్మచారీ—"

ఆ బ్రహ్మ పదార్థాన్ని తెలుసుకొనే అన్వేషణామార్గంలో ఉన్నారనే అర్థంతో చేసిన పదప్రయోగం ఇది.

ఐహిక లంపటాలకు దూరంగా, బ్రహ్మ పథానువర్తిగా, బ్రహ్మ మార్గగామిగా ఉన్న వ్యక్తి - అని చెప్పడమే ఈ శబ్ద పరమార్థం.

**91 ప్రశ్న :** ఓం నమో నారాయణ అనే దాన్ని అష్టాక్షరీ మంత్రంగానూ, ఓం నమశ్శివాయ అనే దాన్ని పంచాక్షరీ మంత్రంగాను, చెబుతారు. నిజానికి ఓం నమశ్శివాయ అనేది షడక్షరిగాను, ఓం నమో నారాయణ అనేది సప్తాక్షరి గానూ కావాలి కదా? పండితులు వివరించాలి.

**సమాధానం :**

అష్టాక్షరీ మంత్రం

"ఓం నమోనారాయణ" కాదు, "ఓం నమోనారాయణాయ" ఇది ప్రణవ సహిత అష్టాక్షరి. 'నమశ్శివాయ' అనేది ప్రణవరహిత పంచాక్షరి.

మంత్రద్రష్టలైన మహర్షులు, మంత్రాలను బీజాక్షర ప్రాణశక్తి వంతాలుగా దర్శించారు.

అ+ఉ+మ=ఓమ్ అనే ప్రణవనాదం ఈ విధంగా ఏర్పడింది. ఇది బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపాలైన 'అ, ఉ, మ' అనే శబ్దాలను కలిగి ఉంది. 'నమశ్శివాయ'లో శివశబ్దం శివునికి, శక్తికి కూడా వర్తిస్తుంది. అంతేగాక ఈ శబ్దం బ్రహ్మవిష్ణు మహేశ్వరత్రయానికి, లక్ష్మి సరస్వతీ పార్వతీ త్రిమూర్తులకూ కూడా వర్తిస్తుంది దీనిని ప్రణవరహితంగా అనుష్ఠించినా కూడా, దానితో ప్రణవం (ఓకారం) ఉన్నట్లే.

**92 వ ప్రశ్న : అరవై సంవత్సరాలకు షష్టిపూర్తి ఉత్సవం చేయడానికి విశేషకారణమేమైనా ఉన్నదా?**

**సమాధాన :**

అరవై సంవత్సరాలకు షష్టిపూర్తి కార్యక్రమం చేసుకొనడం—అనే సంప్రదాయం ఏర్పడడానికి-విశేషమైన శాస్త్రప్రమాణం ఉన్నది. అది ఒక వేడుకకొరకు ఏర్పరచినది కాదు ఆవిషయమై సమగ్రమైన శాస్త్రప్రమాణాన్ని ఈక్రింద ఇస్తున్నాను.

"జన్మతః షష్టిమేవర్షే మృత్యు ఉగ్రరథాన్నృణాం।
షణ్మాసాన్ మృత్యుమాప్నోతి ధనహానిశ్చ జాయతే॥
పుత్రనాశో దారనాశః ధననాశస్తదైవచ।
తద్దోష శమనార్థాయ శాంతిం కుర్యాత్ విచక్షణః॥
జన్మాబ్దే జన్మమాసేచ స్వ జన్మ దివసే తథా।
జన్మర్క్షే చైవ కర్తవ్యా శాంతిః ఉగ్రరథాహ్వయా॥"

పై శ్లోకాలకు భావమేమంటే-60వ సంవత్సరం ప్రవేశించినది మొదలుగా 'ఉగ్రరథ' మనే పేరుగల మృత్యువు మానవుని వెంటాడుతూ ఉంటుంది. దాని ప్రభావంవల్ల మానవునికి 60వ సంవత్సరం ప్రవేశించినది మొదలు 6నెలల కాలంలో మృత్యువు, ధనహాని, భార్యానాశనం, పుత్రనాశనం-వంటి ఎన్నో

అనర్థాలు కలుగుతాయి. ఆదోషనివృత్తికొరకు 'ఉగ్రరథశాంతి' అనే పేరుగల శాంతిక్రియను ఆచరించాలి. షష్టిపూర్తి సందర్భంగా ఆచరించే క్రియాకలాపానికి-ఉగ్రరథశాంతి'అని పేరు.

ఉగ్రరథశాంతి అనబడే ఈ షష్టిపూర్తి శాంతిక్రియను-జననంనుండి 60వ సంవత్సరం ప్రవేశించినది మొదలుగా-60 సం.లు నిండేలోపున-జన్మమాసమూ, జన్మపక్షమూ, జన్మతిథి, జన్మవార జన్మనక్షత్రాలు కలిసివచ్చిన రోజున ఆచరించాలి. అవిధంగా సాధ్యంకాని పక్షంలో-60 సం.లు నిండేలోపుగా ఏ మాసంలోనైనా జన్మనక్షత్రంనాడు చేసుకోవచ్చును. ఉగ్రరథదోష పరిహారార్థం ఈశాంతి క్రియాకలాపాన్ని చేసుకొని తీరవలసిందని ధర్మశాస్త్రం విధించింది.

ఈ సందర్భంలో మరొక విషయం చెప్పవలసి ఉంది.

60వ. లకు షష్టిపూర్తి శాంతిక్రియలాగానే-70వ సంవత్సరంతో కూడా 'భీమరథ'మనే మృత్యుదోషపరిహారార్థంగా 'భీమరథశాంతి'ని జరిపించవలసి ఉన్నదని ధర్మశాస్త్రప్రమాణం ఉంది. అది ఈ క్రింద ఇస్తున్నాను.

"సప్తత్యాం జాయతే మృత్యుః నృణాం భీమరథాభిధః।
దారనాశః పుత్రనాశో ధననాశో రుజస్తథా।
షాణ్మాసాన్ మృత్యుమాప్నోతి విపత్తిర్మహతీ భవేత్।
తద్దోష శమనార్థాయ శాంతిం కుర్యాత్ యథావిధిః॥"

దీని భావం ఏమంటే-70వ సంవత్సరంలో భీమరథమనే మృత్యువు వల్ల మానవునికి భార్యాపుత్రధననాశనాలూ, మహావిపత్తు, తుదకు 6 నెలలలో మరణమూ వంటి ఆపదలెన్నో కలగుతాయనీ, ఆదోషనివారణకొరకు 'భీమరథ శాంతి'ని జరిపించాలనీ ధర్మశాస్త్రం చెప్తుంది

మానవుని 78వ సంవత్సరంలో 'విజయరథశాంతి'ని జరుపవలసి ఉందని కూడా ధర్మశాస్త్రంలో చెప్పబడింది.

కాబట్టి 60 సంవత్సరాలకు మాత్రమే కాక, పైన చెప్పబడిన ఆయా వయస్సులలో ఆయా శాంతిక్రియలను నిర్వహించడం-ఆయుష్కాముడైన మానవుని విధి.

జన్మాది 83 సంవత్సరాల 4 మాసాలకు వేయి చంద్రదర్శనాలు పూర్తి కాగలవు. ఆవయస్సున జరిపేది సహస్ర చంద్రదర్శనోత్సవం, లేదా సహస్ర మాసోత్సవం.

నూరేళ్ళు పూర్తిగా నిండిన ఆయుష్మంతులకు ఆ సమయంలో 'శతాభిషేక విధి'ని జరిపించడం శాస్త్రసమ్మతం.

## 93 ప్రశ్న : "క్రొత్త బిచ్చగాడు పొద్దెరుగడు" - అంటే ఏమిటి?

సమాధానం :

అలవాటుగా యాచనా వృత్తిలో ఉన్న వ్యక్తికి దానికి సంబంధించిన వేళలు, వీలు, దానిలోని సులువులు వగైరా తెలుస్తాయి కొత్తగా ఆ వృత్తిలో ప్రవేశించిన వానికి అవేమీ తెలియక తంగపడడం జరుగుతుంది. ఆ విధంగానే ఏదైనా ఒక పనిని క్రొత్తగా ఆరంభించిన వ్యక్తి, అందలి ఇబ్బందులూ, కష్ట సుఖాలూ ఎరుగక, కేవలము నూతనోత్సాహంవల్ల కలిగిన ఆరంభశూరత్వంతో క్రిందు మీదు అవుతున్నప్పుడు ఈ విధంగా పోల్చడం పరిపాటి.

## 94 ప్రశ్న : దేవాలయాలలో స్త్రీలను అర్చకులుగా ఎందువల్ల నియమించరు?

సమాధానం :

ప్రాణ ప్రతిష్ఠాపన చేసి అర్చన ప్రారంభించిన దేవాయతనంలో నిత్యమూ జరగవలసిన ధూపదీప నైవేద్యాలకు ఆటంకం కలగడానికి వీలులేదు ప్రాణ కళలతో ఆవాహన చేయబడిన అర్చామూర్తులు సాక్షాత్ దైవస్వరూపాలుగా భావించవలసి ఉంది. ఈ అర్చనలో ఎట్టి అంతరాయమూ రావడానికి వీలులేదని ఆగమశాస్త్రం విధించి ఉన్నది.

స్త్రీలకు ప్రకృతిసిద్ధంగా అశుచి కలిగే సమయాలలో దేవతార్చనకు ఆటంకం కలుగుతుంది కనుకనూ, స్త్రీలకు గర్భధారణ, ప్రసవం వంటి పరిస్థితులు కలుగుతాయి కనుకనూ, ఆయా సమయాలలో వారు దేవతార్చన నిర్వ

హించలేని స్థితిలో ఉంటారు కనుకనూ స్త్రీ-ను దేవలయార్చకులుగా నియమించే ఆచారం నెలకొల్పబడ లేదు.

## 95 ప్రశ్న : "నల్లేరుపై బండి నడక" అంటే ఏమిటి?

సమాధానం :

గ్రామాలలో మార్గాలు చిన్నగా ఉండక బాగా గోతులు, గొప్పలతో ఎగుడుదిగుడుగా ఉండడం పరిపాటి. అందునా పూర్వం ఈ మార్గాల పరిస్థితి మరీ అధ్వానంగా ఉండేది. అటువంటి గోతులలో ముఖ్యంగా వర్షాకాలంలో నీరు కూడా నిండి బండి నడకకు అవరోధంగా ఉన్నప్పుడు ఆ గోతులలో నల్లేరును వేసేవారు. మార్గాలపక్క ఎక్కడ పడితే అక్కడ కాడలవలె పెరిగే ఈ నల్లేరును గోతులలో వేయడంద్వారా - దానిపైనుండి బండి నడక సాఫీగా సాగిపోవడం వల్ల - అనాయాసంగా జరిగే కార్యాలకు ఆ విధంగా "నల్లేరుపై బండి నడక" అనడం అలవాటుగా మారింది.

## 96 ప్రశ్న : మతం అంటే ఏమిటి?

సమాధానం :

"మతం అనే పదానికి అభిప్రాయం అని మాత్రమే అర్థం ఉంది. మనం అనుకునే "రెలిజియన్" అనే అర్థం కాదు. "రెలిజియన్" అనే అర్థానికి సరిపడే పదం మన భారతీయ భాషలలో - ముఖ్యంగా సంస్కృతంలో - దర్శనం - అని, లేదా 'ధర్మం' అని.

మతం అనే పదాన్ని "స్కూల్ ఆఫ్ థాట్" అనే అర్థంలో పూర్వం నుంచీ వాడడం జరుగుతున్నది. ఉదాహరణకు, జ్యోతిశ్శాస్త్రంలో పరాశర మతం, జైమిని మతం-ఇత్యాదిగా వ్యవహరిస్తారు. ఈవిధంగానే సర్వ శాస్త్ర ప్రసంగ సందర్భాలలోనూ కూడా మతం అనే పదానికి ఇదే అర్థం ఉన్నది.

ఆ విధంగానే - ఒకే వైదిక ధర్మంలో అంతర్భాగాలైన వివిధ ఆరాధనా విధానాలను - శైవమతం, వైష్ణవమతం, శాక్తేయమతం, సౌరమతం, గాణాపత్యమతం, కౌమార మతం - అని వీటిని షణ్మతాలుగా పేర్కొనడం ఉంది.

ఈ సందర్భంలో కూడా - మతం అనే పదం - పైన చెప్పిన "స్కూల్ ఆఫ్ థాట్" అనే అర్థంలోనే ఉపయోగించబడింది.

## 97 ప్రశ్న : ముగ్గురు కలసి పనిమీద వెళ్ళకూడదంటారు. ఎందుకు?

సమాధానం :

జ్యోతిశ్శాస్త్ర ప్రకారంగా - మూడు అనేది కుజగ్రహం యొక్క సంఖ్య. అందువలన ఏ కార్య యత్నానికైనా ఈ సంఖ్యను విడిచిపెట్టడం జరుగుతుంది. కారణం - కార్యవిఘ్నం, హాని, కార్యభంగం, అనారోగ్యం, అగ్ని, శస్త్ర, చోరాది భీతి కారకుడైన అంగారకుని దుష్ప్రభావాన్ని పరిహరించాలనే ఉద్దేశం.

"ఇన శశి కుజ రాహుర్జీవ మందజ్ఞ కేతు భృగుజ ఇతి నవానాం కృత్తికాది క్రమేణ"- అనే ప్రమాణాన్ని అనుసరించి - గ్రహాల వరుసలో మూడవ స్థానం, మూడు అంకె - కుజునివి అయాయి. ఇది వింశోత్తరి దశాక్రమాన్ని తెలిపే వరుసక్రమం. వింశోత్తరి దశలు, లేదా ఉడు దశలు - ఈ వరుసలో రావడం జరుగుతుంది.

కుజునివల్ల కలిగే దోషాలలో - ఉష్ణవ్యాధులు, నేత్రవ్యాధులు, ప్రమాదాలూ, రక్తస్రావాలూ, స్రావదోషాలు, క్రిమిసంబంధమైన రోగాలు, పచూచి, కలరా, కర్ణవ్యాధులు, చిత్తచాంచల్యం, మూత్రాశయ వ్యాధులు, రక్తసంబంధమైన అన్ని వ్యాధులు, యుద్ధాలు, రక్తపాతం జరిగే అన్ని సంఘటనలు, రక్తపు గడ్డలు మొ॥ ఎన్నో ఉన్నాయి.

## 98 ప్రశ్న : సాత్వికాహారమే తినాలి అని అంటారు. ఎందుకు?

సమాధానం :-

మానవులలో సత్త్వ, రజస్తమో గుణాలు మూడు ఉన్నాయి. ఆహారం వల్లనే ఈ మూడు గుణాలూ కలుగుతాయని చెప్పబడింది. ఆయా ఆహార పదార్థాలు- ఆయా గుణాలను వృద్ధి చేస్తాయి కనుక, సాత్విక గుణాభివృద్ధిని కోరేవారు తదనుగుణమైన ఆహారాన్నే స్వీకరిస్తారు. రజస్తమో గుణాలను

వృద్ధిపరచే ఆహార పదార్థాలను నిషేధించడం జరుగుతుంది. ఈ విధమైన రజస్తమో గుణాలనువృద్ధి చేస్తాయి - కాబట్టి, ఉల్లి, వెల్లుల్లి వంటి వాటిని విడిచిపెడుతూ ఉంటారు.

మానవులు వారి వారి కర్మానుగుణమైన ఆహారాన్నే స్వీకరించాలనీ, ఆహారం నుంచి జీవులు, వారి గుణాలు, బుద్ధులు, ఉద్భవిస్తాయనీ శాస్త్రంలో చెప్పబడింది.

ఆధునిక పరిశోధనల వల్ల ఋజువైన విషయం కూడా ఇదే. ఏమంటే– మానవులు స్వీకరించే ఆహార పదార్థాలే వారి మనోభావాలకు ఆధారమౌతున్నాయని.

జర్మనీలోని ఎర్లాంజెన్ యూనివర్శిటీలో ప్రొఫెసరైన డాక్టర్ లుడ్ విగ్ డెమ్లింగ్ అనే శాస్త్రవేత్త ఈ క్రింది విధంగా సిద్ధాంతీకరించారు.

భుజించిన పదార్థాల కారణంగా జఠరకోశంలో రూపొందే అనేక రసాయనిక ద్రవ్యాల వల్లనే– మానవుల మనస్సులలోని అనేక మానసిక భావాలు, సంతోష విచారాలు, మానసికోద్రేకలు, కోపతాపాలు– కలుదుతున్నాయి. భుజించిన పదార్థాలవల్ల జీర్ణకోశంలో తయారైన రసాయనిక మార్పులే మానవ స్వభావ లక్షణాలను, మనోభావాలను ప్రభావితం చేస్తూ ఉండడం వల్ల విచక్షణతో ఆహారాన్ని స్వీకరించాలని ఈ జర్మన్ శాస్త్రవేత్త అన్నారు.

## 99 ప్రశ్న : జనకమహారాజుకు సీత భూమిలో దొరికింది. దాని అంతరార్థమేమిటి?

సమాధానం :

భూమిలో దాగిఉన్న దేవీ సౌందర్యాన్ని ప్రత్యక్షంగా దర్శించడానికి వీలుపడదు. భూదేవి తన అమేయ సౌందర్యాన్ని పచ్చదనం(గిసరి)రూపంలో వ్యక్తం చేస్తుంది. భూదేవి సహజశక్తియే సీతగా ఏర్పడింది. సీతాదేవి ప్రకృతి స్వరూపిణి.

సీత వృద్వీ తత్త్వస్వరూపిణి కుజగ్రహ ప్రాబల్యం కలిగిన స్త్రీ. ఆమె యొక్క సౌందర్యం, ఆకర్షణీయమైన స్వరూపం, సహనం, కష్టాలను సహించగలగడం, భర్తతో ఎడబాటు— మొదలైన లక్షణాలు— ఈ విషయాన్నే విశదం చేస్తున్నాయి. సీత భూమి నుంచి జనించడం అంటే, ఆమె యొక్క వృద్వీతత్త్వాన్ని తెలియజేయడమే- అనే నిగూఢ రహస్యాన్ని, కవి హృదయాన్ని, అర్థం చేసుకోవలసి ఉంది. దీనిని తత్త్వశాస్త్ర పరంగానూ, జ్యోతిశ్శాస్త్ర పరంగానూ కూడా వాఖ్యానించవచ్చును

సీత- భూదేవి కుమార్తె- అనడంలో- పైన చెప్పిన అంశాలే దాని అంతర్యం.

**100 ప్రశ్న :** సుమంగళులు వచ్చి వెళ్ళేటప్పుడు గృహిణి వారికి వసుపు, కుంకమ, పూలు, పళ్ళు, తాంబూలం ఇవ్వడంలోని అంతరార్థం ఏమిటి?

సమాధానం :-

"విద్యా సమస్తా స్తవ దేవి భేదాః స్త్రియః సమస్తాః సకలా జగత్సు" అని దేవి నుద్దేశించి మార్కండేయ పురాణంలో చెప్పబడింది.

భావం :- ఓ దేవీ! సర్వలోకంలోని సమస్త విద్యలూ, సర్వ స్త్రీలూ— నీ స్వరూపాలే.

లోకంలోని స్త్రీలందరూ దేవి కళలు కలిగి ఉంటారని ఈ విధంగా చెప్పబడిన దానిననుసరించి, స్త్రీలందరినీ దేవీ స్వరూపిణులుగా భావించి గౌరవించడం భారతీయ సంప్రదాయం. అట్టి దేవీ స్వరూపిణులైన స్త్రీలను అర్చించే విధానమే-వారికి ఆయా మంగళ ద్రవ్యాలను సమర్పించడంలోని అంతరార్థం. అది దేవీ ప్రీతికరమైన విషయమని అర్థమైన భావన.

**101 ప్రశ్న :** పంచమ వేదంగా చెబుతున్న భారతాన్ని 'మహాభారతం' అని ఎందుకు అంటున్నారు? భారత భాగవతాలకు 'మహా' చేరుస్తున్నప్పుడు, రామాయణానికి ఎందుకు చేర్చలేదు?

మాధానం :-

వాల్మీకియే తన కావ్యాన్ని "సీతాయాశ్చరితం మహత్" అని మహత్ బ్ద ప్రయోగం చేశాడు. కాబట్టి రామాయణానికి "మహా" అని చేర్చలేదనే ందేహం అవసరం లేదు. దానికి ప్రారంభంలోనే ఆ గౌరవాన్ని కట్టబెట్టడం జరిగింది అది నాటికీ, నేటికీ మహాకావ్యమే.

ఇక సామాన్య వ్యవహారంలో రామాయణాన్ని ఆ విధంగా పలకక పోవడానికి కారణం- రామాయణ కావ్యం ఇరవైనాలుగువేల శ్లోకాల గ్రంధం. భారత భాగవతాలు లక్షాధిక శ్లోకాలు గల గ్రంధాలు. వానిలో తక్కువది కాకపోయినా రాశిలో అంతకంటే బాగా చిన్నది కావడంవల్ల రామాయణాన్ని ఇలా వ్యవహరించడం అలవాటయింది.

అదీగాక, 'మహా' అని చేర్చినవే గొప్పవనీ, అలా చేర్చనివి తక్కువనే భావం అవసరం లేదు. వేద వేదాంగాలకూ, ఉపనిషత్తులకూ, ఉపనిషత్సార భూతమైన భగవద్గీతకూ కూడా ఆ శబ్దం చేర్చబడలేదు. అయినప్పటికీ వాటి యొక్క మహత్త్వానికి లోటు రాలేదు.

"మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే" - గొప్పదీ, బరువైనదీ కావడంవల్ల దాన్ని "మహాభారతం" అన్నారు. లక్ష శ్లోకాలు కలిగి — విషయ గౌరవం, పుస్తక గౌరవం - ఉండడంతో అది మహాభారతం అయింది. ఇక భాగవత విషయానికొస్తే - అది శ్రీ మద్భాగవతమే" కాని, మహాభాగవతం కాదు. అయితే భారత కర్తయే "(వ్యాసుడే)" భాగవతానికి కర్త కావడం చేతనూ, "భారత - భాగవత" అన్న పేర్లలో ఉన్న సామ్యం చేతనూ అది "మహా భాగవతం" అన్న భావం కలిగింది.

మహాభారత గ్రంథానికి ఆ పేరు తొలినుంచీ ఉన్నది కాదు. మహాభారత కర్త అయిన వ్యాస మహర్షి మొట్టమొదట తన గ్రంధానికి 'జయ'మని పేరు పెట్టాడు. భరత వంశ చరిత్ర కనుక భారతమనీ, పెద్ద గ్రంథం కనుక మహాభారతమనీ ఆ గ్రంథం వాడుకలోనికి వచ్చింది.

'జయ'మనే పేరుతో వ్యాసమహర్షి రచించిన ఈ మహాభారతం— అసంఖ్యాకమైన శ్లోకాలతో తొలుత రచించబడింది. ఈ గాథను వ్యాసుడు తొలుత శుకునికి బోధపరచాడు. ఈ గాథను వివిధ లోకాలలో ప్రచారం చేయడానికి వ్యాసమహర్షి అనేకులను నియోగించాడు. నారదమహర్షి దేవ లోకంలో ముప్పదిలక్షల శ్లోకాల గ్రంథాన్ని వెలువరించాడు. ఈ భారత గాథను దేవలుడు పితృలోకంలో పదిహేను లక్షల శ్లోకాల గ్రంథంగా విని పించాడు గంధర్వ యక్ష రాక్షస లోకాలలో 14 లక్షల శ్లోకాల గ్రంథంగా ఈ గాథను శుకమహర్షి ప్రచురపరచాడు. వ్యాసమహర్షి చెప్పగా వినాయకుడు వ్రాసిన గ్రంథం లక్షశ్లోకాలకు పరిమితమైంది. దీనినే భూలోకంలో వ్యాస శిష్యుడైన వైశంపాయనముని బోధించాడు. ఈ విధంగా మహాభారత గాథను వ్యాసమహర్షి నాలుగు రకాలుగా- మొత్తం 60 లక్షల శ్లోకాలతో రచించాడు.

**102 ప్రశ్న :** పార్వతి నలుపు అనీ, శివుడు తెలుపు అనీ పురాణాల్లో ఉండగా, నేడు చిత్రపటాల్లో ఈశ్వరుని నల్లగానూ, పార్వతిని తెల్లగానూ చిత్రిస్తున్నారు. ఏది యథార్థం?

**సమాధానం :**

పార్వతీదేవి ఆదిశక్తి- జగత్కారిణి అన్ని వర్ణాలూ ఆమెవే. ఆమె గౌరిగా పసుపువచ్చనిది. కాళిగా నల్లనిది. లలితగా, దుర్గగా అరుణ వర్ణాన్విత. (ఎర్రనిది.)

లలితా సహస్రనామాలలోని "విద్రుమాభాయైనమః" "బంధూక కుసుమ ప్రఖాయైనమః"-అనే వర్ణనలు అరుణవర్ణ శోభితయైన దేవీస్వరూపాన్ని తెలియ జేస్తున్నాయి.

ఆ విధంగానే "లసన్మరకత స్వచ్ఛ విగ్రహాయైనమః" అని అమ్మవారిని మరకత వర్ణస్వరూపిణిగానూ వర్ణించారు. మరకతం-ఆకుపచ్చ రంగు రాయి, నవరత్నాలలోనిది.

కాళిదాసకృతమైన శ్యామలాదండకంలో దేవిని "సర్వ వర్ణాత్మికే" అని

సంబోధించడం జరిగింది.

త్రిమాతలలో సత్త్వగుణ స్వరూపిణియైన సరస్వతి తెల్లనిదిగాను, రజోగుణరూపిణియైన లక్ష్మి ఎర్రని రంగు కలదిగాను, తమోగుణాత్మికయైన పార్వతి నల్లనిదిగాను చెప్పబడింది.

తొలుత నల్లగావున్న పార్వతి, తపస్సు చేసి బంగారు రంగును పొందిన ఉదంతం దేవీభాగవత గాథలలో ఉంది.

పై ఆధారాలను బట్టి పార్వతిని ఏ వర్ణంలో చిత్రించినా అది సమంజసమే అవుతుంది-ఆమె సర్వవర్ణాత్మిక కాబట్టి.

త్రిమూర్తులలో సత్త్వగుణాకారుడైన శ్రీమన్నారాయణుడు సృష్ట్యాది యందు ధవళవర్ణంలో ఉన్నాడని భాగవతం తెలుపుతుంది. రజోగుణరూపుడైన బ్రహ్మ ఎరుపురంగులోను, తమోగుణుడైన రుద్రుడు నల్లగాను ఉనట్లు చెప్పబడింది. శ్రీమన్నారాయణుడు కల్పాంతరంలో ఆకుపచ్చరంగుమా, అనంతరం నీలమేఘచ్ఛాయను పొందిన గాథ-భాగవతంలో ఉన్నది.

సదాశివుడు జ్ఞానస్వరూపుడు. జ్ఞానానికీ, సత్త్వగుణానికి ప్రతీక. తెలుపు రంగు. ఆవిధంగా శివుడు తెల్లనివాడు.

సమస్త సృష్టికీ లయకారకునిగా, తమోగుణరూపునిగా రుద్రుడు నల్లనివాడు.

తెలుపురంగు సత్త్వగుణానికి, ఎరుపురంగు రజోగుణానికి, నలుపురంగు తమోగుణానికీ ప్రతీకలు. ఆవిధంగానే శాంతస్వభావం, జ్ఞానం, తేజస్సు-మొదలైన ఉత్తగుణాలకు తెలుపురంగు ప్రతీక. అహంకారానికి, రాగభావానికి, కార్యోత్సాహానికి, కోపానికి ఎరుపురంగు చిహ్నం. అజ్ఞానానికి, అవివేకానికి, దుఃఖానికి నలుపురంగు చిహ్నం.

ఆయాగుణాలకు, సందర్భాలకు అనుగుణంగాను, భక్తులు తాము భావించే విషయాలకు, కోరే కోరికలనూ అనుసరించి దేవతలకు ఆయా వర్ణ స్వరూపాదులను ఆపాదించడం జరుగుతుంది.

సృష్టి కారకుడు బ్రహ్మ-ఎర్రనివాడు, రజోగుణ స్వరూపుడు. స్థితి కారకుడైన విష్ణువు ప్రథమకల్పంలో తెల్లనివాడని చెప్పబడింది. వృద్ధికి సంకేతం తెలుపు. లయకారకుడు శివుడు. నలుపు వినాశానికి గుర్తు, ఇవన్నీ ప్రతీకాత్మకాలుగా గ్రహించాలి.

**103 ప్రశ్న:** గాంధారీ ధృతరాష్ట్రులు తనకు అత్తమామలనీ, వారితో పాటు తాను కూడా అరణ్యానికి పోయి వారిని సేవించుకుంటాననీ-కుంతీదేవి ఆశ్రమవాస పర్వంలో చెబుతుంది. ధృతరాష్ట్ర పాండురాజులు అన్నదమ్ములు కదా! కుంతికి వారు అత్తమామలెలా కాగలరు? కుంతీదేవికి వారితో మరొక బంధుత్వం ఏమైనా ఉన్నదా?

**సమాధానం :-**

"రామం దశరథంవిద్ధి మాంవిద్ధి జనకాత్మజా
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్॥"

—అని సుమిత్రా దేవి లక్ష్మణునికి బోధించింది, అరణ్యవాసి కాబోతున్న శ్రీరామచంద్రునితో తాను అడవికి వెళ్ళబోతున్న లక్ష్మణునికి ఆ తల్లి చేసిన ఉపదేశమిది.

"నాయనా! నీ అన్న శ్రీరాముని మీ తండ్రిగారైన దశరథమహారాజు వలెనూ, జానకీదేవిని నా వలెనూ-గ్రహించు. (అన్నను తండ్రిగా, వదినను తల్లిగా భావించు.) అడవినే అయోధ్యగా భావించు సుఖంగా వెళ్ళిరా తండ్రీ!" అని చెప్పింది సుమిత్ర.

అన్నగారిని, ముఖ్యంగా పెద్దన్నగారిని-తండ్రిగాను; వదినను తల్లిగాను భావించమనడం మనకు క్రొత్తదికాదు ఉత్తమమైన ఆర్ష సంప్రదాయం అది. పరికించండి:

"అన్నదాతా భయత్రాతా విద్యాదాతా తథైవచ।
జనితా చ ఉపనేతాచ పంచైతే పితరః స్మృతాః॥"

"అన్నదాత, భయం నుంచి కాపాడిన వాడు, విద్యాదాత, జన్మకు కారకుడైనవాడు, ఉపనయనం చేసినవాడు-ఈ అయిదుగురూ తండ్రులుగా భావించవలసినది."

"గురు పత్నీ రాజ పత్నీ, జ్యేష్ఠ భ్రాతృ కుటుంబినీ।
పత్నీమాతా స్వమాతాచ పంచైతా మాతరః స్మృతాః॥"

"గురువు భార్య, రాజు భార్య, తన పెద్ద అన్నగారి భార్య తన భార్య యొక్క తల్లి, తనను కన్నతల్లి - ఈ అయిదుగురినీ తల్లులుగా భావించవలసినది."

ఆ విధంగా పాండురాజుకు మాతాపితృస్థానీయులైన గాంధారీ ధృతరాష్ట్రులను-కుంతి తనకు అత్తమామలుగా పేర్కొనడంలో అసంబద్ధమైన విషయమేమీలేదు.

అయితే, వారిని తనకు అత్తమామలతో సమానులనిగానీ, అత్తమామల వంటి వారనికానీ పేర్కొనక-"అత్తమామలే" అని నిర్ధారణగా చెప్పడంలోని అభిప్రాయం ఏమై ఉంటుందని కదా సందేహం।

గాఢమైన భావం కలచోట-ఆ విధంగా నిర్ద్వంద్వంగా, సందేహాతీతంగా స్పష్టపరచి చెప్పడం అసాధారణం కాదు ఉదాహరణంగా వీనిని గమనించండి.

"త్వమేవ మాతా చ పితా త్వమేవ,
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవదేవ॥"
"నీవే తల్లివి తండివి
నీవే నా తోడు నీడ నీవే సఖుడా
నీవే గురుడా దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా"।

పై సందర్భాలలో, "త్వమేవ" 'నీవే"-అంటూ సంశయాతీతంగా చెప్పడమే జరిగింది కాని," నీవు నాకు అంతకు సమానుడవు" అని చెప్పబడలేదు. నిర్ధార

జగా చెప్పడం కోసమూ, నిశ్చయాత్మకమైన తన మనఃస్థితిని వెల్లడించడం కొరకే కుంతి ఆ విధంగా చెప్పింది కాని, వారి మధ్య మరొక విధమైన చుట్టరికం ఏమీలేదు-భారతాన్ని తరచి చూస్తే ఆ విషయం అవగాహన కాగలదు.

104 ప్రశ్న : సంక్రాంతి మొదలైన విశేష దినాలు పుణ్యకాలమనీ, ఆ సమయంలో దానం చేయడం పుణ్యప్రదమనీ అంటారు. పుణ్యకాలమంటే ఏమిటి? అది ఎంతసేపు ఉంటుంది?

సమాధానం :

ప్రతి మాసంలోనూ సూర్యుడు ఒక రాశినుండి మరొక రాశిలోనికి ప్రవేశించడానికి సంక్రమణమని పేరు. సంక్రమణాలు సంవత్సరానికి పన్నెండు సూర్య సంక్రమణ సమయంలో ఏర్పడే పుణ్య సమయమే సంక్రమణ పుణ్యకాలం. ఈ సంక్రమణాలు పన్నెండూ పుణ్యకాలాలే. వీనిలో కొన్ని సంక్రాంతులలో సూర్యుని రాశి ప్రవేశానికి ముందు, మరి కొన్ని సంక్రాంతులలో సూర్యుని రాశి ప్రవేశానంతరమూ, ఇక కొన్నింటికి, సూర్యుని రాశి సంక్రమణ కాలానికి ముందు వెనుకలనూ - పుణ్యకాలమని ధర్మశాస్త్ర నిర్ణయం. సంక్రమణం అన్నా, సంక్రాంతి అన్నా ఒక్కటే.

1. మేష సంక్రాంతి : దీనికి 'వసంత విషువత్' అని పేరు. ఇది సౌర సంవత్సరాది. అనగా మొట్టమొదటి రాశియైన మేషరాశిలోని మొదటి నక్షత్రమైన అశ్వినీ నక్షత్రం యొక్క మొదటి పాదంలోని మొదటి బిందువులో సూర్యుని ప్రవేశ కాలం ఇది. ఈ మేష సంక్రాంతికి ముందు పది ఘడియలూ, ఈ సంక్రమణానికి తర్వాత పది ఘడియలూ పుణ్యకాలంగా చెప్పబడింది.

2. వృషభ సంక్రాంతి : దీనివల్ల ఏర్పడే పుణ్యకాలం - ఈ సంక్రమణ సమయానికి ముందు పదహారు ఘడియలు. దీనిని హరి పదపుణ్యకాలమని వ్యవహరిస్తారు.

3. మిథున సంక్రాంతి : దీనికి షడశీతి పుణ్యకాలమని పేరు. ఈ మిథున సంక్రాంతికి తర్వాత పదహారు ఘడియలు పుణ్యకాలం.

4 కర్కాటక సంక్రాంతి : దీనికి దక్షిణాయన పుణ్యకాలమని పేరు. ఈ సంక్రమణానికి ముందుగా ముప్పై ఘడియలు పుణ్యకాలం.

5. సింహ సంక్రమణము : దీనికి ముందు పదహారు ఘడియలు పుణ్యకాలం. దీనికి విష్ణుపదమని పేరు.

6 కన్యా సంక్రమణము : దీని ప్రవేశానంతరం పదహారు ఘడియలు పుణ్యకాలం దీనికి కూడా షడశీతి అని పేరు.

7. తులా సంక్రమణం : దీనికి ముందు పది ఘడియలూ, సంక్రమణం తర్వాత పది ఘడియలూ - పుణ్యకాలం. ఈ సంక్రాంతికి శరద్విషువత్ అని పేరు.

8. వృశ్చిక సంక్రాంతి : దీనికి ముందు పదహారు ఘడియలు పుణ్యకాలం. ఇది హరిపద పుణ్యకాలం.

9. ధనుస్సంక్రాంతి : దీని అనంతరం పదహారు ఘడియలు షడశీతి పుణ్యకాలం

10 మకర సంక్రాంతి : దీని తర్వాత ఇరవై ఘడియలు ఉత్తరాయణ పుణ్యకాలం.

11, కుంభ సంక్రమణం : దీనికి ముందు పదహారు ఘడియలు విష్ణుపద పుణ్యకాలం.

12. మీన సంక్రమణం : దీని అనంతరం పదహారు ఘడియల వరకూ షడశీతి పుణ్యకాలం.

రాత్రి సమయంలో సంక్రమణం జరిగినట్లయితే, సంక్రమణానికి ముందు పుణ్యకాలం గల సంక్రాంతులకు ముందురోజునా; సంక్రమణానంతరం పుణ్యకాలం గల సంక్రాంతులకు మరునాడు దినం ఉదయంనుండీ - పుణ్యకాలంగా పరిగణించాలి స్నాన, దాన, సంక్రాంతి వ్రతాదులను ఆ పుణ్యకాలంగా చెప్పబడిన నిర్దిష్ట సమయంలోనే చేసినట్లయితే - అంతులేని పుణ్యం కలుగుతుంది. సంక్రాంతి పుణ్యకాలాలలో చేయదగిన సంక్రాంతి వ్రతాదులున్నాయి. ఆ అంశంలో చెప్పవలసింది చాలా ఉంది.

**105 ప్రశ్న : చాతుర్మాస్య వ్రతం, వానప్రస్థాశ్రమ ధర్మం. వీని గురించి తెలియజేయండి?**

**సమాధానం :**

ఆషాఢశుద్ధ ఏకాదశినుండి కార్తీకశుద్ధ ఏకాదశి వరకూ చాతుర్మాస్య వ్రతాన్ని ఆచరించడం సంప్రదాయం. బ్రహ్మచారులు, యతులు, ఈ వ్రతాన్ని చేయదలచిన ఇతరులు - అందరూ ఈ నాలుగు నెలలూ ఏదో ఒకచోట కదలకుండా ఉండి ఆ వ్రతాన్ని సాగిస్తారు.

వర్షాలు కురిసి, మార్గాలు సుగమంగా ఉండని కాలమూ, వ్యాధులు అధికంగా ఉండే కాలమూ అయిన ఈ నాలుగు నెలలకూ-యమదంష్ట్రా కాలమని పేరు.

ప్రజలందరూ ఈ కాలంలో ఏదో ఒక నియమితస్థలంలో ఉండవలసిన అవసరం ఉంది. యతులకు కూడా ఇది వర్తిస్తుంది అంటువ్యాధులు ప్రబలే ఈ కాలంలో-సంచారం నిషిద్ధం. మానవ సంచారంవల్ల వ్యాధులు ఒకచోటునుండి మరొక చోటుకు త్వరగా వ్యాపిస్తాయి. అంటువ్యాధులూ, వానివల్ల మరణాలూ అధికంగా ఉండే కాలం కనుకనే, దీనిని యమ దంష్ట్రా కాలమన్నారు.

అందువల్లనే - వ్యాధులు జనసంచారంవల్ల త్వరగా ఒక ప్రదేశంనుంచి మరొక ప్రదేశానికి వ్యాపించగలవనే ఉద్దేశంతోనే - ఈ సమయంలో జన సంచారాన్ని నిషేధించారు - ధర్మజ్ఞులైన ఋషులు - చాతుర్మాస్య వ్రతాన్ని ఏర్పరచి - ఆ సమయంలో భగవదారాధనా తత్పరులై ప్రజలంతా ఉండేటట్లు విధించారు. రోగభూయిష్ఠమైన ఈ ఋతువులలో - ఏకాకులుగా ఉండే యతులకు, సన్యాసులకు, అవధూతలకు - గృహస్థులు సంరక్షణం చేయవలసిన ధర్మాన్ని విధించారు.

రోగాలూ వ్యాపించే ఈ సమయంలో - జనులందరికీ శ్రేయస్సు కలిగే నిమిత్తం - దైవానుగ్రహం కొరకు పరివ్రాజకులు చాతుర్మాస్య వ్రతాన్ని ఆచరిస్తారు. ఆ నిమిత్తంగా ఒక ప్రదేశంలో నిలిచి ఉండే పరివ్రాజకులకు (యతులు, సన్యాసులు, అవధూతలకు) సర్వసహాయాలూ గృహస్థులు చేయవలసి ఉంది.

మిగిలిన మూడు ఆశ్రమాల వారికి పట్టుకొమ్మ గృహస్థాశ్రమం అని కదా!

చాతుర్మాస్య వ్రతాన్ని యతులూ, సన్యాసులూ తప్పక చేయవలసి ఉంది. ఇతరులు కూడా కొందరు - ఆసక్తి కలవారు - చాతుర్మాస్య వ్రతాన్ని ఆచరించడం ఉంది. ఈ వ్రతానికి కొన్ని నియమాలు ఉన్నాయి. ఈ వ్రతాన్ని చేసే కాలంలో - అనగా ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలుకొని కార్తీక శుద్ధ ఏకాదశి వరకు - నిమ్మకాయ, గుమ్మడి, ముల్లంగి అలచందలు - ఈ పదార్థాలను తినకూడదు.

ఆషాఢ శుద్ధ ఏకాదశిని తొలి ఏకాదశి - అని అంటారు. ఈ రోజుతోనే చాతుర్మాస్య దీక్షకు ప్రారంభం, దీనిని 'తొలిఏకాదశి' - అని వ్యవహరించ డానికి కారణం అదే. ఈ ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు శ్రీ మహావిష్ణువు క్షీరసాగ రంలో శయనించి, ఈ నాలుగు నెలలూ నిద్రావస్థలో ఉంటాడని పురాణ వాక్యం శ్రీ మహావిష్ణువు శయనించే పవిత్ర దినం ఇది. ఆ కారణంగానే ఈ ఏకాదశిని 'శయనైకాదశి' అని పేర్కొంటాము. ఈ తిథినాడు విష్ణుమూర్తిని పురుషసూక్త విధానంగా పూజించి, ఉపవసించి, చాతుర్మాస్య వ్రతాచరణానికి సంకల్పం చేయాలి. ద్వాదశి తిథినాడు బ్రాహ్మణ భోజనానంతరం పారణం (భోజనం) చేయాలి. చాతుర్మాస్య వ్రతాన్ని చేసేవారు ఈ నాలుగు నెలలూ హరిధ్యాన తత్పరులై, ఏకాదశి ఉపవాస నియమన్నీ, ద్వాదశి పారణ నియమాన్నీ పాటిస్తూ గడపాలి. పైన చెప్పిన నిషిద్ధ పదార్థాలను తినరాదు.

శయనైకాదశి వెళ్ళిన మరునటి రోజు 'వాసుదేవ ద్వాదశి.' ఆ నాడు పన్నెండుమంది బ్రాహ్మణులను యథావిధిగా అర్చించి, వారికి నూతన వస్త్రాలూ, యజ్ఞపవీతమూ, ఉంగరమూ, జలపాత్ర. చేతికర్ర - వీటిని దానం చేయాలి. చాతుర్మాస్య వ్రత దినాలలో ఊరు విడిచి వెళ్ళరాదు.

భాద్రపద శుద్ధ ఏకాదశి - 'పరివర్తనైకాదశి'గా చెప్పబడింది. ఆనాడు విష్ణువు మరొక పార్శ్వానికి పరివర్తనం చెందుతాడు. కార్తీక శుద్ధ ద్వాదశి 'బోధనైకాదశి', అనగా విష్ణుదేవుడు మేలుకొనే పవిత్ర దినం. ఆ నాటితో చాతు

ర్మాన్య వ్రత దీక్షాకాలం పూర్తికాగలదు. ఆశాఢ ఏకాదశీవ్రతం మహాఫలం దాయకం.

ఇక వాన ప్రస్థాశ్రమం గురించి-

బ్రహ్మచర్య గృహస్థాశ్రమ ధర్మాలను సక్రమంగా నెరవేర్చిన గృహస్థులకు - మోక్ష సాధనా మార్గాని కనువైన మూడవ ఆశ్రమం వానప్రస్థం.

ఇది సన్యాసాశ్రమానికి ముందు మెట్టు; గృహస్థాశ్రమానికి తరువాతి మెట్టు.

గృహస్థులు భార్యాసమేతంగా ఈ ఆశ్రమం స్వీకరించవచ్చును.

కొంత వయసు మీరిన దంపతులు - ప్రాపంచిక విషయాలపై ఆసక్తిని వదులుకోవడంద్వారా మనశ్శాంతిని పొంది, భగవద్ధ్యానంలో తమ కాలాన్ని ప్రశాంతంగా గడపడమే ఈ ఆశ్రమానికి పరమార్థం. గృహవిషయాలలో లీనమై విశాంతి లేని జీవితాన్ని గడపడం మానుకొని - మానసిక పరిపక్వతను పొంది వనవాసులై ప్రవృత్తినుండి నివృత్తివైపుకు మరలడమే వానప్రస్థం. వయసు మీరిన దంపతులు కుటుంబ జీవితాన్ని విడిచి వనప్రస్థులు కావడమే వానప్రస్థం. అనగా అరణ్యవాసం చేస్తూ దైవధ్యానంలో గడుపుతారు.

## 106 ప్రశ్న: గణపతి రూపాలెన్ని?

సమాధానం :

1. లక్ష్మీగణపతి 2. క్షిప్రగణపతి 3. సిద్ధిగణపతి 4. చింతామణి గణపతి 5. శక్తిగణపతి 6. ఉచ్ఛిష్టగణపతి 7 ఏకాక్షర గణపతి 8. కుమార గణపతి. వీరు అష్టగణపతులు. వీరుగాక - 9. బాల గణపతి, 10. తరుణ గణపతి 11 భక్తగణపతి, 12. పీఠ గణపతి, 13 ధ్వజగణపతి, 14 పింగళ గణపతి, 15. విఘ్నరాజ గణపతి, 16. హేరంబ గణపతి, 17. మహా గణపతి, 18. భువనేశ గణపతి, 19. నృత్త గణపతి, 20 ఊర్ధ్వ గణపతి, 21. వల్లభా గణపతి, 22. శ్రీ గణపతి, 23. ప్రసన్న గణపతి.

ఈ విధంగా గణపతి రూపాలు అనంతమైనవి.

## 107 ప్రశ్న : సత్యనారాయణ వ్రతం చేస్తుంటారు కదా ! ఇది ఏ విధంగా ప్రాచుర్యంలోకి వచ్చింది ?

సమాధానం :

శ్రీ సత్యదేవ వ్రతకల్పం స్కాందపురాణంలోని రేవా ఖండంలో ఐదధ్యాయాలుగా ఉంది.

శ్రీ సత్యనారాయణస్వామి స్వయం వ్యక్తుడైన భగవానుడు. సాక్షాత్ విష్ణ్వవతారం మహా విష్ణువు అర్చావతారంగా ప్రసిద్ధ-గిరిక్షేత్రాలలో ఒకటయిన రత్నగిరి (అన్నవరం)లో నెలకొన్నారు. ఆకాశవాణి ఆ దేవుని నామాన్ని ప్రకటించినట్లు స్కాందపురాణంలో ఉంది.

త్రిపాద్విభూతి నారాయణోపనిషత్తు అష్టోత్తర శతోపనిషత్తులలో ప్రధాన మైంది. అధర్వ వేదంలోని దేవప్రి శాఖ, నారాయణోపనిషత్తు సూచించిన విధంగా రత్నగిరిలో శ్రీ త్రిపాద్విభూతి మహా నారాయణ యంత్రం పైన సత్యదేవుడు ప్రతిష్ఠితుడయినాడు.

ఆ స్వామి అనుగ్రహంకోసం చేసే వ్రతమే సత్యనారాయణ వ్రతం. ఆ వ్రతాన్ని మహా విష్ణువే లోకానుగ్రహార్థం నారదునికి చెప్పినట్టు పురాణాలు ఘోషిస్తున్నాయి.

ఒకప్పుడు నైమిశారణ్యంలో శౌనకాది ఋషులు సూతుని- "ఏ వ్రత తపాదుల వల్ల వాంఛిత ఫలప్రాప్తి కలుగుతుందో ఆ సర్వవిషయాలు తెలుపు" మని కోరారు. అతడు "పూర్వం నారద మహర్షి శ్రీమన్నారాయణుని ఈ విధంగా ప్రశ్నించాడు. అప్పుడు నారాయణుడు నారదునికి తెలియజేసిన విధానాన్ని మీకు తెలుపుతాను" అని అన్నాడు.

"నారదేనైవ సంపృష్టో
భగవాన్ కమలాపతిః,
సురర్షయే యథైవాహ
తచ్ఛృణుధ్వం సమాహితాః"

భూలోక వాసులయిన మానవులు తమ తమ దుష్కర్మల కారణంగా అనేక జన్మలు ఎత్తుతూ, పలు కష్టాలు పొందుతుండడం చూచి నారద మహర్షి చాలా జాలి చెంది, వీరి కష్టాలను ఎలా తొలగించాలి - అని చింతిస్తూ, విష్ణు లోకం చేరాడు. అక్కడ శుక్లవర్ణుడూ, చతుర్భుజుడూ, శంఖ, చక్ర, గదా, పద్మ, వనమాలా విభూషితుడైన శ్రీమన్నారాయణుని దర్శించి, నమస్కరించి,

స్తుతించాడు. శ్రీమన్నారాయణుడు "నీ రాకకు కారణమే"మని నారదుని ప్రశ్నించాడు

"దేవా! మర్త్యలోకంలో జనులంతా నానా క్లేశాలు పడుతున్నారు. వాటిని తొలగించడానికి సులభమార్గాన్ని చెప్పవలసిందని కోరడానికి వచ్చాను" అన్నాడు నారదుడు.

అప్పుడు శ్రీమన్నారాయణుడు "నారదా! లోకానుగ్రహ కాంక్షతో నీవు వేసిన ప్రశ్నకు మెచ్చాను. ఇహ పరలోకాల్లో సుఖాన్ని, మోక్షాన్ని ఇచ్చే సత్యనారాయణ వ్రతాన్ని నీ పట్ల స్నేహంతో చెబుతున్నాను" అని చెప్పి, వ్రత విధానాన్ని, ఫలాన్ని వివరించాడు.

"సాధుపృష్టం త్వయా వత్స
లోకానుగ్రహ కాంక్షయా,
యత్కృత్వా ముచ్యతే మోహాత్
తచ్ఛృణుష్వ వదామి తే,
వ్రతమస్తి మహా పుణ్యం
స్వర్గ మర్త్యేషు దుర్లభమ్,
తవ స్నేహాన్మయా వత్స
ప్రకాశః క్రియతేఽధునా,
సత్యనారాయణ స్యేదం
వ్రతం సమ్యగ్విధానతః
కృత్వా సద్య స్సుఖం భుంక్త్వా
చాముష్మి న్మోక్ష మాప్నుయాత్"

"ఈ వ్రతాన్ని వర్ణ వివక్ష లేక సకల జనులూ ఆచరించవచ్చు. కలియుగంలో వాంఛాసిద్ధి ప్రదమైన సులభ మార్గమిది" అని నారాయణుడు చెప్పాడు. కనుక ఇది చాలా ప్రాచుర్యం పొందింది.

"చాతుర్వర్ణ్యం వ్రతం కార్యం
స్త్రీభిర్వాపి మునీశ్వర

విశేషతః కలియుగే
లఘూని యోహి భూతయే॥

శ్రీమన్నారాయణుడు నారదునికి ఉపదేశించగా - నారదునివల్ల - ఈవ్రతం- లోకంలో వ్యాపించింది?

## 108 ప్రశ్న : దేవాలయాలపై నగ్నశిల్పాలు ఎందుకు ?

సమాధానం :

దేవాలయాలపైన నగ్నశిల్పాలు ఉండడానికి కారణం - కామశాస్త్రాన్ని ఒక కళగా ప్రాచీనులు ఉపాసించడమే. దీనికి నిదర్శనం - మహర్షియైన వాత్స్యాయనుడు కామసూత్రాలను వ్రాయడం.

ప్రాచీన కాలంలో దేవాలయాలు - కళా, విద్యా, సాంస్కృతిక కేంద్రాలుగా ఉండేవి. అందువలన-ఆ శాస్త్రానికి ప్రాచుర్యం లభించడానికీ - తద్వారా ఆశాస్త్రంతో ప్రజాబాహుళ్యానికి పరిచయం కలగడానికీ వీలుగా ఉండేటట్లుగా- కామశాస్త్రాన్ని శిల్పరూపంలో పదుగురూ సంచరించే దేవాలయాలపైన చిత్రీకరించారు.

## 109 ప్రశ్న: ఘంటాకర్ణునికి అష్టాక్షరి ఉపదేశించబోయినట్లు - అనే సామెతకు అర్థం ఏమిటి?

సమాధానం :

ఘంటాకర్ణుడు - విష్ణుద్వేషియైన ఒక రాక్షసుడు. అతడు - మితిమీరిన విష్ణుద్వేషం కారణంగా, తన చెవులలో పొరబాటున కూడా హరినామం పడరాదని - చెవులకు పెద్ద గంటలను వ్రేలాడదీసుకొన్నాడు. ఆ కారణంగానే అతడు ఘంటాకర్ణుడయ్యాడు.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః"

అన్నీ, శివ కేశవుల మధ్య భేదం చూచిన వారు నరకానికి పోతారనీ- నిర్ద్వంద్వంగా చెప్పబడింది.

కాగా - శివభక్తుడై, విష్ణునామాన్ని వినటాన్ని సహించలేని ఘంటాకర్ణునిది కరడుకట్టిన మూర్ఖత్వం, అట్టి మూర్ఖునికి - విష్ణుపారమ్యం కలిగిన అష్టాక్షరీ మహామంత్రాన్ని ఉపదేశించటం - అనవసరమనీ, వ్యర్థమనీ ఈ సామెతకు భావం.

మూర్ఖులకు, వివేకహీనులకు - వారికి సరిపడని హితోక్తులను ఉపదేశించడానికి ప్రయత్నించే సందర్భాలలో ఉదాహరణప్రాయంగా వినబడే నానుడి - "ఘంటాకర్ణునికి అష్టాక్షరి ఉపదేశించినట్టు" అనే ఈ పలుకుబడి

ఇతడు కాకుండా మరొక ఘంటాకర్ణుడున్నాడు. అతడు హరివంశంలోని విష్ణుభక్తుడైన ఒక పిశాచం. ఈ పిశాచం విష్ణుభక్తుడు. తన సర్వకర్మలనూ భగవంతునికి అర్పించే ఈ ఘంటాకర్ణుడనే పిశాచం - శ్రీకృష్ణుడు తపస్సుకు వెడుతుండగా శ్రీకృష్ణునికి కనిపించాడు. ఘంటాకర్ణుడు ఆ సందర్భంలో శ్రీకృష్ణునితో కొంత మాట్లాడడం, తాను ఉపాసించే దైవం ఆయనేనని తెలుసుకొనడం జరిగాయి. శ్రీకృష్ణుడు ఘంటాకర్ణుని భక్తికి మెచ్చి - అతడిని ఇంద్రపదవిలో నియమించాడు.

ఈ ఘంటాకర్ణునికి పై సామెతతో సంబంధంలేదు.

## 110 ప్రశ్న: "మనువు" అంటే అల్లసాని పెద్దన రాసిన మనుచరిత్రలోని వాడేనా?

సమాధానం :

అల్లసాని పెద్దన వ్రాసిన ప్రబంధం - "స్వారోచిషమను సంభవం." స్వారోచిష మనువుయొక్క జన్మవృత్తాంతం - దానిలో చెప్పబడింది. మనువు అతడొక్కడే కాదు. మనువులు మొత్తం 14 మంది. వారు - స్వాయంభువ మనువు, 2. స్వారోచిష మనువు, 3. ఉత్తమ మనువు, 4. తామస మనువు, 5. రైవత మనువు, 6. చాక్షుష మనువు, 7. వైవస్వత మనువు, 8. సూర్యసా

సావర్ణిక మనువు, 9. దక్ష సావర్ణిక మనువు, 10. బ్రహ్మ సావర్ణిక మనువు, 11. రుద్రసావర్ణిక మనువు, 12. ధర్మసావర్ణిక మనువు, 13. రౌచ్య మనువు, 14. బౌచ్య మనువు.

## 111 ప్రశ్న : పంచ యజ్ఞాలంటారు - అవి ఏవి ?

సమాధానం :

1. బ్రహ్మయజ్ఞము, 2. దేవయజ్ఞము, 3. పితృయజ్ఞము, 4. భూత యజ్ఞము, 5 మనుష్య యజ్ఞము.

బ్రహ్మయజ్ఞము : ఒక ఋక్కును గాని, యజుస్సును గాని, సామాన్ని కాని శక్తికొద్దీ నిత్యమూ అభ్యసించడం. అనగా నిత్య వేదాధ్యయనం.

దేవయజ్ఞము : దేవతా తృప్తికొరకై హవిస్సు మొదలైన దేవతా ప్రీతికరమైన పదార్థాలను స్వాహాకారంతో అగ్నిలో హోమం చేయడం.

పితృయజ్ఞము : పితృదేవతా ప్రీతికై స్వధాకారంతో తర్పణాలివ్వి, పితృదేవతలనూ, విశ్వేదేవతలనూ తృప్తిపరచే నిమిత్తం విప్రులకు భోజనం పెట్టడం. పితృదేవలతోబాటు విశ్వేదేవతలకు కూడా పితృయజ్ఞంలో స్థానం కల్పించాలని ధర్మశాస్త్ర విధి.

భూత యజ్ఞము : నిత్యమూ చేయవలసిన వైశ్వ దేవానుష్ఠానం చేసిన తర్వాత—ఆరు బయలు ప్రదేశంలో భూతతృప్తి (జీవరాసుల తృప్తి) నిమిత్తం భూత బలిగా ఇచ్చే ఆహార సమర్పణం. అంటే జీవులు తినడంకోసం కొంత ఆహారాన్ని సమర్పించడం.

మనుష్య యజ్ఞము : యథాశక్తిగా అతిధులకు భోజనం పెట్టడం.

## 112 ప్రశ్న : అష్టవిధ వివాహాలేవి?

సమాధానం :

1. బ్రాహ్మ వివాహం : సదాచారంగల వరునికి వస్త్రభూషణాదులిచ్చి పూజించి - అలంకరించిన కన్యకను అతనికి దానంచేసే వివాహం.

2. దైవ వివాహం : జ్యోతిష్టోమాది యజ్ఞాలను ప్రారంభించే సమయంలో ఆ యాగ కర్మను నడిపే ఋత్విజుని పూజించి అతనికి సన్మానపూర్వకంగా కన్యాదానం చేసే "దైవ వివాహం వివాహం" అనబడుతుంది.

3. అర్ష వివాహం : ధర్మం కొరకు వరునినుంచి రెండు గోవులను స్వీకరించి అతనికి కన్యను ఇచ్చి చేసేది అర్ష వివాహం.

4. ప్రాజాపత్య వివాహం : యోగ్యుడైన వరునిచేత - తాను గృహస్థాశ్రమంలోనే ఉంటానని వాగ్దానం చేయించుకొని కన్యాదానం చేసేది ప్రాజాపత్య వివాహం.

5. రాక్షస వివాహం : కన్యయొక్క బంధువులతో యుద్ధంచేసి కన్యను ఎత్తుకొని వచ్చి చేసుకొనే వివాహం రాక్షస వివాహం. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని వివాహమాడినది దీనికి ఉదాహరణం. దీనిలో మరొక విధానం కన్యను బలాత్కారంగా తీసుకొనివచ్చి వివాహం చేసుకొనడం.

6. అసుర వివాహం— కన్య యొక్క తల్లిదండ్రులకూ, కన్యకూ ధనమిచ్చి చేసుకొనే వివాహం అసురం.

7. గాంధర్వ వివాహం— పరస్పరము అనురాగం కలిగిన యువతీ యువకులు స్వతంత్రులై చేసుకొనే వివాహం గాంధర్వం. శకుంతలా దుష్యంతుల వివాహం దీనికుదాహరణం.

8 పైశాచిక వివాహం : నిద్రవల్లకాని, మత్తువల్లకాని, దేహస్మృతి లేని స్థితిలో ఉన్న కన్యను రహస్యంగా అపహరించి తెచ్చి చేసుకొనే వివాహం పైశాచికం.

## 113 ప్రశ్న : ఋణత్రయం అంటే ఏమిటి?

సమాధానం :-

మానవుడు పుట్టుకతోనే మూడు ఋణాలతో జన్మిస్తాడని చెప్పబడింది. ప్రతి మానవుడూ ఋషుల చేత చెప్పబడిన మార్గాన్ని అనుసరించి ఈ మూడు ఋణాలనుండి విముక్తుడు కావాలి.

1. దేవఋణం :- కాంతి, వాయువు, అగ్ని, జలం— వంటి ప్రకృతి శక్తుల పట్లనూ; కాలోచితంగా వర్షాన్నీ, ఎండనూ, చల్లదనాన్నీ ఇస్తూవున్న ఋతుదేవతల పట్లనూ, సహజ సంపదను ప్రసాదించిన ప్రకృతి దేవతల పట్లనూ తీర్చ వలసిన ఋణం. యజ్ఞ యాగాది క్రతుహోమాలను ఆచరించడం ద్వారా ఈ దేవ ఋణాన్ని మానవులు తీర్చుకోవాలి.

2. పితౄణం :- సత్సంతానాన్ని పొంది ఉత్తమ మానవజాతి పరంపరను, వేదాన్ని ఉపదేశించడం ద్వారా శిష్యపరంపరను— ఎడతెగకుండా కాపాడి— తన పూర్వుల ఋణాన్ని తీర్చుకోవాలి.

3. ఋషిఋణం:- సృష్ట్యాదిగా నేటివరకూ అనుస్యూతంగా అనంతమైన జ్ఞాన సంపద— ఋషులవల్ల వస్తూ ఉంది. దానిని ఎడతెగకుండా కొనసాగించిన మహాత్ముల పట్ల కృతజ్ఞతా సూచకంగా- విద్యాధ్యయన, విజ్ఞాన సముపార్జన విషయాలలో తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించి— తద్వారా విశ్వ విజ్ఞానాన్ని పెంపొందించడం - మానవుని కర్తవ్యం. ఆ విధంగా మానవుడు ఋషిఋణం నుంచి విముక్తుడవుతాడు.

**114 ప్రశ్న:** ద్వాదశాదిత్యు లెవరు?

**సమాధానం :-**

1. ఇంద్రుడు 2. ధాత 3. పర్జన్యుడు 4. త్వష్ట 5. పూషుడు 6. అర్యముడు 7. భగుడు 8. వివస్వంతుడు 9. విష్ణు 10. అంశుమంతుడు 11. వరుణుడు 12. మిత్రుడు- వీరు కశ్యపునకు అదితియందు కలిగిన ఆదిత్యులనబడే దేవజాతి. వీరికి తుషితులనే మరొక పేరు కూడా ఉంది.

**115 ప్రశ్న :** పురాణేతిహాసాలలో ఎక్కువగా వినిపించే అనేక ఆయుధాల పేర్లు ఉన్నాయి ఆ ఆయుధాలు మొత్తం ఎన్ని? వాటి పేర్లు ఏమిటి?

**సమాధానం :-**

పురాణేతిహాసాలలో పేర్కొనే ఈ ఆయుధాల సంఖ్య 32. వాటి పేర్లు-

1. బాణం 2. ఖడ్గం 3. తోమరం 4. స్తోమం 5. సృగం 6. చేరి 7. శక్తి 8. యష్టి 9. భిందివాలం 10 పరిఘం 11. పరశ్వధం 12. గద 13. ప్రాసం 14. ముద్గరం 15. ముసలం 16 శూలం 18 పాశం 18. చక్రం 19. ముసుండి 20. వజ్రం 21. దండం 22. హలం 23. అశని 24. కుంతం 25. అరిష్టం. 26 క్రకచం 27. పరశువు 28. శంఖువు 29. తోత్రం 30. వేణువు 31. త్రిశూలం 32 కుసూలం.

**116** బ్రహ్మాస్త్రం మొదలైన అస్త్రాలను అనేక చోట్ల ప్రస్తావిస్తుంటారు కదా? ఆ అస్త్రాల పేర్లు తెలియ జేయండి?

సమాధానం :-

నారాయణాస్త్రం, బ్రహ్మ శిరోనామకాస్త్రం, పాశుపతాస్త్రం, బ్రహ్మాస్త్రం, వైష్ణవాస్త్రం, వర్షాస్త్రం (మేఘాస్త్రం), ఆగ్నేయాస్త్రం, వాయువ్యాస్త్రం, వారుణాస్త్రం, ఐంద్రాస్త్రం, నాగాస్త్రం, జృంభకాస్త్రం, శబ్దభేది, సమ్మోహనాస్త్రం, మానవాస్త్రం, యమాస్త్రం, గంధర్వాస్త్రం, రౌద్రాస్త్రం, గారుడాస్త్రం, విద్యాధరాస్త్రం, పైనాకాస్త్రం, దండాస్త్రం, ఇషీకాస్త్రం, కంకణాస్త్రం, కంకాలాస్త్రం, కాందర్పాస్త్రం, కాపాలాస్త్రం, క్రౌంచాస్త్రం, నందనాస్త్రం, పైశాచాస్త్రం, ప్రమథాస్త్రం, శిఖరాస్త్రం, సత్యాస్త్రం, సోమాస్త్రం, గభస్తి- అస్త్రం. (గభస్త్యస్త్రం.)

**117 ప్రశ్న:** పద్నాలుగు లోకాలేవి?

**సమాధానం :-**

పద్నాలుగు లోకాలలో ఏడు ఊర్ధ్వలోకాలు; ఏడు అధోలోకాలు. అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళాలు- ఇవి అధోలోకాలు. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకాలు- ఇవి ఊర్ధ్వలోకాలు.

**118 ప్రశ్న:** అష్టదిక్పాలకు లెవరు? ఏయే దిక్కులకు ఎవరు అధిపతులు?

సమాధానం :-

తూర్పు దిక్కుకు అధిపతి ఇంద్రుడు, ఆగ్నేయానికి అధిపతి అగ్ని దేవుడు, దక్షిణ దిక్కుకు అధిపతి యముడు, నైరుతి దిక్కుకు అధిపతి నిరృతి, పడమర దిక్కుకు అధిపతి వరుణుడు, వాయువ్య దిక్కుకు అధిపతి వాయుదేవుడు, ఉత్తర దిక్కుకు అధిపతి కుబేరుడు, ఈశాన్య దిక్కుకు అధిపతి ఈశానుడు.

ఈశానుడనేది శివుని పంచముఖాలలో ఒకటి. శివుడు పంచముఖుడు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనేవి శివుని 5 ముఖాలు.

## 119 ప్రశ్న : అష్టదిక్పాలకుల భార్యలెవరు?

సమాధానం :-

ఇంద్రుని భార్య పేరు శచీదేవి, అగ్నిదేవుని భార్య పేరు స్వాహాదేవి, యముని భార్య పేరు శ్యామలాదేవి, నిరృతి భార్యపేరు దీర్ఘాదేవి, వరుణుని భార్యపేరు కాళికాదేవి, వాయుదేవుని భార్యపేరు అంజనాదేవి, కుబేరుని భార్య పేరు చిత్రరేఖాదేవి, ఈశానుని భార్య పేరు పార్వతీదేవి.

## 120 ప్రశ్న : అష్టదిక్పాలకులు పాలించే పట్టణాలేమిటి?

సమాధానం :-

ఇంద్రుని రాజధాని అమరావతి, అగ్ని పట్టణం పేరు తేజోవతి, యముని పట్టణం సంయమని, నిరృతి పట్టణం పేరు కృష్ణాంగన, వరుణుని పట్టణం పేరు శ్రద్ధావతి, వాయువు పట్టణం పేరు గంధవతి, కుబేరునిది అలకానగరం, ఈశానుని నగరం యశోవతి.

## 121 ప్రశ్న : అష్టదిక్పాలకుల ఆయుధాలు ఏవి?

సమాధానం :-

ఇంద్రుని ఆయుధం వజ్రాయుధం. అగ్నిదేవుని ఆయుధం శక్తి.

యముని ఆయుధం కాలదండం. నిర్బృతి ఆయుధం కుంతం. వరుణుని ఆయుధం పాశం. వాయుదేవుని ఆయుధం ధ్వజం. కుబేరుని ఆయుధం ఖడ్గం. ఈశానుని ఆయుధం త్రిశూలం.

**122 ప్రశ్న :** అష్టదిక్పాలకుల వాహనాలు ఏవి?

**సమాధానం :-**

ఇంద్రుని వాహనం మేఘం, ఐరావతం. అగ్ని వాహనం తగరు (మేక). యముని వాహనం మహిషం నిర్బృతి వాహనం గుర్రం, ప్రేతం. వరుణుని వాహనం మొసలి. వాయుదేవుని వాహనం లేడి. కుబేరుని వాహనం పుష్పకవిమానం, నరుడు. ఈశానుని వాహనం వృషభం (నదీశ్వరుడు)

**123 ప్రశ్న :** నవ వ్యాకరణవేత్త అని అంటారు అంటే ఏమిటి?

**సమాధానం :**

నవ వ్యాకరణ వేత్త అనగా - తొమ్మిది వ్యాకరణాలనూ నేర్చినవాడని అర్థం. ఆ తొమ్మిది వ్యాకరణాలూ ఈ క్రిందివి - 1. పాణినీయం, 2. కలాపం, 3 సుపద్మం, 4. సారస్వతం, 5. ప్రాతిశాఖ్యం, 6. కుమార వ్యాకరణం, 7. ఐంద్రం, 8. వ్యాఘ్ర భౌతికం, 9. శాకటాయనం.

**124 ప్రశ్న :** ఏకాదశ రుద్రులెవరు?

**సమాధానం :**

త్వష్ట, రుద్రుడు, హరుడు, త్రయంబకుడు, వృషాకపి, శంభుడు, కపర్ది, మృగవ్యాధుడు, శర్వుడు, అహిర్బుధ్న్యుడు, అజైకపాదుడు, వీరు దక్ష ప్రజాపతి కుమార్తెయైన సురభియందు జన్మించినవారు. ఈ వృత్తాంతం మార్కండేయ పురాణంలోనిది.

వీరి జన్మక్రమం మార్కండేయ పురాణంలోనూ, భారతంలోనూ బ్రహ్మవైవర్త పురాణంలోనూ కూడా ఉంది, వీరు బ్రహ్మ సంకల్పం చేత

స్మించారని మార్కండేయ పురాణంలోను, సురభికి మార్తాండుని వల్ల స్మించినట్లుగా భారతంలోనూ చెప్పబడింది భారతంలో వీరి పేర్లు - ఉగ్రుడు శ్వరూపుడు, బహురూపుడు, రైవతుడు, జపాలి, శంభుడు, వృషాకపి త్ర్యంబకుడు, అజపాదుడు, అహిర్బుధ్నుడు.

బ్రహ్మవైవర్త పురాణంలో కూడా - వీరు బ్రహ్మ లలాటంనుంచి న్మించినట్లు చెప్పబడింది. దానితో వీరి పేర్లు : మహత్తుడు, మహాత్మ, మతి ంతుడు, భీషణుడు, భయంకరుడు, ఋతధ్వజుడు, ఊర్ధ్వకేశుడు, పింగళా ుడు, రుచి, శుచి, కాలాగ్ని, రుద్రుడు

25 ప్రశ్న : అరవైనాలుగు కళలంటారు అవి ఏవి?

మాధానం :-

అరవైనాలుగు కళలు ఈ క్రిందివి.

1 ఇతిహాసం 2. ఆగమం 3 కావ్యం 4 అలంకారం 5. నాటకం . గానం 7. కవిత్వం 8. కామశాస్త్రం 9. దురోదరం 10 దేశభాషా పి జ్ఞానం 11. లిపి కర్మం 12. వాచకం 13. అవదానం 14. స్వరశాస్త్రం 5 శాకునం 16 సాముద్రికం 17. రత్నశాస్త్రం 18. రథకౌశలం 9. అశ్వకౌశలం 20. గజకౌశలం 21 మల్లశాస్త్రం 22 సూదకర్మం 3 దోహదం 24. గంధవాదం 25. ధాతువాదం 26. ఖనివాదం 27. రస ాదం 28. జలవాదం 29 అగ్నిస్తంభనం 30 ఖడ్గస్తంభనం 31 జల ంభనం 32 వాక్ స్తంభనం 33 వయః స్తంభనం 34. వశ్యం 35. కర్షణం 36 మోహనం 37. విద్వేషణం 38 ఉచ్చాటనం 39 మారణం 0. పాదుకాసిద్ధి 41 వాక్సిద్ధి 42. కాలవంచనం 43 పరకాయ ప్రవేశం 4 ఇంద్రజాలకం 45. అంజనం 46. దృష్టివంచనం 47 స్వరవంచనం 8. మణిమంత్రౌషధాదిసిద్ధి 49. చోరకర్మం 50. చిత్రక్రియ 51. లోహ ్రియ 52 అశ్మక్రియ 53 మృత్క్రియ 54. దారుక్రియ 55. వేణిక్రియ 6. చర్మక్రియ 57. అంబరక్రియ 58. అదృశ్యకరణం 59. దూతీకరణం 0. వాణిజ్యం 61. పాశుపాల్యం 62. కృషి 63. ఆసవకర్మ 64. ప్రాణి ద్యూతకౌశలం.

**126 ప్రశ్న :** దేవుడొక్కడే అయినపుడు ఇన్ని రూపాలూ, అవతారాలూ ఎందుకు? సృష్టిని నిర్దేశిస్తూ మంచి చెడులను నిర్ణయించే భగవంతుడు చెడును సృష్టించి, దానిని అమితంగా పెంచి, పెద్దచేసి చివరిదశలో చెడును నిర్జించడంకోసం ఓ అవతారాన్నెత్తడం గొప్పతనంకోసం కాకపోతే ఎందుకు ?

**సమాధానం :**

పంచదార ఒక్కటే అయినా - వ్యక్తిగతమైన ఇష్టా ఇష్టాలనుబట్టి దానితో నిర్మించుకొనే పదార్థాలు అనేకం. ఆ విధంగానే భగవంతుడు ఒక్కడే అయినప్పటికీ, అసంఖ్యాకులైన మానవుల అభిరుచులకు అనుగుణంగా వివిధ రూపాలు ఏర్పడ్డాయి.

అంతేగాక, వ్యక్తులు కోరే ఫలాన్ని బట్టి ఆరాధించవలసిన దేవతా స్వరూపాలు మారుతూ ఉండడమనేది ఉపాసనా విధానంలోని రహస్యం. దేవతా మూర్తులు, వారు ధరించే అలంకారాలు, ఆయుధాలు, మొదలైనవి అన్నీ కూడా ఉపాసనా విధిలోని అంతర్భాగాలు. ఈ విషయాలన్నిటికీ అంతరార్థాలున్నాయి. విస్తృతమైన వివరణ అవసరమైన అంశాలివి.

పై విషయానికి నిదర్శనంగా, ఒకే దేవతా మూర్తిని-ఉపాసనా విధానాన్ని బట్టి-వేర్వేరు పేర్లతో-వేర్వేరు అలంకారాలూ, ఆయుధాములతో ఆరాధించడం ఉంటుంది.

ఉదాహరణకు-లక్ష్మీగణపతి, సిద్ధిగణపతి, ఉచ్ఛిష్టగణపతి ఇత్యాదులు, ఈ దేవతా మూర్తులన్నిటికీ పైన చెప్పిన విధంగా వేర్వేరు లక్షణాలున్నాయి. అలాగే వాసుదేవుడు వేరు, నారాయణుడు వేరు, విష్ణువు వేరు ఒక్కడిగా భావించే ఈ స్వామియొక్క వివిధ మూర్తులు-వివిధ విషయాలకోసం భేదించడం జరుగుతుంది.

ఈ భేదాలు ఉపాసనా విధానానికి సంబంధించినవి. సర్వదేవతలూ ఒక్కటే నన్నది పరమార్థానికి సంబంధించినది.

ఇక సృష్టిలోని మంచిచెడులు, భగవంతుని అవతారప్రయోజనాల గురించి. కాలమనేది నిరంతర చలన శీలమైన ఒక చక్రనేమి క్రమం. ఆ క్రమంలో ఒక జాతికి గానీ, ఒక దేశానికి గానీ, యావత్‌సృష్టికి గానీ-సుఖ దుఃఖాలు, వృద్ధి క్షయాలు కలుగుతూ ఉంటాయి. వాటికి ఆధారభూతంగా కాలస్వభావంలో, ప్రకృతిలో మంచిచెడులనేవి ఏర్పడుతూంటాయి. ఎంతటి మహా నాగరికతకైనా వృద్ధిక్షయాలు తప్పనివి. ఇది సృష్టి లక్షణం. ఈవిధంగా ఈ కాల గమనంలో ఎన్నో మహానాగరికతలు, గొప్పజాతులు పుట్టి పెరిగి నశించాయి.

ఇక మిగిలిన జంతువులకు లేనిదీ బుద్ధిజీవి అయిన మానవునికి మాత్రమే ఉన్నదీ-విచక్షణాజ్ఞానం. సృష్టిలో బుద్ధిజీవులు మానవులు మాత్రమే కనుక ఈ మానవులు తమ బుద్ధితో, నిశ్చయజ్ఞానంతో, మంచిచెడులు ఆలోచించుకొని కర్మాచరణం చేయగలరు. కాబట్టి వారి కర్మకు వారే బాధ్యులవుతున్నారు. తదనుగుణంగా ఫలితాలు అనుభవిస్తున్నారు.

"శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కదలదు"-వంటి నానుడులు-మానవులు తమ ఘనకార్యాలకు అహంకరించకుండా ఉండేటందుకు పెద్దలు ఏర్పరిచినవి. భగవంతునిపై భారంవేసి కర్తవ్యాన్ని నిర్వహించమని ఉద్బోధించేవి.

మానవుల బుద్ధులు వక్రించి, వినాశనం వైపు దారి తీసినప్పుడు-సృష్టి యొక్క సుస్థితిని పునరుద్ధరించడమే భగవంతుడు అవతరించడంలోని ఉద్దేశం.

సర్వ జీవులకు పుట్టుక, పెరుగుదల, మరణం అనే దశలు ఎలా ఉన్నవో అదే విధంగా సృష్టికి కూడా అవే దశలున్నాయి.

సృష్టియొక్క అభ్యుదయానికి, జీవుల శాంతిసౌఖ్యాలకూ ఆటంకం కలిగించే దుష్టశక్తులను ఏరివేయడం-భగవంతుని విధానం. "చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు"-అనే సామెత ఉంది. మానవులకు కుక్కమూతి పిందెలు లాంటి దుష్టభావనలు కలిగి వారి బుద్ధులు వికటించినప్పుడు-అది సృష్టికి చెడు కాలం దాపురించింది-అన్నదానికి సూచన అన్నమాట. సృష్టికి పట్టిన చీడను

తొలగించడం, సృష్టిక్రమాన్ని తిరిగి పూలూకాయలతో కళకళలాడేటట్లు చేయడం సృష్టికర్త నియమం "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"-అని భగవంతుడు ఊరికానే చెప్పాడు.

కాలం యొక్క మరొక విచిత్రలక్షణం-ఏమంటే అవసరాలకు తగిన వ్యక్తులను సృష్టించుకొనడం. గాంధీజీ మొదలైన మహాపురుషులందరూ అవిధంగానే దేశ కాలానుగుణమైన అవసరాలకు తగినట్లు ఉదయించిన వారే.

127 ప్రశ్న : శ్రీకృష్ణుడు భారతంలో అనేక కుటిల తంత్రాల ద్వారా శత్రువులను కూల్చాడు. అలాంటివాడు దేవుడెలా అవుతాడు?

సమాధానం :

ఒక్క పాండవ పక్షంనుంచి మాత్రమే కాక, కౌరవపక్షం నుంచికూడా అంతకు మించిన అన్యాయాలు జరిగాయి-కురుక్షేత్ర యుద్ధంలో.

అభిమన్యుని వధ చాలా అన్యాయంగానూ, కుటిలత్వంతోనూ-ఒకపథకం ప్రకారం జరిగింది.

భీష్మాచార్యుడు అంపశయ్యాగతుడైన అనంతరం దుర్యోధనుడు-ద్రోణాచార్యులవారిని సర్వసైన్యాధిపతునిగా చేశాడు. దానికి సంతోషించిన ద్రోణుడు-దుర్యోధనునికి కోరిన వరమిస్తానని వాగ్దానం చేశాడు. ధర్మరాజును ప్రాణాలతో బంధించి ఇమ్మని, అతనితో మళ్ళీ జూదమాడి ఓడించి, శాశ్వతంగా అడవుల పాలు చేస్తానని అంటాడు దుర్యోధనుడు. అర్జునుడు దగ్గర లేకుంటేనే ధర్మరాజును బంధించగలనని ద్రోణుడు తెలిపాడు.

అప్పుడు సంశప్తకులనే జాతి వారిచేత అర్జునుని యుద్ధానికి ఆహ్వానింపజేసి, కురుక్షేత్రానికి అర్జునుని దూరంగా తీసుకొనిపోయే ఏర్పాటు చేశాడు దుర్యోధనుడు.

అర్జునుడు లేకుండా చూసి, ధర్మరాజును బంధించే ఉద్దేశంతో పద్మవ్యూహాన్ని రచించాడు ద్రోణుడు. దానికి ధర్మరాజు చింతిస్తుండగా-ప్రవేశమే తప్ప

పద్మవ్యూహానిష్క్రమణం తెలియని బాలుడు అభిమన్యుడు అందులో ప్రవేశించాడు. వెనుకవెళ్ళిన భీమాదులకు ఈశ్వర వరం పొందిఉన్న, సైంధవుడు అడ్డువడ్డాడు.

ఒంటరియైనా అభిమన్యుని వీరవిహారం భీమ్మలవారిని తలపించింది. తట్టుకోలేని ద్రోణ, కర్ణ, దుర్యోధన, దుశ్శాసనాదులంతా ఒక్కటై అక్రమంగా ఒంటరివాని మీద విరుచుకుపడి అభిమన్యుని అసహాయుని చేసి వధించారు.

దుర్యోధనుడు యుద్ధంలో పడిపోయిన తర్వాత అశ్వత్థామ అతనిని చూడరాగా. "అపాండవం" చేయమని కోరాడు దుర్యోధనుడు. తాను పాండవుల పట్ల చిన్ననాటినుంచీ చేసిన ద్రోహాలకు చివరి క్షణాలలోనైనా పశ్చాత్తాపం లేనివాడు దుర్యోధనుడు.

దుర్యోధనుని కోరిక మేరకు అర్థరాత్రి పాండవశిబిరాలలో చొరబడి-యుద్ధనీతికి విరుద్ధంగా ఉపపాండవులను బాలకులను నిద్రలో ఉన్నవారిని-ధృష్టద్యుమ్నునితో సహా-నిర్దాక్షిణ్యంగా గొంతులు కోసి చంపాడు అశ్వత్థామ.

పాండవుల పట్ల దుర్యోధనాదులు· ధృతరాష్ట్రుడు-ప్రదర్శించిన అనుచిత ప్రవర్తన వంటిది పాండవులేనాడూ ప్రదర్శించలేదు.

ఇక పాండవుల వైపునుంచి కర్ణవధ ఒక్కటి కొంత అనుచితంగా కనబడుతుంది. అదికూడా కౌరవపక్షం వారు చేసిన దుర్మార్గాలకు తగినవిధంగానే ఆయావ్యక్తులను శిక్షింపజేశాడు వాసుదేవుడు.

కృష్ణునికి అందరూ సమానమే. ఆయనకు అన్నీ సమానమే అనడానికి నిదర్శనం-కురువంశీయులవలెనే యదువంశీయులు కూడా అంతః కలహాలతో అంతరించిపోతారన్న గాంధారీశాపాన్ని చిరునవ్వుతో స్వీకరించాడు. తనవారైన యదువంశీయుల మరణాన్ని కాకుండా-తన మరణాన్ని కూడా తాను స్వచ్ఛంగా సమబుద్ధితో స్వీకరిస్తాడు శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణనిర్యాణానంతరం-కృష్ణుని తలచుకొని విలపిస్తున్న అర్జునుణ్ణి చూచి ధర్మరాజు తత్త్వార్థాన్ని విప్పి చెపీశతః నమమ్ చెబుతాడు. "కంటకం కంటకేనైవద్వయం చప్మీతః సయమ్" అంటాడు. కాలిలో విరిగిన ముల్లును తీయడానికి ముల్లునే ఉపయోగిస్తాం. తీసిన పిదప విరిగిన ముల్లును ఏవిధంగా పారవేస్తామో-దాన్ని తీయడానికి ఉపకరణంగా

ఉపయోగపడ్డ ముల్లును కూడా పారవేస్తాం ఈ రెండు ముండ్లూ సమానమే మానవదృష్టిలో. అలాగే భూభారం తగ్గిస్తానని భూదేవికి మాటిచ్చాడు భగవంతుడు. కృష్ణుడుగా అవతరించాడు. మహాయుద్ధం సంకల్పించాడు. మారణ హోమం చేయించాడు. ఈ కంటకాలను (ప్రాణులను-మానవులను) తొలగించ దానికై తానొక కంటకమై (శరీరధారియై) అవతరించి వచ్చాడు. భూమి నిష్కంటకమైంది. అవతార ప్రయోజనం నెరవేరింది. అందుకే ఈ కంటకాన్ని (తన శరీరాన్ని) త్యజించాడు. ఇంతవరకూ ఈ కంటకం (ఈ శ్రీకృష్ణశరీర) ఇతర కంటకోద్ధరణకై ఉపయోగపడింగి. ఇప్పుడిక ఈ కంటకం ఆ కంటకం అన్న భేదం లేదు. అంతా సమానమే ఆ లోకనాయకుని దృష్టిలో.

శ్రీకృష్ణుడు పూర్ణపురుషుడు. అన్ని అవతారాలలో కృష్ణావతారమే పూర్ణావతారమని ప్రసిద్ధి. అందుకే కృష్ణుణ్ణి గూర్చి చెప్పినప్పుడు "కృష్ణ పరమాత్మ" అనడం కద్దు. గ్రంథాలలోనూ, ఆర్యుల ప్రసంగాలలోనూ కూడా. ఈ పరమాత్మ శబ్దం ఇక్కడ యోగించినంత బాగా ఏ అవతారానికి యోగించదు. ఇదీ శ్రీకృష్ణుణ్ణి సందర్శించవలసిన కోణం.

## 128 అసిధారావ్రతమంటే ఏమి వ్రతం?

సమాధానం :-

అసిధారా వ్రతానికి నిర్వచనం ఈ క్రింది విధంగా చెప్పబడింది.

"శయన మధ్యే ఖడ్గం నిధాయ స్త్రీ పురుషౌ బ్రహ్మచర్యేణ స్వపతస్తత్।"

భావం :- శయ్యకు మధ్యగా ఖడ్గాన్ని ఉంచి, స్త్రీ పురుషులు ఉభయులూ ఏకశయ్యాగతులై బ్రహ్మచర్యనియమంతో నిద్రించే వ్రతమే అసిధారా వ్రత మని చెప్పబడింది.

"యత్రైక శయన స్థాపి ప్రమదా నోపభుజ్యతే।
అసిధారావ్రతం నామ వదంతి ముని పుంగవా॥"

భావం :- ఏకశయ్యలో తన చెంతనే స్త్రీ శయనించి ఉన్నప్పటికీ ఆమెను

భోగించని బ్రహ్మచర్య నిష్ఠయే అసిధారావ్రతంగా ముని శ్రేష్ఠులు వచించారు.

"యువా యువత్యా సార్థం యత్ ముగ్ధ భర్తవదాచరేత్।

అంతర్నివృత్త సంగస్స్యా దసిధారా వ్రతం స్మృతమ్॥"

భావం :- యువకుడు తాను యువతితో ఉన్నప్పటికీ- తన మనోవృత్తిని నియమించుకొని- సంగరహితుడై ఉండే నియమమే అసిధారావ్రతం అనబడు తుంది

ఈ వ్రతాన్ని అరణ్యవాసకాలంలో సీతారాములు ఆచరించారు. వారు అరణ్యవాసకాలం పదునాలుగు సంవత్సరాలూ కూడా బ్రహ్మచర్యనిష్ఠతో ఏకశయ్యతో శయనించారు. అదే విధంగా పాండవులు తమ వనవాస కాలంలో ద్రౌపదీ సహితులై ఉన్నప్పటికీ బ్రహ్మచర్య నిష్ఠను పాటించారు. వనవాస నియమంలో భాగంగా వారు బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించారు. వృద్ధులై వానప్రస్థాశ్రమ స్వీకారం చేసినవారూ, ఏదైనా నియమానికి లోబడి వన వాసం చెయవలసి వచ్చిన వారూ, తాము ఏ విధమైన వ్రతాన్నైనా తల పెట్టి ఆచరిస్తూ ఉన్నవారూ- వీరందరూ కూడా బ్రహ్మచర్యాన్ని ఆ వ్రతాచరణ కాలంలో ఆచరించవలసి ఉంది ప్రతి వ్రతానికి ఆహార నియమమూ, బ్రహ్మచర్యమూ- ఈ రెండూ ఆనుషంగికాలుగా ధర్మశాస్త్రాల చేత విధించబడి ఉన్నాయి. దేవకార్యాలు, పితృకార్యాలు- వేటిని ఆచరిస్తూ ఉన్న వారైనా- ఆ వ్రతాచరణకాలంలో దంపతులు బ్రహ్మచర్యాన్ని ఆచరించాలని ధర్మ శాస్త్రం.

ఐతే, కఠినమైన నియమపాలనానికి చిహ్నంగా కూడా ఈ 'అసిధారా వ్రతం' అనే ప్రయోగం చేయడం అలవాటుగా మారింది. 'అసిధారావ్రత'మనే పేరుగల ఒక వ్రతానికి సంబంధం లేకుండా కూడా ఈ పదబంధం వాడబడు తున్నది ఏ విషయానికి సంబంధించిన నియమమైనప్పటికీ- కఠిన నియమాన్ని పాటించవలసి వచ్చినప్పుడు దానిని అసిధారావ్రతంగా పేర్కొంటారు.

అసిధార అనగా కత్తి అంచు అని అర్థం. ఒక కార్యాన్ని అసిధారా వ్రతంగా చేస్తున్నారు- అనే ప్రయోగానికి అర్థం- ఆ వ్యక్తి ఆ కార్యాన్ని

అత్యంత ఏకాగ్రతతో, నియమవంతులై, ఏ మాత్రమూ ధర్మం తప్పని విధంగా చేస్తున్నారని.

"అసిదారాయాం స్థితిరివ దుష్కరం వ్రతం-" అంటే, కత్తి అంచు పైన నిలవడం వలె చాలా కష్టమైన వ్రతం- అని దీనికి అర్థం.

129 ప్రశ్న : గుడిచుట్టూ నాలుగువైపులా బలిపీఠం ఉంటుంది. ధ్వజ స్తంభం, బలిపీఠాలకు అన్నం ఆరగింపు చేస్తారు. దాని అంతరార్థం ఏమిటి?

సమాధానం :

ఆగమశాస్త్రరీత్యా-దేవాలయంలో వివిధదిక్కులలో వివిధ దేవతలను ప్రతిష్ఠించడం జరుగుతుంది.

వైఖానసాగమ ప్రకారం ఈశాన్యంలో శివుని, తూర్పున సూర్యుని, ఆగ్నేయంలో గణేశుని, దక్షిణంలో వింధ్యవాసినిని, నైరుతిషణ్ముఖు ; పశ్చిమంలో విష్ణువును; అష్టదిక్కులలో మాతృకలనూ ప్రతిష్ఠించవలసి ఉంది

ఈశానశివ గురుదేవ పద్ధతి ప్రకారం ఈశాన్యంలో శివుని, వాస్తుపురుషుని, చాముండిని, గణేశుని; తూర్పున సూర్యుని, గౌరిని, విష్ణువును, క్షేత్రపాలకుని, ఆగ్నేయంలో విష్ణువును, కాళిని; దక్షిణంలో గుహునీ, మాతృకలనూ; నైరుతిలో గణేశునీ; పశ్చిమంలో విష్ణువునూ, కార్తికేయునీ; వాయువ్యంలో జ్యేష్ఠా, చండీశ్వరులనూ; ఉత్తరంలో చండికా, మహాకాళీ, దుర్గా, క్షేత్రపాలక, మాతృకలనూ; మధ్యలో బ్రహ్మనూ; అష్టదిక్కులలో లోకపాలకులనూ ప్రతిష్ఠించాలి

కామికాగమం ప్రకారం ఈశాన్యంలో అగ్నినీ; తూర్పున సూర్యునీ; ఆగ్నేయంలో విష్ణువునూ; దక్షిణంలో బ్రహ్మవిష్ణువులనూ, నైరుతిలో సోముని; పశ్చిమంలో విష్ణువునూ; ఉత్తరంలో సోమునీ, శాస్తనూ; మధ్యలో సోమునీ, విఘ్నేశునీ, అష్టదిక్కులందు పార్వతీ, క్షేత్రపాల, సార్వదేశికులనూప్రతిష్ఠించవలసి ఉంది.

సమరాంగణ సూత్రధార ప్రకారం ఉత్తరంలో విశాఖ, స్కంద, సోమ, కుబేరులను; వాయువ్యంలో సర్ప, శని, కాత్యాయనీ దేవతలను; పశ్చిమంలో

సాగరం, నదీ, విశ్వకర్మ, ప్రజాపతి, వరుణులను; నైరుతిలో భద్రకాళి, పితరులను; దక్షిణంలో గణేశ, మాతృకా, యములను; ఆగ్నేయంలో సావిత్రి, మరుత్, మాపత, సనత్కుమారులను; తూర్పున సూర్య, విష్ణు, ఇంద్ర, ధర్మలను; ఈశాన్యంలో మహేశ్వర, శ్రీ, వహ్ని దేవతలను ప్రతిష్ఠించాలి.

ఇంకా మానసార, స్వస్తి, తంత్ర సముచ్చయాది గ్రంథాలలో వివిధ మత భేదాలతో విశేషంగా అనేక విషయాలు చెప్పబడ్డాయి.

కనుక, ఆలయంలో ప్రధాన దేవతలతో బాటు, అంగ, ప్రత్యంగ, ఆవరణ, పరివారపార్శ్వ-ఇత్యాది దేవతలందరికీ బల్యన్న నివేదనాది ఉపచారాలు చేయడం విధివిహితం బలిపీఠాలపై అన్నం ఉంచడం దానికొరకేనని గ్రహించాలి.

ఆయా దేవతలను ప్రతిష్ఠించకన్నా, వారంతా ఆయా దిక్కులలో ఉన్నట్లుగానే భావించి సర్వోపచారాలనూ వారికి చెల్లించాలి.

ఆలయ ప్రధాన దేవతలకు జరిగే కల్యాణాది ఉత్సవాలకు వారందరినీ ఆహ్వానించవలసి ఉంది.

**130** పెద్దవాళ్ళు పిన్నలను మన్నిస్తే ఆయుక్షీణం అంటారు. మరి అల్లుడి కాళ్లు కడిగి మామగారు నెత్తిన జల్లుకునే ఆచారంలోని ఔచిత్యం ఏమిటి?

**సమాధానం :-**

ఏదైనా ఒక దానం చేస్తున్నప్పుడు-ఆ గ్రహీతను సాక్షాత్ దైవ స్వరూపుడుగా భావించి సమర్పించడం వైదికమైన శిష్టాచారం.

వివాహమనేది లౌకికమైన క్రియాకలాపం కాదు. అది వైదికమైన సంస్కారం.

ధార్మికమైన గృహస్థ జీవనాన్ని నడపడం కోసం, ధర్మ ప్రజా సంవర్ధనం, పితృ ఋణ (పితౄణ) విమోచనం కోసం- చేసే అర్షక్రియ.

వరుని సాక్షాద్విష్ణు స్వరూపునిగా భావించి, కన్యాదాత అతనికి అర్ఘ్యం

పాద్యాది ఉపచారాలను సమర్పించి, అతని పాదాలను కడిగి, తన కుమార్తెను అతనికి సమర్పిస్తాడు. గృహ్యా సూత్రాలను పరిశీలించితే ఈ విషయం విశదం కాగలదు.

మహత్తరమైన పుణ్యం లభించడం కొరకు అలంకృతయైన ఈ నా కుమార్తెను దానం చేస్తున్నానని చెబుతాడు కన్యాదాత.

గృహ్యా సూత్రాలలోని వివాహ ప్రకరణంలోని ఈ మంత్రాలను పరిశీలిస్తే, వరుని పాదాలను కన్యాదాత కడగడంలోని అంతరార్థం బోధ పడుతుంది

"త్రిగుణీకృత అగ్నిష్టోమ, అతిరాత్ర, అప్తోర్యామ, సౌంతపన, వాజపేయ, పౌండరీక, అశ్వమేదాది శతక్రతు పుణ్యఫలావాప్త్యర్థం."

అనగా, అగ్నిష్టోమాది నూరు పేరున్న యజ్ఞాలను ఒక్కొక్కటి ముమ్మారు ఆచరించిన పుణ్యఫలాన్ని పొందుట కొరకు-

అంతా ఇంకా ఎంతగానో మహా పుణ్యఫలం ప్రాప్తించాలని ఎన్నెన్ని విధాలుగానో అనంత పుణ్యఫలాలు సిద్ధించాలని పేర్కొంటూ-

"మయా సహ దశ పూర్వేషాం దశ అపరేషాం మధ్యం శ్యానాం పితౄణాం నరకకాదు తీర్య శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం."
"స్వగృహ్యోక్త ప్రకారేణ"
"శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం"
"సాలంకృత సహిరణ్యోదక కన్యాదాన మహం కరిష్యే"-

అనగా- నాతో కలసి ముందు పది, వెనుక పది- తరాల వారు తరించుటకై, మా గృహ్య సూత్రాల ప్రకారంగానూ, శ్రీ లక్ష్మీనారాయణ దేవతా ప్రీతికొరకై, అలంకృతయైనదీ, బంగారముతో కూడినదీ అయిన కన్యను ఉదక సహితంగా దానం చేస్తున్నాను.

"శ్రీలక్ష్మీనారాయణ స్వరూపస్య ఇదమాసనం"
"ఇదం పాద్యం" "అమీగంధాః" "ఇదమర్ఘ్యం" "ఇమే అక్షతాః"

అనగా లక్ష్మీనారాయణ స్వరూపుడగు వరునకు ఆసనం, అర్ఘ్య

పాద్యాది ఉపచారాలనూ సమర్పించి, భగవత్స్వరూపుడుగా భావించిన ఆ బ్రహ్మచారి యొక్క పాదాలు కడిగి, కన్యాదానం చేయడం జరుగుతుంది.

**131 ప్రశ్న : స్నాతకం అయిన తర్వాత వరుడు నదిని దాటకూడ దంటారు. ఎందుకు?**

**సమాధానం :**

స్నాతకం అయిన తర్వాత వరుడు నదిని దాటరాదనే ఈ సంప్రదాయం ఏర్పడడానికి ఆధారం గృహ్య సూత్రాలలో ఉంది.

స్నాతకుడైన - అనగా స్నాతక వ్రతాన్ని పూర్తిచేసుకున్న బ్రహ్మచారికి - తమ కన్యనిస్తామనీ, స్వీకరించమనీ కన్యయొక్క తండ్రి లేదా సోదరుడు కోరిన తర్వాత - ఆ బ్రహ్మచారి తన అంగీకారాన్ని తెలిపి - వివాహ దీక్షను స్వీకరిస్తాడు. ఆ సమయంలో వరుడు - గృహస్థ దీక్షకు సంబంధించిన ప్రమాణాలను స్వీకరిస్తాడు. ఆ ప్రమాణాలలో "న సంశయ మభ్యా పద్యేయం" - ప్రాణ సంశయం కలిగించే సన్నివేశాంలోనికి ఉద్దేశ పూర్వకంగా ప్రవేశించను - అనేది కూడా ఒకటి. వరునికి ప్రమాదం జరుగకుండా ఉండేందుకు ఈ సంప్రదాయం ఏర్పడింది.

గృహస్థ ధర్మాన్ని స్వీకరించబోయే వరునిచేత - అతని క్షేమానికి, శ్రేయస్సుకు సంబంధించిన కొన్ని ప్రమాణాలను ఆ సమయంలో చేయించడం జరుగుతుంది. ప్రాణానికి ఆపద కలిగే సన్నివేశాలలోనికి అతడు ప్రవేశించరాదనేదే ఆ ప్రమాణాలయొక్క ఉద్దేశం. ఆ ప్రమాణాలు ఏమంటే-

నన క్తం స్నాయాం:- రాత్రి సమయములందు స్నానం చేయను.
న నగ్నం స్నాయాం :- వస్త్ర రహితంగా స్నానం చేయను.
వర్షతి న ధావేయం :- వర్షంలో తడువను.
న వృక్ష మారో హేయం :- వృక్షాలపైకి ఎక్కను.
న కూప మవరో హేయం:- నూతులలోనికి దిగను.
న బాహుభ్యాం నదీం తరేయం :- నదిని చేతులతో ఈదుతూ దాటను.

న సంశయ మభ్యావద్యేయం:- ప్రాణ సంశయం ఏర్పడే సన్నివేశాల లోనికి ఉద్దేశపూర్వకంగా ప్రవేశించను.

ఈ పై విధమైన ప్రమాణాలను చేసిన అనంతరం బ్రహ్మచారి - గురువు యొక్క అనుమతిని స్వీకరించి - గురువు పేరును మూడు పర్యాయాలు ధ్యానించి, నోటితో కూడా బిగ్గరగా పలికి,.

"హే వాసుదేవ! గార్హస్థ్యం వత్స్యామో భోః" - ఓ వాసుదేవా! ఇక మీదట నేను గార్హస్థ్యమందు వసించెదను"- అని చెబుతాడు.

వివాహమైన వ్యక్తి - పై ప్రమాణాలను దాటరాదు.

**132 ప్రశ్న :** ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాల వారూ తమ నిత్యాను ష్ఠాన సంకల్పంలో— 'శ్రీశైలస్య.... ప్రదేశే అని చెప్పు కొంటారు. శ్రీశైలానికి ఎందుకింత ప్రాధాన్యం?

సమాధానం :-

కర్మిష్ఠియైన వ్యక్తి తన నిత్యానుష్ఠాన విధిలో- "జంబూద్వీపే, భరత వర్షే భరత ఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య... ప్రదేశే ..." అని తన ఉనికిని శ్రీశైల క్షేత్రానికి అనుసంధించుకొని చెప్పడం సంప్రదాయం. నిత్య సంకల్పంలో ఈ విధంగా చెప్పే విధానాన్ని పూర్వ ఋషులు నిర్ణ యించారు.

శ్రీశైల క్షేత్రం అత్యంత ప్రాచీనమూ మహాప్రభావవంతమూ కావడం వల్లనే ఈ విధానం ఏర్పరచబడింది. ఈ అంశాలను నిరూపించే ఆధారాలెన్నో మనకు కనబడతాయి.

స్కాంద పురాణంలో ఇరవైరెండు అధ్యాయాల విస్తృతి కలిగిన శ్రీశైల ఖండం ఉంది. అష్టాదశ పురాణ కర్తయైన వేద వ్యాస మునీంద్రుడు— శ్రీశైల మహాక్షేత్రాన్ని గురించి సనత్కుమారుని ప్రశ్నించి తెలుసుకొన్న విశేషాంశాలు ఎన్నో దీనిలో పొందు పరచబడి ఉన్నాయి.

కృతయుగంలో హిరణ్యకశిపుడు, త్రేతాయుగంలో శ్రీరాముడు, ద్వాపరయుగంలో అరణ్య వాసానంతరం పాండవులు— శ్రీశైలక్షేత్రాన్ని

దర్శించి భ్రమరాంబా మల్లికార్జునును సేవించినట్లుగానూ, ఆ క్షేత్రంలో తమ తమ పేరిట శివలింగాలను ప్రతిష్ఠించి ఆలయాలను నిర్మించినట్లుగానూ ఋజువులున్నాయి. పురాణేతిహాసాలు ఈ ప్రత్యక్ష సాక్ష్యాలను బలపరుస్తున్నాయి. వారు నిర్మించిన ఆలయాలు శ్రీశైలంలో నేటికీ ఉన్నాయి. జగద్గురు శ్రీ ఆదిశంకరులు, ఆచార్య నాగార్జునుడు, ఛత్రపతి శివాజీ, శ్రీకృష్ణదేవరాయలు - ఇత్యాదులెందరో శ్రీశైలేశ్వరుని సేవించినట్లు—వారు అక్కడ చేయించిన నిర్మాణాలు సాక్ష్యమిస్తున్నాయి. శంకరాచార్యులవారి శివానందలహరితో ద్వాదశ జ్యోతిర్లింగ స్తవంలో శ్రీశైలలింగ స్తోత్రం ఉంది. ప్రతాపరుద్ర మహారాజు శ్రీశైల ఆలయానికి వసతులు కల్పించాడు 12వ శతాబ్దిలోని హొయసలులు పాతాళగంగ నుండి లింగాల కొరకు శిలలను తెప్పించిన శాసనాలున్నాయి. ప్రతాపరుద్రుని కాలంనాటికే శ్రీశైల దేవస్థానానికి - అనేక రాజులు భక్తులు సమర్పించిన 70 గ్రామాలు ఉండేవి. రెడ్డి రాజులకు సంబంధించిన వారనేకులు శ్రీశైలేశ్వరుని సేవించారు.

ఇంతేగాక, శివపురాణంలో వేదవ్యాసకృతమైన ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రంలో శ్రీశైల లింగ స్తోత్రం ఉండడం — శ్రీశైల ప్రాచీనతకూ, ప్రభావానికీ నిదర్శనం. ఇది జ్యోతిర్లింగమూ, శక్తిపీఠమూ కూడి ఉన్న అతి ప్రాచీనమైన శైవ క్షేత్రం.

చరిత్ర కందని కాలంనుంచీ మహావైభవంతో వెలిగిన మహత్తర క్షేత్రం శ్రీశైలం - నిత్యానుష్ఠాన సంకల్పంలో స్మరించబడడం సముచితమైన నిర్ణయం.

**133 ప్రశ్న :** మాంగల్యధారణ సమయంలో మూడు ముళ్లు వేయాలనీ, వధూవరులు ఏడడుగులు కలసి నడవాలనీ అంటారు. ఈ మూడు, ఏడు శుభసంఖ్యలే నంటారా? పెళ్ళి శుభకార్యం కదా? ఆ సంఖ్యలను ఎందుకు ఎంచుకున్నారంటారు?

**సమాధానం :-**

సప్తపది అనేది— వివాహకాండలో అతిముఖ్యమైన అంశం. ఒక్కొక్క వేదాన్నీ, ఒక్కొక్క ఋషినీ, ఒక్కొక్క సూత్రకర్త విధించిన విధానాన్నీ, ఆ సూత్రకర్త రచించిన సూత్ర భేదాలనూ అనుసరించి— వివాహ విధిలో కొన్ని అంశాలు పాటించబడడమో, లేదా లోపించడమో జరుగుతుంది. ఆ

రీత్యా వేద భేదాన్నీ, ఋషి భేదాన్నీ, సూత్ర భేదాన్నీ అనుసరించి— వివాహ విధిలో భేదాలున్నాయి. ఇటువంటి భేదం లేకుండా— వివాహ విధిలో అన్ని ప్రాంతాలలోనూ, అన్ని వర్గాలవారూ- భారతదేశమంతటా పాటించే అంశం సప్తపది. ఇది అన్ని వేదాలనూ, ఋషులనూ, సూత్రాలనూ అనుసరించి- భారతదేశమంతటా సర్వఋషుల చేతనూ అంగీకరించబడింది.

సప్తపది కానిదే వివాహవిధి సంపూర్ణం కాదు. దీనికి ప్రమాణం-
'నోదకేన నవా వాచా కన్యాయాః పతి రుచ్యతే।
పాణిగ్రహణ సంస్కారాత్, పతిత్వం సప్తమే పదే॥'

భావం : వరనిశ్చితార్థమూ, ఉదక సంహిత కన్యాదానమూ, మంగళ సూత్ర బంధనమూ— జరిగిన తర్వాత కూడా - సపపది జరుగనిదే పతిత్వం సంపూర్ణంగా సిద్ధించదు. పాణిగ్రహణానంతరం సప్తపది జరిగి, ఏడవ అడుగు కూడా పూర్తిగా పడచిన తర్వాతనే, వరునికి సంపూర్ణమైన పతిత్వం సిద్ధించ గలదు. ఈ విధి అంతా మంత్రపూర్వకంగా జరగవలసి ఉంది. సప్తపది కాకుండా, శేషించిన వివాహ విధి అంతా జరిగినా, వరుడు కన్యకు పతికాలేడు. మంత్ర యుక్తంగా సప్తపది సంపూర్ణం అయితేనే అతడు పతిత్వానికి అర్హుడు.

సప్త సంఖ్యకు సంస్కృతంలో దోషార్థం ఏమీలేదు. తెలుగులోనే అది కాకతాళీయంగా రోదన సంఖ్యగా పరిగణించబడుతూను ఉంది. ఆ విధమైన భావన ప్రామాణికం కాదు.

"సఖ్యం సా సప్తపదీశమ్"- అని సూక్తి ఈ సప్తపది వలన దంపతుల యందు సఖ్యభావమూ, పరస్పర అనుకూల్యమూ - వృద్ధి పొందుతాయని ఋషివాక్యం.

ఆ విషయానికి ప్రమాణంగా వివాహ విధిలో భాగమైన సప్తపదీ విధిని పరిశీలించవచ్చును.

గృహ్య సూత్రాలలోని సప్తపదీ మంత్రాలనూ, వాని భావాన్నీ పరిశీలిస్తే - సప్తపది యొక్క లక్ష్యం తెలుస్తుంది.

1. ఏకమిషే విష్ణుస్త్వా అన్వేతు.

2. ద్వే ఊర్జే విష్ణుస్త్వా అన్వేతు.
3. త్రీణి రాయస్పోషాయ విష్ణుస్త్వా అన్వేతు.
4. చత్వారి మయో భవాయ విష్ణుస్త్వా అన్వేతు.
5. పంచ పశుభ్యో విష్ణుస్త్వా అన్వేతు.
6. షడృతుభ్యో విష్ణుస్త్వా అన్వేతు.
7 సఖే సప్తపదా భవ సా మామనువ్రతా భవ విష్ణుస్త్వా అన్వేతు.

ఈ పైన చెప్పినది సప్తపదీ మంత్ర సప్తకం. వివాహ కాండలో వరుడు వధువును ఉత్తర దిశగా ఏడు అడుగులు వేయించి - ఈ పై మంత్రాలను చెబుతాడు. సప్తపదియొక్క భావం ఈ మంత్రాలలో చెప్పబడింది.

మంత్రార్థము:-

1. "ఓ సౌభాగ్యవతీ! శ్రీవిష్ణుభగవానుడు నిన్ను అభీష్టసిద్ధికై నాకు అనుకూలవతిని చేయుగాక!

2. గృహస్థాశ్రమ సత్కర్మలలో ధైర్య ఉత్సాహాది శక్తులు అభివృద్ధి పొందే నిమిత్తం నిన్ను నాకు విష్ణుదేవుడు అనుకూలవతిని చేయుగాక!

3. ధన ధాన్యాదుల అభివృద్ధిలోనూ, ఆ వస్తుసముదాయాన్ని అనుభవించి ఆనందించడంలోనూ శ్రీ విష్ణువు నిన్ను నాకు సహాయకురాలిని చేయుగాక!

4. సుఖ సౌఖ్య సాధనలో విష్ణుభగవానుడు నిన్ను నాకు సహయోగ చారిణిని చేయుగాక!

5. పశుపాలనయందునూ, విషయ సౌఖ్యాలలోనూ విష్ణుదేవుడు నిన్ను నాకు సహచారిణిని చేయుగాక!

6. షడృతువులలో ఏర్పడే యజ్ఞాది సత్కర్మాచరణాలలో నాకు సహధర్మాచరణం చేయుదువుగాక!

7. ఈ సప్తపది వలన నీవు సఖ్యభావాన్ని పొంది, నాయందు అనుకూలతను వహించి, నాకు అనువ్రతవు అగుదువుగాక! అట్లు విష్ణుదేవుడు అనుగ్రహించుగాక!"

పైన చెప్పిన సప్తపది మంత్ర సప్తకంతో ఏడడుగులూ నడచిన తర్వాత వరుడు నిలిచి - ఈ క్రింది మంత్రాలను చెప్పడం జరుగుతుంది. (వధువును ఉద్దేశించి)

"సఖా సప్తపదా భవ :-" ఈ ఏడడుగులతో నీవు నాకు సఖివి కమ్ము.

"సఖాయౌ సప్త పదాబభూవ : ఏడడుగులతో ఇద్దరూ సఖులైనారు.

"సఖ్యం తే గమేయం సఖ్యాత్" : సఖ్యంతో సహవాసం చేయుదము గాక.

"తేమా యోషం సఖ్యాన్మేమా యోష్ఠాః సమయావహ సంకల్పావహైః నాతో నివసించే నీవు నా సహవాసివి కమ్ము. మన మిద్దరమూ సఖ్యంతో సమయ సంకల్పాన్ని ఆచరించగలము.

"సంప్రియౌ రోచిష్ణూ" : వరస్పమూ మనము ప్రియులమై ప్రకాశించెదము

"సుమనసమాన్":- ఉత్తమమైన మనస్సులతో ప్రవర్తించేవారమై,

"ఇష మూర్జం అభిసంవసానౌ":- అభీష్టసిద్ధిలోనూ, ధైర్యోత్సాహశక్తుల అభివృద్ధిలోనూ సహవాసులమై,

"సం నౌ మనాంసి సంవ్రతా":- మన ఉభయుల మనస్సులు సమాన వ్రతములు కలిగినవై యుండి-

"సమ చిత్తా న్యాకరం":- సమచిత్తములకు మనం స్థానం అగుదుము గాక.

అప్పుడు వరునితో వధువు ఈ క్రిందివిధంగా చెబుతుంది.

సాత్వమసి అమూహం అమూహమస్మి" : నీవు పొరబాటులేక ఉందుము. నేను పొరబాటులేక ఉండగలను.

"సాత్వంద్యౌః అహం వృధివీ త్వంరేతో అహం రేతోభృత్":- నీవు ఆకాశం, నేను పృథ్వివి నీవు రేతమవు. నేను రేతమును ధరించెదను.

"త్వం మనో అహమస్మి వాక్":- నీవు మనస్సువు. నేను వాక్కును.

"సామాహమస్మి, ఋక్త్వం సామామను వ్రతాభవ:-" నేను సామమును, నీవు ఋక్కువు.

అప్పుడు వరుడు ఈ క్రింది విధంగా చెబుతాడు.

"పుంసే పుత్రాయ వేత్తవే శ్రియై ఉత్తరయ వేత్తావ ఏహి సూనృతే":-
ఓ సువ్రతా! పురుషత్వమూ సూనృతమూ, సంపదా కలిగిన పుత్రులను కనుము.

ఇక మూడు ముడుల గురించి ఏమంటే:-

మానవులు అవశ్యంగా పొందవలసిన ధర్మ విషయంలోను అర్థ విషయంలోను, కామ విషయంలోను - దంపతులు ఏకత్వాన్ని వహించారనడానికి అవి సంకేతాలు.

కన్యాదాన సమయంలో కన్యాదాత వరుని ఈ విషయంలో అనుశాసించడం జరుగుతుంది.

కన్యాదాత - "ధర్మేత్వయా ఏషానాతి చరితవ్యా-" అనగా "ధర్మాచరణమునందు నీవు ఈమెను అతిక్రమించి చరించరాదు." అని చెబుతాడు. "నాతిచరామి ("అతిక్రమించి చరించను") అని వరుడు ప్రమాణం చేయడమూ; అదేవిధంగా అర్థ కామాల విషయంలో కూడా కన్యాదాత ఆ విధంగానే చెప్పగా; "అతిక్రమించి చరించను" ('నాతిచరామి') అని వరుడు ప్రమాణం చేయడం జరుగుతుంది

వధూవరులు మూడు పురుషార్థాల విషయంలోనూ ఏకీభవించడమే మూడు ముడుల భావం.

134 ప్రశ్న: తులసియొక్క ప్రాశస్త్యం, గొప్పతనం ఏమిటి?

సమాధానం :-

పిపీలికాది బ్రహ్మపర్యంతమూ వ్యాపించి ఉండే పరమేశ్వర శక్తి-కొన్ని స్థావర జంగమ వస్తువులలోనూ, కొందరు వ్యక్తులలోనూ అధిక కళలతోనూ, విశేష విజృంభణ యుక్తమై ప్రకాశించడం అనుభవదూరం కాదు.

తులసి— అటువంటి— పరమేశ్వర శక్తి అధికంగా నిండి ఉన్న దివ్య వృక్షం. ఆధ్యాత్మిక దృష్టితోనూ, భౌతిక ప్రయోజనం రీత్యానూ కూడా తులసికి గల స్థానం అద్వితీయం.

"తులస్యారోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పాలితా।
ఆరోపితా ప్రయత్నేన చతుర్వర్గ ఫలప్రదా॥
తులసీ విపినస్యాపి సమంతా త్పావన స్థలం।
యోజన త్రితయం జ్ఞేయం గాంగేయ స్యేవ పాథసం॥
తులసీ కాననం చైవ గృహే యస్యావ తిష్ఠతే।
తద్గృహం తీర్థ భూతం హి నాయాంతి యమ కింకరాః॥

—అని అగస్త్య సంహితలో చెప్పబడి ఉంది. తులసిని నాటినా, నీటితో తడిపినా, చూచినా, తాకినా, పోషించినా, నాటడానికి ప్రయత్నించినా— మానవునికి ఆవశ్యకమైన చతుర్వర్గ ఫలాలనూ ప్రసాదిస్తుంది. తులసీవనం ఉన్న ప్రదేశం పరమ పావనమైనది. తులసీవనం ఉన్న ప్రదేశం నుండి మూడు ఆమడల పర్యంతమూ— గంగా తీర సమమైన పవిత్ర స్థలం. తులసీవనం ఉన్న ఇల్లు-పుణ్యతీర్థంతో సమానం.

"తులసీ కాననం యత్ర యత్ర పద్మవనాని చ।
సాలగ్రామ శిలా యత్ర తత్ర సన్నిహితో హరిః॥

తులసీ వనమూ, పద్మవనమూ, సాలగ్రామమూ, ఈ మూడూ ఉన్న చోట్లలో శ్రీహరి సన్నిహితుడై ఉంటాడు.

"ప్రదక్షిణం భ్రమిత్వాయే నమస్కుర్వంతి నిత్యశః
సప్త ద్వీపవతీం పృధ్వీం స రత్నాకర మేఖలాం।
దత్వా యత్ ఫలం నిత్యం ప్రాప్నువంతి న సంశయః।
అశుభాని వినశ్యంతి దురితాన్యపి దూరగః।
అనన్య దర్శనాః ప్రాతర్యే పశ్యంతి తపోధనః।
జగత్త్రిశయ తీర్థాని తైర్దృష్టాని న సంశయః॥"

నిత్యమూ తులసికి ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించిన వారికి- సప్త ద్వీప సహిత, రత్న సాగర మేఖల అయిన పృథ్విని నిత్యమూ దానం చేసిన ఫలితం లభిస్తుంది. అశుభాలు, పాపాలు దూరమవుతాయి ప్రాతఃకాలాన నిద్రలేవడం తోనే తులసిని చూచినట్లయితే- సమస్త తీర్థాలనూ చూచిన ఫలం కలుగుతుంది.

"యే స్మరంతి సకృద్దేవిం తులసీం విష్ణు వల్లభామ్।

అహోరాత్ర కృతం పాపం తత్క్షణా దేవ నశ్యతి॥"

సకృత్తుగా నైనా తులసిని స్మరిస్తే- ఆ అహోరాత్రాలలో చేసిన పాపం తక్షణమే నశిస్తుంది.

"తులస్యా శ్చైవ మాహాత్మ్యం నేష్ఠి వక్తుం హి విశ్వసృట్।
తవ తంజన మే తత్తే సర్వాభీష్టం ప్రయచ్ఛతి।
నాతః పర తరం కించిత్పావనం భువి విద్యతే॥"

భావం :- తులసీ మాహాత్మ్యాన్ని బ్రహ్మయైనా వచింపచాలడు. తులసి సంసార దుఃఖాన్ని తొలగిస్తుంది. సర్వాభీష్టాలనూ ప్రసాదిస్తుంది. ఇంతకంటె పావన మైనది భూమిలో ఇక లేదు.

"తులసీ మంజరీభిర్యః కుర్యాత్ హరిహరార్చనం।
న సత్ గర్భగృహం యాతి ముక్తిభాగీ భవేన్నరః॥"

తులసీదళాలతో హరిహరులను పూజించిన వాడు ఇక మాతృగర్భంలో పడకుండా ముక్తుడౌతాడు.

"సంఘృష్ట తులసీ కాష్ఠం యో దద్యా ద్రామ మూరని।
కర్పూరాగరు కస్తూరీ చందనం చ న తత్సమః॥"

తులసీకాష్ఠ తో తీసిన గంధాన్ని రామునకు సమర్పించిచే- కర్పూరాగరు కస్తూరీ చందనాద సుగంధద్రవ్యాలు దానితో సమానం కావు.

"తులసీ సన్నిధౌ ప్రాణాన్యే త్యజంతి మునీశ్వరాః,
న తేషాం నిరయ క్లేశః, ప్రయాంతి పరమం పదమ్॥"

తులసీ సన్నిధిలో ప్రాణం విడిచినవారు నరకబాధ పొందక కైవల్యాన్ని చేరుతారు.

"యః కుర్యాత్ తులసీ కాష్ఠే రక్షమాణాం సురూపిణీం।
కంఠమాలాంచ యత్నేన కృతం తస్యాఽ క్షయం భవేత్॥"

తులసీ పూసలను ధరించిన వాని ప్రయత్నాలన్నీ అక్షయాలవుతాయి. అందే అక్షయ ఫలాలు లభిస్తాయని భావం.

తులసి యొక్క ప్రతి భాగమూ వైద్యానికి పనికి వస్తుంది. గృహంలో తులసి వృక్షం ఉండి, దాని ఉపయోగం తెలిసిన వారికి అది కల్పవృక్షంగా ఫలితానిస్తుంది. శ్వాస, కాస, కుష్ఠ, అజీర్ణ, జ్వర, కఫ మందాగ్ని-వ్యాధులకూ; చర్మవ్యాధులకూ, కంఠవ్యాధులకూ, రక్తచాపానికి (బ్లడ్‌ప్రెషర్); పైత్య, వాత, శ్లేష్మ వ్యాధులన్నిటికీ తులసి దివ్యౌషధంగా పనికివస్తుంది. కేన్సర్ వ్యాధి నివారణలో కూడా తులసి ఉపకరిస్తుందని ఇటీవలి పరిశోధనలలో కనుగొన్నారు. తులసీ వృక్షం నుండి వచ్చేగాలి, దాని నుండి ప్రసరించే ఇన్‌ఫ్రారెడ్ కిరణాలూ-ఎన్నో వ్యాధులకు ఉపశమనంగా పనిచేస్తాయి

''చతుర్ణామపి వర్ణానాం ఆశ్రమాణాం విశేషతః। స్త్రీణాంచ పురుషాణాంచ పూజితేష్టం దదా తిహ॥

అన్ని వర్ణాల వారూ, అన్ని ఆశ్రమాలలోనివారూ-సర్వులూ తులసిని పూజించవచ్చును.

**138 ప్రశ్న :** యజ్ఞోపవీతాన్ని లఘు-గురు శంకల సందర్భంలో చెవికి చుట్టుకుంటారు. ఎందుకు?

**సమాధానం :**

"ఆదిత్యా వసవో రుద్రా వాయు రగ్నిశ్చ ధర్మరాట్।
పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాః సరిత స్తథా।
విప్రస్య దక్షిణే కర్ణే నివసంతి హి సర్వదా॥"

విప్రుని కుడిచెవియందు - ఆదిత్యుడు, వసువులు, రుద్రుడు, వాయువు అగ్ని, ధర్ముడు, పుష్కరాది తీర్థములు, గంగాది నదులు-సర్వదా నివసిస్తూ ఉంటారు.

లఘు, గురు శంకల సందర్భంలో మానవ దేహానికి అశుచి కలుగుతుంది. దేహానికి అశుచి కలిగినప్పుడు దేహాన్ని అనుక్షణమూ అంటి పెట్టుకొని ఉండి-కర్మార్హతను కలిగించే యజ్ఞోపవీతానికి అశుచి కలుగకుండే నిమిత్తం-యజ్ఞోపవీత పవిత్రతను నిలపడం కొరకు-దానిని పవిత్ర స్థానమైన కుడి చెవికి వెనుకనుండి చుట్టి మాలాకారంగా మెడలో వేసుకొనవలసి ఉంది.

అనగా ఆ కర్మలను ప్రారంభించడానికి యోగ్యతను, అర్హతను పొందుతారు. మానవులు తమకు శాస్త్ర విహితమైన ధర్మాచరణ విధులను యుక్తమైన మార్గాన ఆచరించవలసి ఉంది. మనోవాక్కాయ కర్మల చేత తనకు ధర్మ శాస్త్రం వల్ల విధించబడిన విధ్యుక్త ధర్మాచరణంలో నిమగ్నుడై ఉండే సమిష్టంగా ద్రష్టలైన ఋషులచేత కల్పించబడిన చిహ్నమే ఈ యజ్ఞోపవీతం

కాబట్టి యజ్ఞోపవీతమనే పదానికి అర్థం-మానవుని తనకు శాస్త్రం విధించిన కర్మకు సమీపంగా తీసుకొని పోయేది అని ఆ విధంగా మానవుని కర్మయందు ప్రవేశింప జేయడమే ఉపనయనం ఈ ఉపనయనం, యజ్ఞోపవీత ధారణల యొక్క ప్రధాన ఉద్దేశం మానవుని కర్మార్హునిగా చేయడమే.

ఉపవీతంలోని మూడు పోగులు ఈ జగత్తు సృష్టి, స్థితి, లయాత్మకంగాను; త్రిలోక త్రిమూర్తి, త్రివర్గ, త్రిగుణ త్రికాల, త్ర్యవస్థాత్మకంగాను. ఉండడాన్ని సూచిస్తాయి.

ఉపవీతంలోని ఒక్కొక్క పోగులోనూ తొమ్మిదేసి తంతువులు ఉంటాయి. తొమ్మండుగురు తంతు దేవతలు అధిష్ఠాన దేవతలై ఉన్నారు. వారు "ఓం కారాగ్నిశ్చ సోమః పితృ ప్రజావతీ వాయు సూర్యో విశ్వే దేవా ఇత్యేతా స్తంతు దేవతాః॥"

ఓంకారమూ, అగ్ని, సోముడు, పితృ, ప్రజాపతులు, వాయుదేవుడు, సూర్యుడు, విశ్వేదేవతలు. వీరు తంతుదేవతలు.

మూడు పోగుల ఉపవీతం - మానవ శరీరంలోని ఇడా పింగళా సుషుమ్నా నాడులకు కూడా చిహ్నం.

ఇక బ్రహ్మగ్రంధి - పరబ్రహ్మమును మానవుని శరీరంపై ఆరోపించి సర్వదా దేహ పవిత్రతను కాపాడే ఉద్దేశంతో ఏర్పరచబడింది.

ఉపవీత లక్షణం :

"త్రివృతం చోపవీతంచ తత్రైకో గ్రంధి రిష్యతే॥
నాభే రూర్ధ్వం మానా యష్య మధో నాభీ స్తపక్షయః॥"
-అని చెప్పబడింది.

అంటే- ఉపవీతం మూడు పోగులు కలిగి- ఒక గ్రంధితో కూడి ఉండాలి. ధరించినప్పుడు నాభికి సమానంగా ఉండాలి. నాభిస్థానంకన్న పైకి ఉంటే ఆయువుకు, నాభిని దాటి ఉంటే తపస్సుకు- భంగం కలుగుతుంది.

"యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తే చ కర్మణి।
వస్త్రాభావే తృతీయం తు గృహస్థో ధారయే ద్ద్విజః॥
చతుర్థ ముత్తరీయార్థ మాయుష్కామో బహూన్యపి।
గృహస్థస్య త్రివిధం ప్రోక్త మేకం వై బ్రహ్మ చారిణః॥

భావం : గృహస్థుడైన పురుషుడు శ్రౌత స్మార్త కర్మలయందు రెండు ఉపవీతములను ధరించదగినది. యుక్తమైన వస్త్ర లోప దోష నివారణకుగాను మూడవది, ఉత్తరీయానికి మారుగా నాల్గవది అయిన ఉపవీతాలను ధరించదగి ఉంది. ఆయుష్కాముడైనవాడు అంతకంటె ఎక్కువ ఉపవీతాలను ధరించ వచ్చును. బ్రహ్మచారి మాత్రం ఒకే ఉపవీతాన్ని ధరించవలెనని విధించబడింది.

యజ్ఞోపవీతాన్ని ధారణ చేయడానికి పూర్వం - ఆ ఉపవీతానికి పవిత్ర గ్రంథినివేసి - భగవంతునికి సమర్పించి, ఉచిత సంస్కారం చేసి ధరించవలసి ఉంది. ఇక్కడ సంస్కారమంటే - నూతన యజ్ఞోపవీతం కాని, వస్త్రం కాని ధరించక పూర్వం దానికి పసుపు కుంకుమలు పెట్టి సంస్కరించాలి. ఉన్న విధంగా వాడ కూడదు.

యజ్ఞోపవీతానికి ఆ సంజ్ఞ (పేరు) ఏర్పడడానికి - మరొక కారణం కూడా ఉంది. సృష్ట్యాదిలో ఉపవీతాన్ని ధారణ చేయకపోవడం, ఉపవీత మహాత్మ్యాన్ని గ్రహించకపోవడం లేదా దానిని ధరించిన ఉద్దేశాన్ని పాటించక పోవడం, ఉపవీత రహితంగా యజ్ఞాదికాలు చేయడం - వంటి దోషాలు అసురుల యందు కలిగాయి.

ఉపవీత మహాత్మ్య జ్ఞాన, ధారణ, అనుష్ఠాన యుక్తులై ఉపవీత ధారణ పూర్వకంగా యజ్ఞయాగాది క్రతు నిష్ఠాపరులైన దేవతలకు - ఆ అసురులకు ప్రాప్తం కానట్టి స్వర్గాది సామ్రాజ్య లాభం కలిగింది. ఆ కారణంగా ఉపవీతానికి యజ్ఞోపవీతమనే పేరు ఏర్పడింది.

**138 ప్రశ్న :** వివాహ సమయంలో "యోక్త్రధారణం" అనే తంతు జరుపుతారు. దీనిని గురించిన వివరణ తెలుపగోరుతాను.

**సమాధానం :**

ఉపనయనంతో వటువుకు కర్మార్హతను కలిగించినట్లే - ఈ పత్నీ వ్రతోపనయనం - వధువుకు కర్మార్హతను కలిగించడానికై ఉద్దేశించబడింది. ఉపనయన సమయంలో వటువుకు కూడా - మౌంజీ బంధనం, కృష్ణాజినం, యజ్ఞోపవీతం - వీటిని ధరింపచేయడంతో బాటుగా - ఈ యోక్త్రధారణం కూడా చేయిస్తారు. ఆ విధమైనదే వివాహంలో వధువుకు చేసే యోక్త్రధారణం కూడా.

"యోక్త్రము" - అంటే దర్భలతో రూపొందించబడిన త్రాడు. వివాహ సమయంలో వరుడు ఈ త్రాడును వధువు నడుము చుట్టూ కట్టి ముడివేయడం జరుగుతుంది.

వైదికమైన ఈ కర్మకు - "పత్నీ వ్రతోపనయనం" - అని పేరు

గృహస్థ జీవనంలో గృహిణిగా, కర్మిష్ఠియైన భర్తకు సహధర్మచారిణిగా - ఆమెకు సర్వకర్మలయందునూ కర్మార్హతను కలిగించడానికి చేసే క్రియా కలాపం ఇది.

ఈ సన్నివేశంలో వరుడు ఈ క్రింది మంత్రాన్ని ఉచ్చరిస్తాడు.

"ఆశాసానా సౌమనసం ప్రజాం సౌభాగ్యం తనుమగ్నే,
రనూరతా భూత్వా సన్నహ్యే సుకృతాయ కమ్॥"

"ఉత్తమమైన మనస్సును, యోగ్యమైన సంతానాన్ని, అధికమైన సౌభాగ్యాన్ని, సుందరమైన తనువును — ధరించి, అగ్నికార్యాలలో నాకు సహచారిణివై — సుకృతాలకూ సత్కర్మలకూ సంసిద్ధురాలవై ఉండు.

ఈ జీవిత యజ్ఞమనే మంగళ కార్యాచరణం నిమిత్తమై ఈ వధువు నడుముకు దర్భలతో అల్లిన త్రాటిని కడుతున్నాను."

**139 ప్రశ్న :** మనకు రామాయణ భారత భాగవతాలు కాక-ఇతర పవిత్ర గ్రంధాలేమైనా ఉన్నాయా? ఉంటే వాటిని గురించి తెలియజేయండి?

సమాధానం :

మనువు, రామాయణ, భారత, భాగవతాలు కాక – ఇతర పవిత్ర గ్రంధాలు అనేకం ఉన్నాయి. సర్వ భారతీయ ధర్మానికీ మూల భూతాలైన వేదాలు – వానిలో ప్రప్రధమంగా చెప్పదగినవి "వేదమూల మిదం సర్వమ్."

ఈ వేదాలు నాలుగు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వ వేదం ఈ వేదరాశి పరమేశ్వరుని నిశ్వాస రూపంగా వెలువడిందనీ, మహర్షులు ఆ వేదరాశిని దర్శించి మంత్ర ద్రష్టలైనారనీ చెప్పబడింది.

ఒక్కొక్క వేదమూ 4 భాగాలతో కూడుకొని ఉంటుంది. అవి: 1. సంహిత, 2. బ్రాహ్మణము, 3. ఆరణ్యకము, 4 ఉపనిషత్తు. ఈ నాలుగు భాగాలు నాలుగు వేదాల్లనూ ఉంటాయి.

సంహిత: వేదంలోని మంత్ర సంహితా భాగానికే సంహిత అని పేరు. కేవలమూ సంహిత మాత్రమే వేదమని కూడా ఒక వాదం ఉంది. "మంత్ర బ్రాహ్మణయోర్వేద నామధేయః॥ ప్రతి వేదంలోని సంహితా భాగమూ, బ్రాహ్మణమూ – కలిసి వేదంగా వ్యవహరించబడటం శిష్టజనామోదం పొందింది. ప్రతి వేదానికీ ఒక్కొక్క సంహితగా- ఋక్సంహిత, యజుస్సంహిత, సామ సంహిత, అధర్వ సంహిత – ఉన్నాయి. యజుర్వేదానికి చెందిన కృష్ణ యజుస్సంహిత, శుక్ల యజుస్సంహిత- అనే రెండింటితో మొత్తం వేద సంహితలు అయిదు.

బ్రాహ్మణము : సంహిత – వేద మంత్ర భాగం కాగా – దానికి వ్యాఖ్యాన ప్రాయమైనది బ్రాహ్మణం. అనేక యజ్ఞయాగాది క్రతు విధులూ, వాటి విధానాలూ – బ్రాహ్మణాల వల్ల తెలుస్తాయి

శతపధ బ్రాహ్మణం, తైత్తిరీయ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణం, గోపధ బ్రాహ్మణం, షడ్వింశ బ్రాహ్మణం, – ఇత్యాది బ్రాహ్మణాలు – కొన్ని మాత్రం ప్రస్తుతం లభిస్తున్నాయి. అనేకం నశించాయి. వేదసంహితలు అనేక శాఖలు ఆ శాఖలన్నిటికి బ్రాహ్మణాలు ఏర్పడ్డాయి.

ఆరణ్యకము: బ్రాహ్మణాలలో చెప్పిన విషయాలకు తర్వాతి విషయాలు ఆరణ్యకాలలో చెప్పబడ్డాయి. తైత్తిరీయ ఆరణ్యకం, ఐతరేయ ఆరణ్యకం- ఇత్యాది ఆరణ్యకాలున్నాయి. ధర్మము, ఆచార విధి నిషేధాలు– మొదలైన అంశాలను గురించి ఆరణ్యకాలలో చెప్పబడింది.

ఉపనిషత్తు : వేద శిరస్సులని ఉపనిషత్తులకు నామాంతరం, కారణం— వేదాలు కర్మమార్గ ప్రతిపాదకాలు ఉపనిషత్తులు జ్ఞానప్రతిపాదకాలు. జ్ఞానం-కర్మమార్గంకంటె సర్వోత్కృష్టం కావడంవల్లనే ఉపనిషత్తులు వేదాలకు శిరః స్థానీయాలుగా స్థాపించబడ్డాయి. ఉపనిషత్తుల సంఖ్య వివాదాస్పదం. వాటితో ప్రసిద్ధమైనవి 108.

వానిలో దశోపనిషత్తులు ఈ క్రిందివి. ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక, - ఉపనిషత్తులు.

ఇంకా బ్రాహ్మణాలు, అరణ్యకాలు అనేకం - దేవతాధ్యాయ, సంహితో పనిషత్, సామవిధాన, వంశ, పంచ వింశ (తాండ్య), షడ్వింశ, ఆర్షేయ, ఉపనిషత్ బ్రాహ్మణాదులు.

వేదాంగాలు 6. అవి- శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం. వేదానికి ముఖం వ్యాకరణం. జ్యోతిశ్శాస్త్రం వేదానికి కళ్ళు. నిరుక్తం చెవులు. కల్పం చేతులు. ఛందస్సు కాళ్ళు. శిక్ష ప్రాణమూ అని - పాణిని వ్రాసిన శిక్షా సూత్రం పేర్కొంటున్నది ఈ వేదాంగాలు వేద హృదయాన్ని తెలుపుతాయి.

నారదీయ, యాజ్ఞవల్క్య, శౌనక, మాండవ్య, వాసిష్ఠ, పారాశర కాత్యాయనీయ, గౌతమీయ, పాణినీయ శిక్షాగ్రంధాలున్నాయి.

వ్యాకరణం : వేదాంగాలలో ప్రముఖమైనది. వేద రక్ష చేయడమూ, వేద మంత్రాలలో లింగ విభక్తులను క్రతువులలో సవరించగలగడమూ, సాంగమైన వేద జ్ఞానం సంపాదించడమూ, శబ్ద ఫలాన్ని పొందడమూ, వేదార్థ నిర్ణయంలో సందిగ్ధ రాహిత్యమూ - ఇవి వ్యాకరణం వల్ల ఫలాలు.

ఛందస్సు : వేద మంత్రాలకు సంబంధించిన దేవత, ఋషి, ఛందో జ్ఞాన రహితంగా ఆయా మంత్ర ప్రయోగాదులు చేయరాదని - కాత్యాయన సర్వాను క్రమణి ద్వారా తెలియవస్తున్నది. ఛందో జ్ఞానంతో వేదాధ్యయన, ప్రయోగాలు చేయాలి.

నిరుక్తం : యాస్క మహర్షి నిరుక్తానికి కర్త. నిరుక్తం 3 కాండాలు. నైఘంటుక, నైగమ, దైవతా కాండలు.

జ్యోతిషం: వేదం యజ్ఞ ప్రధానం కనుక - యజ్ఞాచరణానికి అవసరమైన కాలజ్ఞానాన్ని కలిగించేది జ్యోతిషం. నియమిత సమయాలయందు ఆచరించవలసిన యజ్ఞాలు, వివిధ వ్రత విధులు, కర్మకాండకు సంబంధించిన వెన్నో కాల నిర్ణయలతో కూడినవై ఉన్నాయి. తత్సంబంధమైన జ్ఞానాన్ని కలిగించేది జ్యోతిశ్శాస్త్రం.

కల్పం: శ్రౌత - అనగా శ్రుతి (వేద) సంబంధమైన — సూత్ర గ్రంథాలే కల్పం.

ఈ శ్రౌత సూత్రాలు, లేదా కల్పసూత్రాలు — ఎన్నో ఉన్నాయి. వానిలో ఆపస్తంబ, కాత్యాయన, ఆశ్వలాయన, శాంఖాయన, లాట్యాయన, దాక్షాయన, వైతాన, మశక — శ్రౌత సూత్రాలు ముఖ్యమైనవి.

ప్రాతిశాఖ్యలు అనేకం వేదాన్ని ఉదాత్త అనుదాత్త స్వరిత స్వరాలతో ఏ విధంగా ఉచ్చరించాలో, పదాలను ఎలా విడదీయాలో, వేదానికి అర్థం ఏ విధంగా తెలుసుకోవాలో — ఇటువంటి అనేక విషయాలు ప్రాతిశాఖ్యలలో చర్చించబడినాయి. ఇవి ఎన్నో నశించగా ఏ ఉన్నవి అవి — ఋక్ప్రాతిశాఖ్యం, శుక్ల యజుః ప్రాతిశాఖ్యం, సామప్రాతి శాఖ్యం, అథర్వ ప్రాతిశాఖ్యం, తైత్తిరీయ ప్రాతిశాఖ్యం — అనేవి.

వేద మంత్రాలయొక్క స్వరూపాన్ని, మంత్ర దేవతలయొక్క స్వరూపాన్ని వివరించే గ్రంథానికి 'బృహద్దేవతా గ్రంథ'మని పేరు. ప్రతి వేదానికీ ఇది ఉంటుంది.

మంత్రాధిష్ఠాన దేవతలు, ఋషులు, ఛందస్సులు, సంహితా విభాగ ప్రణాళికవంటి వివరాలతో — వేద స్వరూప రక్షణకోసం నిర్దేశించినవి 'అనుక్రమణిక'లనే గ్రంధాలు బృహత్సర్వానుక్రమణి, కాత్యాయనుని ఋక్సర్వానుక్రమణి, శౌనకుని సూక్తానుక్రమణి, అనువాకానుక్రమణి, దేవతానుక్రమణి, ఛందోనుక్రమణి. ఆర్షానుక్రమణి, పాద విధానం, ఋగ్విధానం, ఆశ్వలాయనీయ అనుక్రమణి, కాత్యాయనుని శుక్లయజుస్సర్వానుక్రమ సూత్రం యాస్కుని (కృష్ణయజుర్వేద) యాజుష సర్వానుక్రమణి — ఇవన్నీ శ్రేష్ఠమైన అనుక్రమణిక గ్రంథాలు.

రావణ, సాయణ, యాస్కాదులు వ్రాసిన వేద భాష్యాలు ఉన్నాయి.

అష్టాదశ స్మృతులు : మను, దక్ష, యమ, బృహస్పతి, శంఖలిఖిత, పరాశర, యాజ్ఞవల్క్య, విష్ణు, అత్రి, అంగిరస, సంవర్త, శాతాతప, ప్రాచేతస, హారీత, ఆపస్తంబ, గౌతమ, ఉశనస, అశ్వలాయన స్మృతులు.

అష్టాదశ పురాణాలు : మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మవైవర్త, వామన, వాయువ్య, వైష్ణవ, వారాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద—పురాణాలు.

అష్టాదశ ఉప పురాణాలు: ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దుర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పరాశర, అంగిరస సంహిత, భృగు సంహిత, మారీచ, మానవ, వాసిష్ఠ, లింగ, వారుణ — పురాణాలు.

పైన చెప్పినవి గాక ఉపవేదాలు నాలుగు. ఒక్కొక్క వేదానికి ఒక్కొక్క ఉపవేదంగా ఇవి ఉన్నాయి.

1. ఆయుర్వేదం : ఇది ఋగ్వేదానికి ఉపవేదం. దీనికి కర్తలు — బ్రహ్మ, అశ్వినీ దేవతలు, ధన్వంతరి — మొదలైనవారు.

2. ధనుర్వేదం : ఇది యజుర్వేదానికి ఉపవేదం. దీనికి కర్త విశ్వామిత్రుడు. ఆయన దీనిని బ్రహ్మదేవుని నుండి, శివుని నుండి ఉపదేశంగా పొందాడు.

3. గాంధర్వ వేదం : ఇది సామవేదానికి ఉపవేదం. దీనికి కర్త భరత మహర్షి.

4. అర్థవేదం : ఇది అథర్వ వేదానికి ఉపవేదం. అథర్వవేద సారంగా రూపొందించబడింది. ఈ అర్థవేదంలో నీతిశాస్త్రం, అశ్వ శాస్త్రం శిల్పశాస్త్రం, పాకశాస్త్రం — వంటి అనేక శాస్త్రాలు దీనిలో ఉన్నాయి. ఈ శాస్త్రాలన్నిటికీ కర్తలు అనేక మంది.

ఇంకా చెప్పవలసిన వెన్నో వున్నాయి కాని — ఈ గ్రంథాలను గురించి చెప్పేదే ఒక గ్రంథమవుతుంది.

**140 ప్రశ్న :** సుబ్రహ్మణ్య షష్ఠి ప్రాముఖ్యం — ఏమిటి? సుబ్రహ్మణ్యేశ్వరుని పూజించడంలోని పరమార్థం ఏమిటి? సుబ్రహ్మణ్యేశ్వరుని ఘనత ఏమిటి?

సమాధానం:-

సుబ్రహ్మణ్య షష్ఠి – సుబ్రహ్మణ్యేశ్వరుని జన్మతిథి. కార్తికేయుడుగా, కుమారస్వామిగా పిలువబడే సుబ్రహ్మణ్యేశ్వరుడు – మార్గశిర శుద్ధ షష్ఠినాడు జన్మించాడు. ఆయన జన్మించిన పుణ్యతిథి-ఆయన పేరిట సుబ్రహ్మణ్యషష్ఠిగా ప్రసిద్ధమైంది. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని జన్మతిథినాడు ఆయనను పూజించడం ఆయనకు అధిక ప్రీతికరం కనుకనే ఆనాడు ఆయనను పూజించడం. సుబ్రహ్మణ్యేశ్వరుని ప్రీతికై ప్రతి మాసంలోనూ వచ్చే శుద్ధ షష్ఠీ తిథియందు కూడా సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధించడం సంప్రదాయం.

సుబ్రహ్మణ్యేశ్వరుడు, షణ్ముఖుడు. ఆయనకు ఆరు ముఖాలు. ఆయనను పెంచినవారు షట్ కృత్తికలు షష్ఠి తిథి సుబ్రహ్మణ్య తత్త్వానికి ప్రాతినిధ్యం వహించే తిథి.

సుబ్రహ్మణ్యస్వామి ప్రత్యక్ష ఫలదాయకుడైన భగవంతుడు. వాంఛితార్థ ఫలసిద్ధి, జననాయకత్వం, శత్రువిజయం, ఆరామాది ప్రాప్తి, రోగ నివృత్తి, భూలాభం, కృత్యప్రాప్తి, సంతాన ప్రాప్తి – ఇవన్నీ సుబ్రహ్మణ్యస్వామి ప్రసాదించే ఫలాలు.

సర్పదోషం, చిత్తచాంచల్యం కుసుమవ్యాధులు స్రావదోషాలు సంతానం కలిగి మరణిస్తూ వుండడం, సంతానం కలుగకుండడం, గర్భస్రావాలు, రక్తస్రావ వ్యాధులు, నేత్రవ్యాధులు, కర్ణవ్యాధులు, కంఠవ్యాధులు, కామెర్లు, మూత్రకోశవ్యాధులు, కాలెయ వ్యాధులు, అత్యుష్ణ సంబంధవ్యాధులు చర్మవ్యాధులు, మూర్ఖులవల్ల కలిగే అపకారాలు, దాంపత్యంలో భార్యాభర్తలకు పొసగకుండడం, వివిధాలైన దాంపత్యదోషాలు, క్రిమిదోషాలు, మశూచి, క్రిమిసంబంధమైన సర్వవ్యాధులు, పొంగు, ఆటలమ్మ, అన్నిరకాల వైరస్‌వల్ల వచ్చే జ్వరాలు, స్త్రీ పురుషులలో వంధత్వం, పశుకామాధికాములవల్ల కలిగే పీడలు – వీనికి ఇంకా అనేక విషయాలకూ సుబ్రహ్మణ్యస్వామి అధికారి. మానవుల నిత్యజీవితంలో ఎదురయ్యే అనేక విషయాలకు, సమస్యలకు తీర్పరి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి.

మానవ జీవితాలను పాలించే నవగ్రహాలు ఉన్నాయి. ఆ గ్రహాలకు ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క అధిదేవతలున్నారు. ఆ అధిదేవతలను సంతృప్తిపరచినట్లయితే ఆ అధిదేవతా సంబంధమైన గ్రహాలు సంతృప్తులౌతారు. అప్పుడు ఆయా గ్రహసంబంధమైన దోషాలు, వానివల్ల ఏర్పడిన దుష్ఫలితాలు – నివృత్తి కాగలవు.

నవగ్రహాలలో – అంగారకుడు – అనబడే కుజా – అధిదేవత శ్రీ సుబ్రహ్మణ్యస్వామి. పైన చెప్పిన బాధలు, సమస్యలు గినప్పుడు – ఒక్కొక్క రకమైన సమస్యలు, చిక్కు పరిస్థితులకు – ఆ సమస్యా స్వరూపాన్ని అనుసరించి ఒక్కొక్క విధానంగా ఆ యా గ్రహాలనూ అధిదేవతలనూ సంప్రీతులను చేయవలసివుంది గ్రహాలు మణిమంత్రౌషధాలతోను, ఇతర విధాలైన అనేక సేవలతోను సంప్రీతులౌతారు. వారికి అధిదేవతలైన దేవతలనూ-సమస్యా స్వరూపాన్ని బట్టి-సంతృప్తులను చేయడానికి వేర్వేరు విధానాలున్నాయి.

మానవ శరీరంలో మూలాధారంనుండి సహస్రారం వరకు వ్యాపించి ఉన్న సుషుమ్నా నాడియే శ్రీ సుబ్రహ్మణ్యస్వామి కుండలినీ శక్తి అనే పేరుగల ఈ శక్తి-సర్పాకారం కలిగి ఉంటుంది మానవుడు ప్రాపంచిక విషయాలయందు నిమగ్నుడై ఉన్నప్పుడు కుండలిని యొక్క శిరోభాగం మానవుని మూలాధారం వద్దనూ, పుచ్ఛ (తోక) సహస్రారం వద్దనూ ఉంటుంది. మానవుడు ప్రపంచం నుండి విముఖుడై అంతర్ముఖుడై యోగమార్గాన సమాధిగతుడైనప్పుడు – అతడి కుండలిని యొక్క శిరస్సు సహస్రారంలోను, తోక మూలాధారంలోను వుంటాయి. మానవుని సహస్రారంలో శివుడు నెలకొని ఉంటాడు. కుండలినీ రూపంతో ఈ సుబ్రహ్మణ్యస్వామి ఆయనకు పడగలు పట్టి ఉంటాడు. ఈశ్వరుడు భుజంగ భూషణుడు కావడంలోని అంతరార్థం ఇదే

ఇహంలోని ఇష్టకామ్యాలను ప్రసాదించే సుబ్రహ్మణ్యస్వామి – శుద్ధ జ్ఞానస్వరూపుడు, మోక్ష ప్రదాయకుడు, పరమ జ్ఞానదాయకుడు కూడా అయి వున్నాడు.

ఆయా జాతకులకు ఏర్పడిన సమస్యలు, కలిగిన పరిస్థితులను బట్టి – సుబ్రహ్మణ్యేశ్వరుని అర్చించే విధి విధానాలలో మార్పులు చేయవలసి ఉంటుంది. సమస్యా స్వరూపాన్ని బట్టి మాత్రమే ఏ దేవతలనైనా అర్చించే విధి విధానాన్ని నిర్ణయించవలసి ఉంది.

జాతకుల జాతకాన్ని బట్టి – ఆయా వ్యక్తులు అర్చించవలసిన దేవతలెవరో, వారిని ఏ విధానంగా అర్చించాలో నిర్ణయించాలి.

ఐతే – శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధించే విషయంలో చాలా నియమనిష్ఠలు అవసరం. ఏ మాత్రం అనాచారమూ జరగకుండా జాగ్రత్త వహించాలి. అప్పుడే సుబ్రహ్మణ్యేశ్వరునికి అనుగ్రహం కలుగుతుంది.